# MANASULONI MAATA

Collection of Essays in Telugu
by ***Dr. J. BAPU REDDY***

First Edition : 1991

Price: Rs. **30.00**
**US$ 5.00**

Cover design: **Gopi**

*Printed at :*
**Vipla Computer Services**
**1-8-725/A/1/A,** Nallakunta
Vegetable Market Lane
HYDERABAD - 500 044.

*Published by :*
**JAYAM PUBLICATIONS**
Plot No.10, Road No.5
Jubilee Hills
HYDERABAD - 500 034
INDIA

Dedicated to ***Prof. P. Venugopala Rao,***
University of Emory, Atlanto, Georgea (USA)
on the occasion of Eighth *North America*
*Telugu Conference at Atlanta*
**JULY 5-6, 1991.**

# అంకితం

**_Dedicated to Prof. P. Venugopala Rao_**



ఆచార్య పెమ్మరాజు వేణుగోపాలరావు గారు

కుటుంబసభ్యులతో

సతీమణి శ్రీమతి పి.యస్. లక్ష్మీరావు (మధ్యలో),

కూతుళ్లు, నళిని (ఎడమవైపు), సలీనా (కుడివైపు).

అణుశాస్త్ర పరిశోధనా తపస్వి,

భౌతికశాస్త్ర ప్రబోధనా యశస్వి,

గిరిజా కల్యాణాది నృత్యనాటికా ప్రయోక్త,

భావ విరజామోద "కాస్మిక్ కవిత" స్రష్ట

ఆచార్య పెమ్మరాజు వేణుగోపాలరావుగారికి

ఎనిమిదవ ఉత్తర అమెరికా తెలుగు మహాసభల (జూలై 5-6)

సందర్భంలో నా "మనసులోని మాట"

స్నేహోపాయనంగా అంకితం.

– జె. బాపురెడ్డి

# మనసున్న మాట

బాపురెడ్డి పద్యం పలుకుబడికే అందం అని యువలోకం ఎలుగెత్తి కీర్తించిన గుర్తులు ఇంకా నాకు జ్ఞాపకం ఉన్నాయి. అర్థ శాస్త్రంలో నుండి పదార్థ శాస్త్రాన్ని పిండి కవితగా మలిచే యువకళా శిల్పి విద్యార్థిగా మా మధ్య తిరుగుతూనే భావలోకాల్లో విహరిస్తూ ఉండేవారు బాపురెడ్డి గారు.

అలనాడు ఆంధ్రాభ్యుదయోత్సవ కోలాహలంలో బాపురెడ్డి వాణి ప్రజల మనసుల్ని ఉయ్యాల లూపుతూ ఉండేది వ్యాఖ్యాన హేలలతో. వారి గేయ కావ్యాలు వేదిక మీద స్వప్న ఖండాల్లా వెలిగిపోతుండేవి. ఇంద్రధనుసుల్లా వెల్లి విరుస్తుండేవి. పూర్వ కవుల తరానికి భరతవాక్యం పాడుతూ, యువతరానికి నాందిని ఆలపిస్తున్నట్లు బాపురెడ్డి రాకెట్ రాయబారం, ఆనాటి సహృదయ మందిరాలు ప్రతిధ్వనించాయి.

బాపురెడ్డి పద్యం ఎంత నేర్పుగా నడుస్తుందో, గేయం అంత ఒయ్యారంగా లాస్యం చేస్తుంది. గేయంలో గతి వైవిధ్యం చూపించటం బాపురెడ్డి కలానికి ఉగ్గుతో వచ్చిన విద్య. గేయ గతిని తాళమయం చేసి ఎన్ని శ్రుతులు వినిపించగలరో వచన కవితను భావమయం చేసి అన్ని లయలను పలికించగలరు బాపురెడ్డిగారు. వారికి కవిత్వం జీవిత భాగస్వామి. నాకు తెలుసు - ఆయన మిత్రులతో లోకాభిరామాయణం మాట్లాడి కంఠశోష పెట్టుకోరు. జీవితాన్ని రమణీయంగా చూడటం, నిర్మలంగా భావించటం, నిండుగా కవితలో నింపటం ప్రతీకాత్మకంగా అనుభూతిని ఆవిష్కరించటం మాటల్లోనే జరిగిపోతుంది ఆయన సదా స్పందిస్తున్న కవిత.

బాపురెడ్డి కవిగా సాహితీ లోకంలో ప్రసిద్ధి చెందారు. ఈ సంపుటిలో విమర్శకుడుగా సాక్షాత్కరిస్తున్నారు. 'గద్యం కవీనాం నికషం వదంతి' అన్నారు ఆనాడు. ఈనాడు సందర్భం మారినా పైకి మాత్రం నిలిచింది. పద్యం అల్లినా గేయం పాడినా, వచన కవితలు రచించినా మాటల్లో కూడా కవితా గంధాన్ని గుబాళిస్తేనే కవి కాగలుగుతాడని ఆసూక్తికి అర్థం చెప్పుకోవచ్చు. మామూలు మనిషి కంటె, మహాపండితుని కంటె, ఒక కవి మాట్లాడే తీరులో, ఆ మాటలను వ్యాసంగా తీర్చే వైఖరిలో ఏదో ఒక అపూర్వమైన అలౌకికమైన లయాత్మకత, భావుకత, రసాత్మకత భాసించాలి. బాపురెడ్డి గారి వ్యాసం లయాత్మక వాక్యసముదాయం, విహరించే భావ విహంగం, రవళించే రసరాగతరంగం. కవి

చదివిన అనుభూతిని కలిగిస్తుంది బాపురెడ్డి గారి వచన రచన.

కవి కొక దర్శనం ఉంటుంది; దాని ననుసరించి కొన్ని సిద్ధాంతాలు రూపొందుతాయి. వాటిని వ్యక్తీకరించే రీతులు కూడా ఏర్పడతాయి. వాటినుండి వస్తువు, రూపం, అలంకారం, శిల్పం క్రమంగా ఆవిర్భవిస్తాయి. ఈ సంభారమంతా కవితలో కనుమరుగై అనుభవ బిందువులో రసీభవించి ఉంటుంది. దాన్ని అలాగే కవి కవితగా ఆవిష్కరిస్తాడు. మరి – ఆ కవియే తన కవితను గురించి వివరించే ప్రయత్నం చేసినప్పుడు వ్యాసం రూపొందుతుంది. అందులో కవి తనంతట తాను ఆవిష్కరింపజేసుకొంటాడు. బాపురెడ్డి కవితాకళను గురించి ముచ్చటించినప్పుడెల్లా ఆయన లోని కవిని ఆయనశిల్పరూపంగా మలచి మనకు చూపిస్తున్నాడా అనిపిస్తుంది.

బాపురెడ్డిగారు కవిగా చాల నిరంకుశులు. తా మనుకొన్న అనుభవాన్ని ఇవ్వగలిగిన శబ్దాన్ని హృదయకోశంలో ఏ మూల ఉన్నా గాలించి పైకి లాగుతారు. తా మెన్నుకున్న ప్రతీక భావపక్షాలతో బాగా ఎగురగలిగితేనే కవితాకాశంలో విసిరివేస్తారు. ప్రతి భావానికి రంగు రుచి వాసన ఉన్నట్లు అనుభవిస్తారు; ఆవిష్కరిస్తారు. వారి భావనలో ద్వంద్వస్థితి నుండి ద్వంద్వాతీత స్థితికి మనసు పయనించే ఒక మనోహర రస ప్రస్థానం ప్రతిఫలిస్తూ ఉంటుంది. జగత్తులో సుఖ దుఃఖాలను ఎంత వాస్తవంగా గ్రహిస్తారో, వాటిని కళాసృష్టి ద్వారా ఆనందయోగంగా మార్చుకొనే ప్రక్రియను కూడా అంత నిజంగా అనుభవిస్తారు. ఈ మానసిక యోగం నుండి త్రిగుణాల్లాగా, త్రిశరణాల్లాగా బాపురెడ్డి గారి కవితాప్రస్థానంలో ప్రణయం, ప్రణవం, ప్రగతి అనే శక్తులు పుట్టాయి. ఈ మూడింటి సంయోగమే వారి కవితా జీవితం.

ప్రణయంలో ఇంద్రియానుభవంనుండి ఆత్మానుభవం వరకు సాగే ప్రగతి భావాన్ని దర్శిస్తారు; ప్రణవ సహాయంతో దాన్ని అద్వైతంగా అనుభవిస్తారు. వాస్తవ జీవితంలోని విజ్ఞానం, ఆధ్యాత్మిక జీవితంలోని ఆత్మజ్ఞానం, కవితా జీవితంలోని అనుభవజ్ఞానం – ఏదీ మిధ్య కాదంటారు బాపురెడ్డి గారు. ఆ తత్త్వచింతనలో నుండి భావభౌతిక వాదం వెలువడింది. వ్యాసాలలో అది వివరింపబడింది.

తిక్కన, వేమన, త్యాగయ్య, కట్టమంచి, శ్రీ శ్రీ, బోయి భీమన్న, కుందుర్తి, సి. నారాయణరెడ్డి మొదలైన కవులను గురించి బాపురెడ్డిగారి భావస్పందనలు విశిష్టంగా ఉంటాయి. 'యుగకర్త' అనే భావనకు ఆయన

ప్రతిస్పందన మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. నిర్భయంగా నిజం చెప్పే ధైర్యం -ఆయన మాటల్లోనే చెప్పాలంటే నిత్యసత్య దర్శనం నుండి ఏర్పడింది. బాపురెడ్డి తన కవితలో తత్త్వాన్ని కప్పి చెబుతారు. వ్యాసాలలో తత్త్వాన్ని విప్పి చెప్పారు.

డాక్టర్ బాపురెడ్డి గారు మానవతావాది. ప్రపంచమంతా ఒక కుటుంబంగా భావిస్తారు. దానిని కవితలో ప్రపంచించారు. పురుషార్థాలన్నీ పవిత్రమైనవని భావిస్తారు. జీవితగమ్యాన్ని కామం ఒక్కటే కాని, అర్థం ఒక్కటే కాని సాధిస్తుందని ఏ సిద్ధాంతం చెప్పినా రెడ్డిగారు అంగీకరించరు. వారి కవితా సంపుటులు మానవ పురుషార్థాలన్నింటి సమష్టి సమగ్ర ఫలరూపమైన జీవనతత్త్వాన్ని చిత్రిస్తాయి. బాపురెడ్డి కవిత సమగ్ర మానవతను దర్శించటానికి ఒక రమ్యాలోకం. అందువల్ల వారి ' ఆత్మశ్రుతి' కవితాగీతిలో వినవచ్చే స్వరలయ.

బాపురెడ్డి గారి భాష ప్రతీకాత్మకంగా మాట్లాడుతూ భావలోకాలను పరిచయం చేస్తున్నా నేలమీదనే నడుస్తుంది. 'అంతా మన చేతుల్లోనే ఉంది' అనే కర్మయోగి వారి కవిత. భౌతికమే ఆధ్యాత్మికం అనే మర్మయోగి వారి విమర్శ.

బాపురెడ్డి గారి కావ్యాలు అనేకం అమెరికాలో, ఇంగ్లాండులో, మలేషియాలో, బ్యాంకాకు మొదలైన విదేశాలలో ఆవిష్కరింపబడి ప్రజాంకితం, దైవాంకితం, మిత్రాంకింతం చేయబడ్డాయి. ఈ పుస్తకాన్ని వారు ఎనిమిదవ ఉత్తర అమెరికా తెలుగుమహాసభల్లో విడుదల చేస్తూ శాస్త్రవేత్త సాహిత్యమూర్తి అయిన ఆచార్య పెమ్మరాజు వేణు గోపాలరావు గారికి అంకితం చేయడం ఆయన విశ్వ జనీన సాహిత్య త్వానికి,వినిర్మలస్నేహశీలానికి నిదర్శనంగా నేను భావిస్తున్నాను. ఇందుకు తానా సభ్యులను, కృతకర్తను 'కృతిస్వీకర్తను అభినందిస్తున్నాను.

కవిగా ప్రపంచ సంస్థల సన్మానాల నందుకొన్న డాక్టర్ బాపురెడ్డి గారు సహృదయ విమర్శకుడుగా సాహితీ జగత్తులో సమున్నత స్థానాన్ని పొందాలని మనసారా ఆకాంక్షిస్తూ, వారితో నాకున్న స్నేహానికి చిహ్నంగా ఈ మనసున్న మాటను చిరుకానుకగా కృతజ్ఞతలతో అందజేస్తున్నాను.

- జి.వి. సుబ్రహ్మణ్యం

తెలుగు ప్రొఫెసర్

మరియు డీన్ స్కూల్ ఆఫ్ హ్యూమానిటీస్

హైదరాబాదు కేంద్ర విశ్వ విద్యాలయం

హైదరాబాదు-500 134

# అట్లాంటాలో ఆత్మావిష్కరణం

ఇప్పుడు నేను అమెరికాలో ఉన్నాను. అట్లాంటా జార్జియాలో జరుగుతున్న ఎనిమిదవ ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో పాల్గొంటున్నాను. ప్రతిభామయులైన ప్రవాసాంధ్రులు, భారతీయ సాహిత్య సంస్కృతులకు ప్రతిబింబాలై జరుపుకుంటున్న ప్రగతి పర్వంలో పాలుపంచుకుంటున్నాను. తెలుగుగడ్డ మీద పుట్టి పెరిగిన నేను విశ్వ చైతన్యయాత్రలో అమెరికా గుండెలో అతిథి గుడారం వేసుకున్నాను. మనిషినీ మనిషినీ దైవత్వ సూత్రంలో ముడివేసే నా "మనసులోని మాట" చెపుతున్నాను. సత్యమంగళ వేణుగాన సుధాస్నాతుడనై సుందరభావ బృందావనంలో ఆత్మానందం అనుభవిస్తున్నాను. సమ్యక్ షట్ ఋతురాగ హేలలో పులకిస్తున్నాను. తెలుగుతల్లి మమతల మల్లె పూదండను , దీవించే దేశ కాలాల మెడలో నేడు తిలకిస్తున్నాను. జార్జియా నిర్ఝర గళంతో గళం కలిపి విజయ గగన పర్జన్యంలా గర్జిస్తున్నాను.

అవును, నేను అమెరికాలో తేజరిల్లే తెలుగు సోదరులను అనేకసార్లు కలిసికొన్నాను - డెట్రాయిట్ లో లాసాంజలిస్‌లో హ్యూస్టన్ లో వారి క్షేమం తెలిసికొన్నాను. మళ్లీ వారి ప్రేమ పిలుపు అందుకొని, ఇప్పుడు అట్లాంటాలో కలిసికొంటుంటే కల నిజమౌతున్న కళ చూస్తున్నాను. షికాగోలో చిటపట చినుకులు పడుతున్నా తటపటాయించకుండా అట్లాంటా కొమ్మ మీద తందాన తాన ఆడుకుంటున్న, పాడుకుంటున్న తెలుగు పులుగులను చూచి వెలిగిపోతున్నాను. "కొట్లాడుకోవడం తెలిసిన వాళ్లు తెలుగువాళ్లు - మళ్లీ మాట్లాడుకోవటం తెలిసిన వాళ్లూ తెలుగు వాళ్లే " అంటూ నే నేనాడో పలికిన భాషితం సత్య భూషితం అవుతుందనుకుంటున్నాను. ఢిల్లికి రాజైన తల్లికి కొడుకే అన్నట్లు, తెలుగువాడికి, తెలుగువాడెంతటి వెలుగు వాడైనా, తెలుగు వాడుగానే కనిపిస్తాడు. అఖిల భారతదేశానికి ఆంధ్రుడు ప్రధానియైన ఈ అపూర్వ శుభతరుణంలో కష్టాలు కలహాలు ఎన్ని ఉన్నా తెలుగు ప్రజా ప్రగతి ప్రహ్లాదునికి భయం లేదు.

గతంలో జరిగిన ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో నా కవితా సంపుటాలు కొన్ని - అనంత సత్యాలు, శ్రీకార శిఖరం, ప్రణవ ప్రణయం - ఆవిష్కరించే అదృష్టం నాకు దక్కింది. పైగా అమెరికన్ కవయిత్రి Knarig Boyadjian ఆంగ్ల కవితా సంపుటి "There Is No Time" ను "వ్యవధి లేదు" అనే శీర్షికతో అనువదించి Los Angeles సభల్లో ఆవిష్కరించిన సదవకాశం కూడా నాకు దక్కింది. మరి ఇప్పుడు నా "మనసులోని మాటను " ఈ మహాసభల్లో ఆవిష్కరిస్తున్నందుకు ఎంతో గర్విస్తున్నాను. ఈ వ్యాస సంపుటి నా సత్య సాహిత్య దర్శన గ్రంథంగా నేను అందిస్తున్నాను.

భౌతిక శాస్త్రవిజ్ఞాన ఖని, కాస్మిక్ కవితా కళాధుని, సుహృన్మణి ఆచార్య పెమ్మరాజు వేణుగోపాలరావుగారికి ఈ కృతిని అంకితం చేయగలుగు తున్నందుకు ఆకాశ మెత్తు మురిసిపోతున్నాను. అమెరికాలో తెలుగు సంస్కృతి తొలికేతనం ఎత్తిన

తేట తెలుగు బిడ్డ పెమ్మరాజా. ప్రపంచ ప్రఖ్యాత జన్యు శాస్త్రజ్ఞుడు నా "ప్రేమ
కావ్యాంకితుడు డా॥ పి. మీరాఖాన్ గారి ద్వారా పెంపొందిన మా స్నేహం
దాహం. మీరాఖాన్, పెమ్మరాజా పట్ల నేను పెంచుకున్న అభిమానం నా
ఇచ్చుకున్న బహుమానం. వారిద్దరూ ఆత్మమిత్రులు; తెలుగుభారతికి
పురస్కారం ప్రసాదించగలిగిన విజ్ఞాన విహాయస పుత్రులు.

ఈ సుందర రసబంధుర సన్నివేశంలో పాల్గొనే అవకాశం
మిత్రులందరికీ ముఖ్యంగా తానా అధ్యక్షులు డా. నల్లమోతు సత్యనారాయ
మహాసభల సమావేశకర్త డా॥ వాడపల్లి మంగరాజాగారికి, నిస్వార్థ కార్యకర్త డా॥
దేవరాజ్ గారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు. పూజ్యులు డా॥ యస్. ఆబిద్
డా॥ కె. రఘునాథన్, డా॥ రాజారెడ్డి, శ్రీ డి.ఆర్. రాజా, డా॥ విజ
డా॥ జెడ్.ఎ. రిచర్డ్స్, డా.కె. సురేంద్రరెడ్డి, శ్రీ ఆనందమోహన్, శ్రీ
రెడ్డి, శ్రీ జె. బాలాజీ, డా॥ కె. సత్యనారాయణ, శ్రీమతి ఎస్తర్ గ్రేస్,
యం.రావు, శ్రీ రఘురాం వొల్లాల, శ్రీ యన్.ఆర్. మాచిరాజా, శ్రీ గంగా
శ్రీ రవి వొల్లాల మొదలయిన ప్రపంచ వ్యాప్త ఆప్తులు నా సాహిత్య
దోహదం చేశారు. వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

నా "మనసులోని మాట" పలకడానికి తోడ్పడిన సహృ
మానులందరికీ వందనాలు. పూజ్యులు జ్ఞానపీఠ పురస్కారం పొందిన ఆ
సి.నారాయణరెడ్డి గారు, మహాకవి కళా ప్రపూర్ణ బోయి భీమన్నగారు,
శ్రీనివాస్, శ్రీ పి.వి. రమణయ్య రాజా, ఆత్మీయులు ఆచార్య
అమీరుద్దీన్, శ్రీ ఎ.వి.ఎస్. రాజు,. శ్రీ వి. చంద్రమౌళి, శ్రీ జె. యం. గ్రి
ఎమ్.కె. రాము, శ్రీ డి.వి.ఎస్. రాజా, శ్రీ ఎమ్. సూర్యనారాయణ మూర్తి, డా
ప్రసాదరావు, శ్రీ కె.ఎస్.సి. బాబు, శ్రీ పి.వి. ప్రసన్నారెడ్డి నా సాహిత్య
తోడ్పడుతున్న అగణిత శ్రేయోభిలాషులకు ప్రతీకలు. వారు నాకు అం
అభిమానం నేను తీర్చుకోలేని ఋణం. నన్ను వెన్ను తట్టి నడిపిస్తున్న శక్తి
వెంట వెలసిన నా శ్రీమతి రాజేశ్వరి. ఆమెను మీరే అభినందించండి.

ఎంతో శ్రమ కోర్చి, ఎక్కడెక్కడో పడిఉన్న నా వ్యాసాల
చోటికిచేర్చి ఈ గ్రంథ రూపంలో తీర్చిన జయం పబ్లికేషన్స్ వారికి ముఖ్య
జె. మారుతి గారికీ, ఎంతో భక్తి శ్రద్ధలతో పుస్తకాన్ని ముద్రించి ముస్తాబ
వినయశీలి శ్రీ విజయసేనారెడ్డి గారికీ, అడగగానే భావస్ఫోరకమైన ముఖ
రచించిన శ్రీ గోపిగారికీ, నా ప్రశంసా పూర్వక కృతజ్ఞతలు. చెలిమియే
ప్రతిభయే పదవిగా జీవిస్తున్న నా "రంగు రంగుల చీకట్లు" కృతి భర్త, ఆచా
సుబ్రహ్మణ్యం ఈ పుస్తక పీఠిక కర్త కావడం నా అదృష్టం. ఆయనకు నా ఆ
ఘటిస్తూ సెలవు తీసుకొంటున్నాను.

అట్లాంటా జార్జియా

*5.7.1991* జె. బా

# కవిత్వం ఎందుకు?

కవిత్వం ఎందుకు? చాల జటిలమైన ప్రశ్న. జీవితం ఎందుకు అన్నంత సున్నితమైన ప్రశ్న. జిజ్ఞాసువులను, రసజ్ఞులను నిరంతరం ఎదుర్కొనే ప్రశ్న ఇది. ఈ ప్రశ్నకు సమాధానం అంత సులభంగా లభించేది కాదు. పైగా ఇది ఒక్కటే సమాధానం అని చెప్పటానికి వీలున్న ప్రశ్న కాదు. అయితే కవిత్వం అంటే ఏమిటో తెలిసికోగలిగితే, అది ఎందుకు అనే ప్రశ్నకు సమాధానం సులభంగా వెదుక్కోవచ్చు.

కవిత్వం గురించి ఎవరు ఏమని చెప్పారో చెప్పడం ఇక్కడ నా ఉద్దేశ్యం కాదు. నేటి యువకులు ఎవరికి వారు ఏది కవిత్వమో, అది ఎందుకు కవిత్వమో, దాని ప్రయోజనమేమిటో అవగాహన చేసుకోవటానికి కావలసిన సాధన సామాగ్రిని అందించటానికి ప్రయత్నిస్తాను.

కవిత్వానికి ఒక నిర్వచనం అంటూ ఏదీ లేదు. ఎవరికి తోచినట్లు వారు దాన్ని నిర్వచించారు - నిర్వచిస్తున్నారు. అయినా స్థూలంగా "రసానుభూతిని కలిగించే భావప్రకటనం" కవిత్వమని చెప్పవచ్చు. ఈ భావప్రకటనం కవి ఎలా చెప్తాడు, ఇతరులు భావ ప్రకటనం చేయటం లేదా?అయినప్పుడు ఇతర శాస్త్రాలకు, విజ్ఞానశాఖలకు భిన్నమైన స్వతంత్ర ప్రతిపత్తి కవితకు ఎలా సంక్రమిస్తున్నది? అవి సాధించలేని విలక్షణమైన ప్రయోజనాన్ని కవిత ఎలా సాధిస్తున్నది? ఇలాంటి ప్రశ్నలు వేసికొని మనం స్వతంత్రంగా, సహేతుకంగా ఆలోచిస్తే కవితాతత్వరహస్యం, కవితా ప్రయోజనం కొంతవరకు విశదమౌతుంది.

లోకంలో వివిధ శాస్త్రాలు, విజ్ఞానశాఖలు ఉన్నాయి. గణితశాస్త్రం, భౌగోళిక శాస్త్రం, రసాయన శాస్త్రం, ఆర్థికశాస్త్రం, తత్త్వశాస్త్రం, రాజనీతి శాస్త్రం, వంటివి ఎన్నో ఉన్నాయి. ఒక్కొక్క విషయానికి ఒక పరిధి, ప్రయోజనం ఉంది. అలాగే కవిత్వం కూడా తనదైన ఒక ప్రాతిపదిక మీద స్థాపితమై తీగలు సాగుతున్నదా లేక పై పేర్కొన్న విభిన్న శాస్త్రాలకు ప్రక్క తాళం వేసే ప్రక్రియగానే అది సాగిపోతున్నదా అన్నది మనం ముఖ్యంగా గమనించవలసిన విషయం. నిజానికి అన్ని శాస్త్రాలకు, పెరిగిపోతున్న విజ్ఞాన శాఖలన్నిటికీ మూలబీజం ఒకటే - మనిషి: ఆ మనిషికి తన చుట్టూ ఉన్న ప్రకృతితో, తోటి మనిషితో తను ఊహించుకున్న దైవంతో గల సంబంధాలను హేతుబద్ధంగా, తర్కబద్ధంగా నిరూపించటం, నిర్ణయించటం సాహిత్యం,అందులోనూ కవిత్వం

మనిషిని అతనికి గల ఈ త్రిముఖ సంబంధాలను విశ్లేషించి, వ్యంజించే కళారూపమే అయినప్పుడు కవిత్వం సర్వ స్వతంత్ర ప్రతి పత్తిని ఎలా స్థాపించుకుంటున్నదో కాస్త పరిశీలిద్దాం.

కవిత్వం అంటే ఒక వస్తువును దర్శించే తీరు. వస్తువుకాదు వస్తుగతమైన భావన కవిత్వం. అంటే, నదులు, కొండలు, అడవులు, పూలు, పొలాలు, మబ్బులు, నక్షత్రాలు, ఫ్యాక్టరీలు, కర్షకులు, కార్మికులు, పశువులు, పక్షులు, పేదరికం, బాధ, భక్తి, రాగం, ద్వేషం మొదలైనవి వస్తువులు. ఆయా విజ్ఞాన శాస్త్రంలో కొన్ని కొన్ని నిర్దిష్టమైన విషయాల గురించి లేక వస్తువుల గురించి పరిశీలన, పరిశోధన, అధ్యయనం జరుగుతుంది. ఉదాహరణకు గోదావరి నదిని తీసుకుందాం. అది ఒక వస్తువు అనుకుంటే దాన్ని ఒక చరిత్రకారుడు, ఒక భౌగోళికుడు, ఒక రసాయన శాస్త్రజ్ఞుడు, ఒక ఆర్థిక శాస్త్రవేత్త, ఒక ఇంజనీరు చూచే తీరులో, అధ్యయనం చేసే వైఖరిలో అమితమైన తేడాలు ఉంటాయి. గోదావరినది ఒడ్డున ఏఏ పట్టణాలు, ఏఏ సామ్రాజ్యాలు వెలసినవో, అది మన సంస్కృతికి ఎలా దోహదం చేసిందో చెపుతాడు చరిత్రకారుడు. అది ఎక్కడ పుట్టిందో, దాని పొడవు వెడల్పు ఎంతో, ఏఏ ప్రదేశాలనుంచి అది ప్రవహిస్తున్నదో మొదలైన అంశాలు స్పృశిస్తాడు భౌగోళికుడు. ఆ నది వల్ల మన పంటలు, పరిశ్రమలు ఎలా పెంపొందగలవో వివరిస్తాడు ఆర్థికశాస్త్రవేత్త. ఇలా ఒక్కొక్కరు ఆ గోదావరికి సంబంధించిన వాస్తవిక విషయాలను, ప్రమాణ పూర్వకమైన హేతుబద్ధమైన అంశాలను తెలియచేసి మానవ విజ్ఞానానికి దోహదం చేస్తున్నారు. మరి కవి అయినవాడు కూడా ఏ చరిత్రకారుడో, శాస్త్రజ్ఞుడో చేసిన పనే చేయడు. వాళ్లు చెప్పే విషయాలనే ఏదో ఒక ఛందస్సులో బిగించి చెపితే అది కవిత అనిపించుకోదు. ఆర్థిక సూత్రాలను, ప్రేమ పాఠాలను పద్యాలుగానూ పాటలుగాను మలిచేవారు, శ్రుతిబద్ధంగానో లయబద్ధంగానో తీర్చేవారు కవిత చెప్పడం లేదని గ్రహించాలి. గణిత శాస్త్రం, ప్రకృతి శాస్త్రాలు నేర్చుకోవటానికి కవిత్వాన్ని ఆశ్రయించటం అటు ఆ శాస్త్రాలను కించపరచటం, ఇటు కవిత్వాన్ని వంచించటం అవుతుంది.

అయితే ఏ శాస్త్రానికి సంబంధించిన విషయమైనా కవితా వస్తువు కావచ్చు. కాని, కవి అందులో నిత్యనూతనమైన భిన్న విభిన్నమైన రుపాలను, గుణాలను, సత్యాలను దర్శిస్తాడు. ఈ దర్శనంలోనే కవిత పుడుతుంది. ఒక వస్తువులోని మౌలిక ప్రకృతి, గుణం స్థిరంగా ఉంటాయి. వాటిని ఆధారం చేసుకునే వివిధ విజ్ఞాన శాఖలు నిర్మింపబడ్డాయి. కాని, కవి ఆ వస్తువు యొక్క

సామాన్య గుణ రుపాలను కాక తద్వస్తుగతమైన భావనలో తేలిపోతాడు. ఆయా భావుకులను బట్టి భావనా సరళి మారుతూ ఉంటుంది. అందుకే వస్తువు ఒకటే అయినా దాన్ని ఆశ్రయించిన కవిత మారుతూ ఉంటుంది.

గోదావరినది ఇన్ని మైళ్ల పొడవు, ఇన్ని మైళ్ళ వెడల్పు ఉందంటే అది అందరూ అంగీకరించవలసిన వాస్తవిక సత్యం. అక్కడ భావనకు తావు లేదు. కాని గోదావరి "తెలుగు తల్లి చేలాంచలం" అని ఒక కవి అంటే, తెలుగు సంస్కృతి వెలుగు బావుటా, అని మరొక కవి అనవచ్చు. కాదు – తెలుగు రంగం మీద నర్తించే చైతన్య సుందరి – అని ఒకరు భావిస్తే, విప్లవ ఘోష వినిపించే తెలుగు ప్రజా హృదయ వీణ – అని మరొకరు వర్ణించవచ్చు. అలాగే ఒక ఎర్రగులాబీ, ప్రియురాలి దరహాసంలా ఉందని ఒక కవి అంటే అది పేదవాని గుండె చిచ్చులా ఉందని మరొక కవి చిత్రీకరించవచ్చు. అంటే, తెలుగు తల్లి, చేలాంచలం, వెలుగు బావుటా, చైతన్య సుందరి మొదలైన భావచిత్రాలు గోదావరిలో కవి కల్పించిన సత్యాలు. అవి వాస్తవిక సత్యాలకు అతీతమైనవి, అయినా అసత్యాలు కావు. చర్మ చక్షువులకు కనిపించక పోయినా మన జ్ఞాన చక్షువులకు సాక్షాత్కరించే అద్భుత మూలసత్యా లవి. ఇలా ప్రతి వస్తువులో కవి అంతస్సత్యాలను దర్శించి కవితా రూపంలో ఆవిష్కరిస్తాడు. మన కళ్లకు కనిపించే సత్యాలకంటే ఈ కాల్పనిక సత్యాలు ప్రబలమైనవి, ప్రయోజనాత్మకమైనవి. అందుకే ఆ కవితా సత్యాలు మనలో ఏ ఇతర విజ్ఞానశాస్త్రము కలిగించలేని ఒక విలక్షణ వినూత నానుభూతిని, విచిత్రమైన చైతన్య స్పృహను కలిగిస్తాయి. కవి అయినవాడు ఒక వస్తువుపరంగా చేసే భావన, సాక్షాత్కరింపచేసే సత్యం ఇతరులు ఎవరూ చేయలేరు. అందువల్లనే ప్రాపంచిక విజ్ఞాన శాఖలు ఎన్ని విస్తరించినా ప్రకృతి శాస్త్ర విజ్ఞాన మెంత పెంపొందినా కాల్పనిక సత్యశోభితమైన కవిత వర్థిల్లుతూనే ఉంటుంది.

"ఏడారిలో కాళ్లు తెగిన ఒంటె లాగుంది జాబిల్లి" అనే మాట ఒక కవి మాత్రమే అనగలడు. అలా అనగలిగిన కవికి నూటికి నూరు మార్కులు వేస్తారు రసజ్ఞులు. అది ఒక భౌతికశాస్త్రజ్ఞుడో, జంతు శాస్త్రజ్ఞుడో అంటే అతనికి సున్నా మార్కులు పడతాయి. అమ్మాయి కళ్లు తామర పూవులని కంటి వైద్యుడంటే అతనికి వచ్చే మార్కులు సున్నా, వైద్యుడుగా అతని బ్రతుకు సున్నా. అదే మా·· మొట్ట మొదట పలికిన కవికి నూటికి నూరు మార్కులు వచ్చాయి.

అయితే కవి చేస్తున్న ఈ సత్యకల్పన వలన ప్రయోజనం ఏమి( కవిత్వం ఎందుకు అన్న మొదటి ప్రశ్నకు వచ్చాం. కవి పొందే ఆత్మా(

దర్శించే అంతస్సత్యాలు, కేవలం భ్రాంతి కాదు. అలా అనుకుంటే మనకు కనిపించే వాస్తవిక సత్యాలన్నీ భ్రాంతి అనే వేదాంతం ఉన్నది కదా. మన చుట్టూ కనిపించే ప్రకృతిలో, జరుగుతున్న సంఘటనలలో, జీవిత సంఘర్షణలో సామాన్య మానవునికి కనిపించని, స్ఫురించని భావచిత్రాలను అర్థాలను దర్శించి ప్రదర్శిస్తాడు కవి. ఒక మనిషికి మామూలుగా కలగజాలని రసానందాన్ని, అనుభూతిని కలిగిస్తాడు కవి. "పూవులకంటే లెక్కకు ముళ్ళే ఎక్కువ ఈ గులాబీ తోటలో అందుకని దీన్ని ముళ్ల తోట అననా" అన్న ఒక మహాకవి "ఈ బతుకులో సుఖాలకంటే దుఃఖాలే ఎక్కువ అయినా జీవితం దుఃఖమయం కాదు" అన్న ఒక గొప్ప సత్యాన్ని వ్యంజిస్తున్నాడు. రెండు మాటలతో సమాజాన్ని ఒక ఆశావాదం వైపు నడిపించడానికి ప్రయత్నిస్తున్నాడు కవి. అదీ కవిత అంటే. మరోకవి "పుట్టెడు ముళ్ళలో ఒక పూవు పూచిన ఈ కంపను తోట అనేవాడు ఫూల్" అని అనవచ్చు. అప్పుడు బతుకు బాధామయం అనే నిరాశావాదం వైపు మనిషిదృష్టిని మళ్లిస్తున్నారు. రెండూ శక్తిమంతమైన భావనలే - కవితలే. ప్రయోజనం మాత్రం వేరు వేరు. ఒక అబ్బాయి ఒక అమ్మాయిని ప్రేమిస్తాడు. అతని దగ్గర డబ్బులేదు. నిరుద్యోగి. "ధనం లేకుంటే నేమి నాకు ప్రేమధనం ఉంది" అని కవిత ఎవరైన వ్రాస్తే అది అతనికి ఉపకరిస్తుంది. అందులో అతనికి గొప్ప ప్రయోజనం కనిపిస్తుంది. అతడే ఉద్యోగం కోసం వెదుకుతున్నప్పుడు ప్రేమధనం గురించి పాడితే పాము కాటులా ఉంటుంది. "నిరుద్యోగ రాక్షసిని నిలువున కూల్చేస్తాం" అని ఎవరైన ఘోషిస్తే అది అతని కోసమే పంపిన అమృత సందేశం అనుకొని అనందిస్తాడు. మనవి చేసేదేమిటంటే కవిత్వానికి ఇదమిద్ధమైన ఒక ప్రయోజనం లేదు, జీవితానికి వలెనే. ఒక్కొక్కరు ఒక్కొక్క ఆదర్శం కోసం జీవిస్తారు. ఆలాగే ఒక్కొక్క కవిత ఒక్కొక్కప్రయోజనాన్ని సాధిస్తుంది. ఒక ఆదర్శం మంచిదా చెడ్డదా అన్నది ప్రశ్న కాదు. ఎంచుకున్న ఆదర్శానికి కట్టుబడి జీవించేవాళ్లు గొప్పవాళ్లవుతారు. అలాగే ఒక ప్రయోజనం ఉదాత్తమమైందా, కాదా అన్నది ప్రశ్న కాదు. ఒక కవిత ఒక ప్రయోజనాన్ని ఎంత ఎఫెక్టివ్ గా సాధిస్తే అంత గొప్ప కవిత అది.

పోతే, కవితా గుణం వేరు. కవితా ప్రయోజనం వేరు. ఒక రచన ఉత్తమ కవిత కావాలంటే అందులో కవితాగుణం నిబిడీకృతమై ఉండాలి. అంటే అందులో ఒక నూతన సత్యాన్ని, నూతన అనుభూతిని ఆవిష్కరించే గుణం ఉండాలి. చర్విత చర్వణం కవితా గుణభజకం. ఒకడు గులాబీ పూల గురించి వ్రాశాడా, గ్రుడ్డి దాన్ని గురించి వ్రాశాడా అన్నది కాదు. అచ్చరను వర్ణించాడా

బిచ్చగాణ్ణి వర్ణించాడా అన్నది సమస్య కాదు. ఆ గులాబీలో కొత్త సత్యాలను ఏంచూశాడు; ఆ బిచ్చగాని స్థితిపట్ల మనకు ఒక వినూతనానుభూతిని కలిగించే భావన ఏమి చేశాడు అన్నది కవితా గుణానికి సంబంధించిన విషయం.

జీవితం విభిన్న రసాలకు నిలయం. అందులో చేదూ ఉంది. తీపి ఉంది. శృంగారం ఉంది, బంగారం ఉంది. భక్తి ఉంది, భయము ఉంది. కక్ష ఉంది. కరుణ ఉంది. మల్లెలూ ఉన్నాయి, మంటలు ఉన్నాయి. కాబట్టి సాహిత్యం నవరసాత్మకమై నవనవోన్మేషమై విరాజిల్లుతున్నది. ఆకలితో ఉన్న వాడిని ఆర్థిక గీతం ఆకర్షిస్తుంది. కడుపు నిండిన వాణ్ని కలగీతిక గిలిగింత పెడుతుంది. ఒకే మనిషికూడా ఎల్లప్పుడు ఒకే భావమగ్నుడు కాడు. ఒకే వాంఛాలోలుడు కాడు. ఎంతటి పేదవాడైనా, విప్లవకారుడైనా తన ప్రియాంగన ఒడిలోనో ఇల్లాలి గదిలోనో ఉన్నప్పుడు కన్నీటి పాటను కాస్త మరిచిపోయి, పన్నీటి పాటలో పరవశుడౌతాడు. పేదవాడికి ఏ కవిత కావాలి అంటే అన్నీ కావాలి. నిజానికి అతనికి డబ్బు కావాలి. అది కవిత తెచ్చి పెట్టదు.

సమాజపరంగా చూస్తే, దేశం మీద శత్రువులు దండెత్తినప్పుడు ఎంత గొప్పవైన ప్రణయ గీతాలైన ప్రజలను కదిలించవు. వీర విజయ గానాలు వారిని ఉద్రేజితుల్ని చేస్తయి. సంతానం లేని వారికి కుటుంబ నియంత్రణ కవితలు నిష్ప్రయోజానకరం. అయితే అయా సందర్భాన్ని పట్టి మనిషికి, సమాజానికి అన్ని కవితలూ అవసరమవుతాయి. ఉత్తమ కవిత లన్నీ అందుకే ఆదరణీయాలు.

స్థూలంగా కవితా సాహిత్యమంతా తరతరాలుగా కొన్ని ముఖ్య ప్రయోజనాల కోసం సృష్టింపబడుతున్నట్లు మనం గ్రహించవచ్చు. దైవచింతన, సిద్ధాంతవ్యాప్తి, సౌందర్యారాధన, సాంఘిక ప్రగతి, ప్రణయ భావన - ఈ ఆదర్శాల పరంగా నాటికీ నేటికీ సాహిత్యం కవిత్వం సాగిపోతున్నది. అయితే ఆయా పరిస్థితుల ననుసరించి ఆయా కాలంలో ఆయా ప్రయోజనం ప్రాధాన్యం వహించవచ్చు. నేటి పరిస్థితుల్లో ఆర్థిక సమానత్వం, సాంఘిక ప్రగతి అత్యంత వాంఛనీయమైన ఆదర్శాలు. కాబట్టి కవిత్వం ఈ ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని సాగుతున్నది. అంటే కవి ప్రతివస్తువులో ఈ ఆదర్శాలకు దోహదం చేసే సత్యాలను కల్పించి, దర్శించి మనిషిని అభ్యుదయోన్ముఖుణ్ణి చేస్తాడు. ప్రగతి రథానికి తన కళాత్మక చక్రాలను కూడా జతపరుస్తాడు.

కవిత్వం,అర్థంలేని సన్నివేశానికి అర్థం కల్పిస్తుంది. కనిపించే సత్యాల వెనుక దాగిన కనిపించని సత్యాలను, పరస్పర వైరుధ్యంలోని మైత్రిని,

ఏకత్వంలోని అనేకత్వాన్ని, అనేకత్వంలోని ఏకత్వాన్ని అది సాక్షాత్కారింపచేస్తుంది. మనస్పందనం, రసానుభూతి కవితకు గీటు రాయి.

హేతుబద్ధమూ, తర్కబద్ధమూ అయిన ఏ ఇతర విజ్ఞానము కలిగించలేని భావనానందాన్ని, ఆత్మస్పందనాన్ని కలిగిస్తుంది అచ్చమైన కవిత. అది దేశకాలాలకు కట్టుబడినట్టున్నా, వాటినే కట్టివేస్తుంది. వాస్తవిక సత్యాలను చెపుతున్నట్లే ఉండి అసత్యాలనుకునే వాటిని వాస్తవీకరిస్తుంది. మనిషిలో సహజంగా కదిలీకదలని ఊహలకు, చెదరీ చెదరని స్వప్నాలకు కళారూపాలను ఆపాదించి అనిర్వచనీయమైన ఆనంద తన్మయత్వంలో ఓలాలాడించే అక్షర సాగర డోల కవిత్వం. అందుకే, మనిషి పుట్టిన్నాడే, మనస్సు పుట్టిన్నాడే కవిత పుట్టింది. నానాటికి పెరగిపోతున్న విజ్ఞాన వృక్షాలు వెదజల్లే నీడల్లోని వెన్నెల వాకలు, అందీ అందనీ అందాల పతాకలు కవితలు. కళాతృష్ణ ఉన్నంతవరకు కావ్య సృష్టి ఉంటుంది. మనకు తెలియని సత్యాలన్నీ తెలిసిన్నాడు మనిషి మానవదశ దాటి మరో దశలోనికి పరిణామం చెందుతాడు. అప్పుడు సత్యకల్పనకూ తావుండదు. కవిత ఉండదు. అయితే మానవుడు మానవుడుగా ఉన్నంత కాలం కవిత కవిత గానే ఉంటుంది.



# నిత్యాధునికుడు తిక్కన

తిక్కన తిరునాళ్ల! ఎంత చక్కని సన్నివేశం. ఒక కవి పేరుతో ఒక తిరునాళ్ళ జరపడం బహుశః ఇదే మొదటిసారి అనుకుంటాను. ఎప్పుడో 716 సంవత్సరాల క్రితం ఈ తెలుగు గడ్డ మీద కవితా వైజయింతిని కీర్తి కైలాస శిఖరాలపై ఎగరవేసిన కవి తిక్కనను తిరునాళ్లలో తీర్థమాడించడం తెలుగు వాళ్ళ చైతన్య శక్తికి, సాహితీ భక్తికి నిదర్శనం.

సృష్టిరహస్యం తెలిసిన కవికి మృత్యు భయం లేదు. అందుకే తిక్కన మృత్యుంజయుడు. తిక్కన వ్రాసింది కవిత్వం – చేసింది సేనా నాయకత్వం. వ్యాస దృష్టితో తెలుగు సాహిత్య సృష్టి చేసిన అపూర్వ ప్రతిభాశాలి అతడు. రాజకీయ రథసారథియై, రసాద్వైత చతుర్ముఖుడై, విశ్వ కళ్యాణ శూలియైన సాహిత్య సమ్రాట్టు అతడు. ఆయన సృష్టిని అనేక మంది పండితులు విమర్శనా దృష్టితో చూచి ఆనందాశ్చర్య చకితులైనారు. తెలుగు దేశంలో భారతమంటే కవిత్రయ భారతం; అందులోనూ తిక్కన భారతము కాని 'వ్యాస భారతం' కాదు. చరిత్ర కందని వ్యాసుడు వ్రాసిన భారతాన్ని చరిత్ర సృష్టించిన తిక్కన అనువాదం చేసి తెలుగు సాహిత్య చరిత్రకు ప్రాణం పోసినాడు. నన్నయ్య వ్రాసిన ఆదిపర్వం, సభాపర్వం, ఎర్రాప్రగడ పూరించిన అరణ్య పర్వ భాగం అది సభారణ్య పర్వాలే కాని భారతామ్నాయం కాదు. విరాటపర్వంలోనే తన కవితా విరాట్ స్వరూపాన్ని చూపించిన తిక్కన కృతిచేసిన 15 పర్వాలే భారతి చేతి భారత వీణయైనది.

తిక్కన కవితామూర్తిని కీర్తించిన కవికోకిలలలో అగ్రగణ్యులు కేతన గారు. ఆయన తిక్కనకు అంకితం చేసిన దశకుమార చరిత్రలో చెప్పిన ప్రశంసా పద్యం ఎంత ప్రశంసా పాత్రంగా ఉందో చూడండి.

సుకవీంద్ర బృందరక్షకు డెవ్వడనిన వీ
    డను నాలుకకు తొడవైనవాడు
చిత్త నిత్య స్థిత శివు డెవ్వడనిన వీ
    డను శబ్దమున కర్థమైనవాడు
దశదిశా విశ్రాంతయశుడెవ్వడనిన వీ
    డని చెప్పుటకు పాత్రమైన వాడు
సకల విద్యా కళాచణు డెవ్వడనిన వీ

డని చూపులకు గురియైన వాడు
మనుమ సిద్ధి మహీశు సమస్త రాజ్య
భారధౌరేయు డభిరూపభావభవుడు
కొట్టరువు కొమ్మనామాత్యు కూర్మిసుతుడు
దీన జనతా నిధానంబు తిక్కశౌరి.

ఈ ఒక్క పద్యం చాలు – తిక్కన ఎనిమిది శతాబ్దాల క్రిందట పుట్టిన ఆధునిక మహా కవియని చెప్పడానికి. ఇంత రసవత్తరంగా క్లుప్తంగా ఒక కవి వ్యక్తిత్వాన్ని మరో కవి చిత్రించిన ఉదంతాలు మన సాహిత్య చరిత్రలో బహుశః లేవని చెబితే అతిశయోక్తి కాదు. ఇంతటి మనోజ్ఞస్థితికి కొంచెం దగ్గరగా వచ్చినవి అలనాటి తూము నరసింహదాసు, త్యాగరాజు ప్రతిభా మూర్తిని దర్శించి తదనుభూతిని వర్ణించిన ఆయన సీస పద్యం నా కిక్కడ గుర్తుకు వస్తున్నది. " కేశవానంద సంకీర్తనావళి వంటి " అనే దివ్యభావ దీపం అది. మీగందరు ఎరిగిన పద్యపారిజాతం అది.

తిక్కన సాహిత్య వైభవాన్ని అవిష్కరించడానకి కాదు నే నీ నాలుగు మాటలు వ్రాస్తున్నది. ఆ వైభవాన్ని శతాబ్దాలుగా, సహస్ర విధాలుగా లక్షలాది కవిపండితులు, పండితకవులు, సుహృద్ విమర్శకులు, విమర్శక సహృదయులు కొనియాడుతునే వున్నారు. ఈ 'తిరునాళ్ళ' లో నావంటి సామాన్య సాహిత్య వ్యాపారి చేయవలసిన పని కాదు, పెట్టవలసిన కొట్టు కాదు.

లోకంలో కవిత్వం రెండు రకాల వాళ్లు వ్రాస్తున్నారు. కవిత్వం "వృత్తి" గా పెట్టుకున్న వాళ్లు; " ప్రవృత్తి " గా కలవాళ్లు. వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు, తిక్కన , టాగూర్ వంటి భారతీయ కవులు చిత్తవృత్తి కవులు. సృజనాత్మకశక్తి పరులు వారు. చింతనాపరులు, దర్శనానుభూతిపరులు వారు. వారు ప్రకృతి వర్ణన చేసినా, సిద్ధాంత ప్రతిపాదన చేసినా కవిత్వమై కూర్చున్నది. వారిలోని సౌందర్యారాధన, సంస్కరణాభిలాష కవితాయోషయై, కావ్యభాషయై తత్వాంతరంగాలపై రసానందలాస్యం చేసినవి. అందుకే కేతన, తిక్కన ప్రతిభాశిఖరాలపై అంతటి సుమనోజ్ఞ కీర్తి కేతనం ఎత్తినాడు. కేతన భావకేతనంలో తిక్కనకు తిలకం దిద్దిన వర్ణం " సకల విద్యా కళాచణుడు " అనే వర్ణనం.

సకల విద్యా కళాచణుడైనవాడే సాహిత్య సృష్టి చేయగలడు. 'నా నృషిః కురుతే కావ్యం' సకల విద్యాకళాచణుడే ఋషి. ఆధునిక పరిభాషలో

చెప్పాలంటే జనరలిస్టు (Generalist) మాత్రమే గొప్ప సాహిత్యకారుడు కాగలడు. స్పెషలిస్టు (Specialist) కాదు. నాలుగు గోడల మధ్య కూర్చునే వాళ్లు నాటికీ, నేటికీ, ఏనాటికీ గొప్ప కవులు కాలేరు. అంత మహాగ్రంథాన్ని ఆయన నడిపించగలగడానికి కారణం ఆయన అపార అనుభవశాలి, అనంత అనుభూతిశీలి కావటమే. కర్మయోగియై, భోగత్యాగియై, జ్ఞాన యోగియైన తిక్కన సోమయాజి, కవితా వాజిపై విజృంభించి భారత ఆజిలో విజయభావరసానంద బృందావనాలు ఆర్జించినాడు. హరిహరుల అద్వైత్వ స్థితిని ఆరాధించి, మహాభారత వేదాన్ని మానవతావాదాన్ని జోడింపగలిగినాడు.

"తిక్కన తిరునాళ్ళ" ఎందుకు జరపాలి? ఆయన ఆధునిక సమాజానికి ఏవిధంగా ఆదరణీయుడు? నేటి సాహిత్య విలువల దృష్ట్యా ఆయన సృష్టికి విలువ ఎంత? నేటితరం సాహిత్య కారులు, భావితరాల రచయితలు ఆయన నుంచి నేర్చుకోవలసినదేమిటి? ఇలాంటి కొన్ని ప్రశ్నలకు సమాధానాలు వెదికి నా నాలుగుమాటలు ముగిస్తాను.

ఉత్సాహం ఉంటే ఉత్సవం చేసుకుంటాం. ఏ దేవతపేరుతోనో చేసుకొనే ఉత్సవం తిరునాళ్ల. సృష్టి కర్తలు దేవతలు - శక్తి స్వరూపులు దేవతలు; అసలు దేవతలున్నారా లేరా అనే ప్రశ్నతో మనకు నిమిత్తం లేదిక్కడ. ఒక వేళ వాళ్లు ఉంటే చేసేపని సృజన. సకల ధర్మ కర్మాచరణలకు కావలసిన శక్తిని ప్రసాదించడం వారి విధి. దేవతలు చేస్తారనుకునేది చేసే వీరులు దేవతలే గదా! తత్వమసి, త్వమేవాహం, అహం బ్రహ్మాస్మి సోహం వంటి సూక్తులు కూడా నరనారయణ ఏకత్వాన్ని చాటే సత్యాలే కదా! అందుచేత శివకేశవులను ఒకటి చేసి నరనారాయణ సహకార సమరవిజయ కావ్యాన్ని అద్వైత్వ మూర్తికి అంకితం చేసిన అక్షరబ్రహ్మ తిక్కన ఏ దేవుని కన్న తక్కువ తిన్నవాడు! ఆయన తిరునాళ్ల శబ్ద బ్రహ్మకు, భావశివునికి, భాషాకేశవునికి చేసే జాతరయే.

సాహిత్యానికి ఉండవలసింది సౌందర్యగుణం. ప్రయోజనాలు వేరు వేరు కావచ్చు. ఏ ప్రయోజన సాధనం కోసం ఉద్దేశింపబడిన సాహిత్యమైనా స్వాదు సౌందర్యబంధురం కావాలి. పాఠకునికి కావలసింది సాహిత్య గుణం, ప్రయోజనం ఆశించేది రచయిత. ఆ ప్రయోజనంతో పాఠకునికి సంబంధం లేకపోయినా, తీరిపోయినా ఏతత్ సాహిత్యగుణ సౌందర్యంతో ముడిపడిపోతాడు పాఠకుడు. తిక్కన సాహిత్యం సౌందర్యగుణ విలసితం - వైదికమత ప్రసారణ ప్రయోజనాత్మకం. వైదికమత దీప్తికోసం ఇప్పటికీ కొందరు భారత

భానుబింబాన్ని ఆశ్రయించినా, ఇప్పటికీ ఎప్పటికీ అందరూ ఆశ్రమయించేది ఆరాధించేది అందులోని శబ్దశిల్పసౌందర్యాన్ని - భావనా సత్య సందేశాన్ని. ఏ సత్య సౌందర్యాలు, ఏ భావశిల్పాలు సంస్కృత భారతానువాదాలో ఏవి స్వకపోల కల్పితాలో పాఠకునికి అక్కరలేదు. తిక్కన వాటిని తీయని తెలుగు పలుకుబడులలో అందించిన తీరే చదువరులందరికీ భళారే. భారత కథ కంచికి పోయినా వ్యాస దృష్టితో, తిక్కన చేసిన తత్కథా కథన కవిత ఎల్లప్పుడూ ప్రతి తెలుగు ఇంటికి పోతూ ఉంటుంది.

వైదికమతాన్ని నేర్చుకోవడం కోసం భారతాన్ని చదువుకోవాలనడం రాజకీయ సిద్ధాంతాలు నేర్చుకోవడం కోసం ఆధునిక కవిత్వం చదువు కోవాలి అన్నట్లు ఉంటుంది. అందుచేత ఆధునిక సమాజానికి వైదికమతంతో అంతగా ప్రమేయం లేకపోయినా, సంఘర్షనాత్మకమైన సమకాలీన సమాజానికి సమన్వయశాంతి సందేశాన్ని చిరంతనంగా వినిపించే తిక్కన కళారసవాణితో తరతరాలకు, యుగయుగాలకు సద్యస్సంబంధనం కలుగుతూనే ఉంటుంది. భారత మహాకవి దర్శనం మార్తాండుని వలె నిత్యనూతనమే కదా! నిత్యాధునికమే కదా!

చెప్పే విషయం జీవరసవత్తరంగా చెప్పడం సాహిత్యపు విలువల్లో ప్రథమగణ్యం. భౌతిక సత్యాలను, భౌతిక గుణాలను ప్రతిపాదించేవి వివిధ విజ్ఞాన శాఖలు. భావసత్యాలను, అనుభూతిసౌందర్యాలను ఆవిష్కరించేవి సాహిత్యరేఖలు. కల్పనాత్మక, సృజనాత్మక సత్యదర్శనం, లేనిదే భావ విప్లవం, మనో వికాసం కలగవు. రసవృత్తంలో ఇతివృత్తం ఇమిడితేనే సాహిత్యం అందులోనూ కవిత్వం అవుతుంది. ఏ ఆధునిక సాహిత్య ప్రక్రియ, ముఖ్యంగా కవితా ప్రక్రియ అయినా 'సుకవీంద్ర బృందరక్షకు' డైన తిక్కన సరస సాహిత్య తత్వ గౌరవాన్ని కాదనలేవు. అయితే నినాదాలే సాహిత్యం, రాజకీయలే కవిత్వం అనుకునే నీరస కవిబృందాలకు తిక్కన ప్రాతినిధ్యం వహించలేడు. జీవిత మహారణ్యంలో కూడా ప్రసన్నతా పాంచాలిని పొందే ప్రబుద్ధ పాండవత్వాన్ని ప్రసాదించే ప్రగతి గీత భారతం. సమస్యల సమరాంగణంలో విజయరథాన్ని నడిపే విప్లవ భావసారథి భారత కావ్య కళానిధి.

ఎనిమిది శతాబ్దాలు పండిన తిక్కన సాహిత్య మహోత్సవం చేసుకోవడం అతని కవితాశక్తిని చాటుతున్నది. ఆధునిక కవులు, ఎందుచేత తిక్కన రచనాలోకం చెక్కుచెదరకుండా ఉందో గ్రహిస్తే చాలు. భావ సృష్టిరహస్యం

తెలిసిన తిక్కన కవితా శిల్పరహస్యం తెలుసుకుంటే నేటి తరం కవులు, రాబోయే తరాల కవులూ సృజనాత్మక సాహిత్య స్రష్టలై, నవబ్రహ్మలై తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసే అవకాశం ఉన్నది. అనల్పాక్షరాలలో 'అల్పార్థాలు' సృష్టిస్తున్న అనేక ఆధునిక కవివతంసములు తిక్కన 'అల్పాక్షరత్వం' ను ఆరాధించగలిగితే ఈ 'తిరునాళ్ల' ప్రయోజనం కొంతవరకు సాధించినట్టు అవుతుంది. పద్యమా, గద్యమా అని కాక హృద్యమా కాదా అనే చైతన్య స్పృహతో రచన చేస్తే సోమయాజికి చేస్తున్న జాతర కాస్త సార్థకమవుతుంది.

ప్రాచీనమా, ఆర్వాచీనమా అని కాక సమీచీనమైన సాహిత్యాన్ని సమాదరిస్తే ఈ తిరునాళ్లకు పరువం అబ్బినట్టవుతుంది. నానా రస సంఘాలన్నీ నవ రస సంఘాలుగా వర్ధిల్లితే తిక్కన తీయని కలలు మళ్లీ మన సాహిత్య క్షేత్రంలో పండుతాయి. సమస్త భారతానికి సకల నీతిశాస్త్ర సారానికి మణి దర్పణం పట్టే తిక్కన ఒక్క పద్యోత్పలాన్ని చూడండి.

( ఉద్యో - ద్వి. అ - 273 )

" సారపుధర్మమున్ విమలసత్యము పాపము చేత, బొంకుచే
పారము బొందలేక చెడబారినదైన యవస్థ, దక్షులై
వ్వారలు పేక్షచేసి రది వారల చేటగు, గాని ధర్మని
స్తారకమయ్యు సత్య శుభదాయక మయ్యును దైవముండెడున్. "

అవును ఈ ఒక్క పద్యం చాలు " దీన జనతా విధానంబు" అయిన తిక్కశౌరి చెక్కు చెదరని కవితా వైభవానికి, 'తిరునాళ్ల ' జరపడానికి. దీన బలహీన జనోద్ధరణ ధర్మాన్ని, సర్వసమత్వ సత్యాన్ని భంగపరచే నేటి స్వార్థపరశక్తులను కూడా శిక్షించక ఉపేక్షించే దక్షులు ఉప్పొంగేనూతన చైతన్యధారలో కొట్టుకొని పోతారే తప్ప, సమతా సౌభాగ్య దీపాలు ప్రజాకోటి జీవిత ప్రాంగణాలలో ప్రజ్వలింపకమానవు. నడుస్తున్న చరిత్ర నిరూపిస్తున్న ఈ సత్య ధర్మాన్ని ప్రతిపాదించే పై పద్యజ్యోతికంటే విప్లవగీతి ఏది? తెలుగు సాహిత్యం ఇలాంటి సుందర సత్యబంధురమైన కవితా రసధునులను నిరంతరం పొంగించుగాక.

*నెల్లురులో జరిగిన "తిక్కన తిరుణాళ్ల"లో సమర్పించిన వ్యాసం.(1984)*

# విశ్వసనీయ కవి వేమన

## ('వేమన వేదశాస్త్రం' అనే గ్రంథం కలిగించిన ప్రతిస్పందన)

వేమన సాహిత్యాన్ని వెలుగులోకి తెచ్చిన ఘనత బ్రౌను దొరగారికి దక్కితే, ఆయన సాహిత్యంలోని అసలైన వెలుగును ఆబాల గోపాలానికి అందించిన కీర్తి లోక బాంధవులు శ్రీ గుర్రం వెంకట రెడ్డి, శ్రీ పోచన రామరెడ్డి గారలకు దక్కింది. స్వాతంత్ర్య యోధులైన వారిద్దరూ ఇప్పుడు విప్లవయోగి వేమన సాహిత్య సాధకులైనారు. "వేమన వేదశాస్త్రం" అనే, వారి ఈ పరిశోధనా గ్రంథం సమగ్రమైన నిత్యజీవిత సత్యాలకు వేమన ప్రమాణాన్ని ప్రతిపాదించిన ప్రయోజనాత్మక వేదం. వివేక విప్లవ యోగియైన వేమన మానవ జీవితాన్ని, సమాజాన్ని మధించి వెలిబుచ్చిన అమృతాలోచనలు, అభిప్రాయాలు ఈ గ్రంథంలో అపూర్వంగా, అద్భుతంగా క్రోడీకరించబడి విశదీకరించబడినవి. ఈ పుస్తకం చదివిన తర్వాత ఇక వేమన గురించి తెలిసికోవలసిందంటూ ఉండదేమో అంటే అతిశయోక్తి కాదేమో. నా మట్టుకు నేను వేమనను ఇన్ని రంగులలో, ఇన్ని భంగిమలలో చూపించిన రచన మరొకటి చూడలేదు. వేమన గురించి ఇంతవరకూ ఎవరినోట ఏ మాట వెలువడినా వాటన్నింటినీ సందర్భోచితంగా ఉదాహరిస్తూ సహజ సుందర శైలిలో వ్రాసిన ఆరువందల పుటల ఈ బృహద్గ్రంథాన్ని పఠిస్తూ వేమన విశ్వరూపాన్ని దర్శించి ఆనందపారవశ్యంలో తేలిపోయాను. అసలు ఈ పుస్తకం గురించి నేను అభిప్రాయం వ్రాయవలసి ఉన్నదన్న సంగతి కూడా మరచిపోయాను.

ఈ పుస్తక రచయితల జంట వివాదాస్పదమైన వేమన సాహిత్యతత్వాన్ని, వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించిన తీరు ఎంతో ప్రశంసనీయమైనది. సాత్విక దిగంబరుడుగా ఇంతవరకు లోకానికి సుపరిచితుడైన వేమనను రాజసశ్వేతాంబరుడుగా వారు చిత్రించిన తీరు అసక్తిదాయకంగా ఉంది. వారు దర్శించిన వేమన ఆశయాల ఆలోచనల ఆత్మకు అనుగుణంగానే ఆయన భౌతిక రూపాన్ని వారు భావించడం యుక్తియుక్తంగానే ఉంది. అందుకే "విడిచి వేసి గుడ్డలన్నీ వేమన యోగీసుడయ్యె, వలువలు లేనట్టి వారె విలువలు బోధింతురేమో" అంటూ అగ్నికీలవోలె నగ్న నాట్యమాడే నర్తకి నేను కీర్తించిన గీతం లోని విప్లవ భావ పంక్తులనుండి వారు వినయపూర్వకంగా తప్పుకున్నారు. ఆయన వేషం ఎట్లున్నా, హేతువాదులైన రచయితలు

ఆవిష్కరించిన ఆయన భాషాభావాల రూపం సత్యసుందరంగా, లోక కళ్యాణబంధురంగానే ఉంది.

"ఉప్పు కప్పురంబు ఒక్క పోలికనుండు

జూడజూడ రుచుల జాడవేరు" అన్న వేమన్న వేదవాక్యంలోనే బహుశా వేమన వ్యక్తిత్వమంతా వ్యంజింపబడి ఉందేమో! "కలితలల్లు వారు కవులనబడినను, కవులయందు వేమ కవియె వేరు" అనాలనిపించింది. "నానృషిః కురుతే కావ్యం" అంటే ఋషి కాని వాడు కవి కాలేడు. అంత మాత్రంచేత ఋషులైప వాళ్ళంతా కవులవుతారని కాదు. సత్య దర్శనం చేయగలిగిన వాడు ఋషి. దర్శించిన సత్యాన్ని ఇతరులను దర్శింప చేయగలిగినవాడు కవి. అయితే, ఋషుల్లో నూటికి తొంభైతొమ్మిది పాళ్ల సత్యాన్ని దర్శించి హర్షించే వాళ్ళే (ఆత్మానందం పొందేవాళ్ళే) కాని, ఆ సత్య దర్శనానుభూతి తోటి మానవులకు అందించకలిగే శక్తిపరులు కారు. వ్యాసవాల్మీకులు సత్యప్రకాశన ఋషికవులు - కవి ఋషులు. ఆ సంతతికి చెందిన సత్యకవి వేమన యోగి. నిశిత విమర్శ కాగ్రేసరులైన ఈ గ్రంథకర్తలు ఈ సున్నితమైన రహస్యాన్ని ఎంతో ప్రతిభావంతంగా నిరూపించారు. వేమన ఆధ్యాత్మిక సత్యాలను ఎలా సామాజిక సత్యాలుగా అందించాడో, అనుభూతి సత్యాలను ఎలా అనుభవసత్యాలుగా ప్రకటించాడో, భావసత్యాలను ఎలా భౌతిక సత్యాలుగా తీర్చాడో, వేమన వేద శాస్త్రంలో విశదీకరించారు. కవి ఋషియైన వేమన బుద్ధుని కంటే, చార్వాకునికంటే, క్రైస్తుకంటే, మహమ్మదుకంటే రసాత్మకంగా, అనుభవైకంగా నిత్యజీవిత సత్యాలను నిర్దేశించాడు. అందుకే రచయిత లన్నట్లు వేమన విశ్వకవి, విశ్వజనీన కవి, సత్యకవి, మహాకవి అయినాడు. నా దృష్టిలో ఈ అన్నిటికీ మంచి "విశ్వసనీయ" కవి వేమన. ఒక సత్యాన్ని దర్శించడం, దాన్ని వర్ణించడం, ప్రభోధించడంచడం మహాకవులైన వాళ్ల ఎందరో చేయగలరు కాని ఆ సత్యాన్ని తోటి మానవులందరూ విశ్వసింపచేయగలిగినవారు విశ్వదాభిరాముడైన వేమన వంటి ఎవరో ఒకకవి మాత్రమే. అందుచేత నేను వేమన "విశ్వసనీయ కవి" అంటాను. కవి ప్రకటించిన సత్యాన్ని శ్రోత, పాఠకుడు విశ్వసించాలి. అలా విశ్వసించనప్పుడు ఆ సత్యానికి ప్రయోజన ముండదు. అందుచేతనే వేలాదికవులు. లక్షలాది సత్యాలు ప్రవచించినా విశ్వసనీయుడైన ఎవరో ఒక కవి వెలార్చిన సత్యాలనే లోకం విశ్వసిస్తుంది - అనుసరిస్తుంది. సుందర శబ్దజాల మాధ్యమంతో, సురుచిర భావమాల మాధ్యమంతో క్రొత్త క్రొత్త సత్యాలను ఆవిష్కరించి

సామాజికుల మూఢ విశ్వాసాలను, దురాచారాలను మార్చగలిగిన "విశ్వసనీయ" శక్తియోగ సంపన్నుడు వేమన. అందుకే తాము ఆస్తికులమూ, నాస్తికులమూ కాదంటున్న వేమన వేద శాస్త్ర రచయితలు, వేమన వినిపించిన విప్లవాత్మక సత్యాలను విశ్వసించిన "వాస్తవికులు". "వేమన పూర్తి భౌతిక వాదికుడు. కాని భౌతిక ప్రపంచం దైవ స్వరూపమన్న విశ్వాసం కలవాడు. ప్రతీదీ వాస్తవ ప్రపంచమనే కొలతబద్దతో తూచే అలవాటు ఆయనది" అంటూ రచయితలు చేసిన గంభీరమైన పరిశీలన నాకెంతో నచ్చింది. ఇది నా "భావ భౌతిక వాదానికి" సన్నిహితమైన సత్యమార్గం.

ఈ లోకాన్ని సమతాసౌభాగ్యమయ సుందరారామంగా తీర్చిదిద్దగల భావసత్య ప్రబోధకుడైన విశ్వసనీయ వేమన యోగిని ఆ గ్రంథ రచయితలు శ్రీ శ్రీ వంటి రాజకీయ కవులతో పోల్చి " అభ్యుదయ యోగి" గా చిత్రించటం అంత సమంజసంగా లేదు. దురాచార దుర్నీతి దుస్థితినుంచి "దేవుణ్ణి - జీవుణ్ణి" రక్షించిన సమతాద్వైత ఆత్మజ్ఞాని వేమన, మతాతీత కాలాతీత మానవతా వాది ఆయన. మరి ఈ గ్రంథ రచయితలకు, ఆధునిక సాహిత్యం, సమాజం పట్ల ఉన్న కొన్ని అపోహలను సమర్థించుకోవడానికి, నిత్య సత్యాన్వేషి మహామనీషియైన వేమనను వాడుకోవడానికి చేసిన ప్రయత్నం ఈ గ్రంథ చంద్రబింబంలో ఒక చిన్న మచ్చగా మాత్రం ఉంది. ఉదహరించిన పద్యాలే ఉదాహరిస్తూ, చెప్పిన విషయమే చెప్పడం వలన ఇతరత్రా ఎంతో మంచిగా ఉన్న రచనకు కాస్త పునరుక్తి దోషం అంటింది.

మానవత్వం పట్ల, సమతాతత్వం పట్ల, హేతు వాదనీతితత్వం పట్ల విశ్వాసం సన్నగిల్లుతున్న నేటి తరానికి వేమన విశ్వజనీన విజ్ఞాన ప్రజ్ఞాన సత్యభా సందేశం లోకానికి విశ్వసనీయమై సర్వతోముఖానంద జీవితచైతన్యాని దోహదం చేస్తుందని ఆశిస్తున్నాను. సువిశాల ఆధునిక భారతీయ సాహిత్యక్షేత్రంలో వెలలేని వివేక భావ "వేమన వేద శాస్త్ర" వృక్షాన్ని నాటి "వెంకట రెడ్డి - రామిరెడ్డి" జంట రచయితల యుగ చైతన్య సేవా భావాని నిండు గుండెతో అభినందిస్తున్నాను.

# త్యాగరాజు

తన పేరు తెలిసిన ప్రతి తెలుగు వాడికి త్యాగరాజు పేరు తెలుసనంటే అతిశయోక్తి కాదు. నిజానికి దక్షిణ భారతమంతటా త్యాగయ్య పేరు తెలియని వారుండరు. అయితే త్యాగరాజు కీర్తి ఎల్లలు లేనిది. సంగీతంలో ఏ మాత్రం పరిచయం ఉన్న భారతీయుడైనా, భారతీయ సంగీత సంప్రదాయాలలో ఏకాస్త ప్రవేశం ఉన్న విదేశీయుడైనా కర్ణాటక సంగీతానికి త్యాగరాజు చేసిన ఎనలేని సేవను గుర్తించక మానడు. త్యాగరాజే కర్ణాటక సంగీతంగా, కర్ణాటక సంగీతమే త్యాగరాజుగా ప్రతీతి అయిపోయింది.

దాదాపు రెండువందల సంవత్సరాల క్రిందట తంజావూరుకు సమీపంలో పంచవటీ క్షేత్రమయిన తిరువైయూరులో త్యాగరాజు రామభక్తి పారవశ్యంలో పాటలల్లిపాడుకున్నాడు. నాదసాగరంలో తేలిపోతూ రాగతరంగాలతో ఆడుకున్నాడు. ఆ పాటలే కర్ణాటక సంగీతానికి అపరంజి కోటలౌతాయని, ఆ రామనామ కీర్తనలే గేయ సాహిత్యోపనిషత్తు అవుతుందని ఎవరూహించారు? "ఎందరో మహానుభావులు-అందరికీ వందనాలు" అన్న ఆయన హిమాలయోన్నతమూర్తి శిఖరం ముందు నిలబడి ఈనాడు మహనుభావులందరు అభివందనాంజలి ఘటిస్తున్నారు.

త్యాగరాజు జీవిత విశేషాలు, ఆయన కర్ణాటక సంగీతానికి చేసిన సేవ, వైష్ణవ భక్తి ప్రతిష్ఠాపనకు ఆయన సంగీత సాహిత్యాలు తోడ్పడిన తీరు, ఆయనకు గానకళా ప్రపంచములో సంప్రాప్తించిన స్థానం పండిత పామరుల్ని ఆనందపులకితుల్ని చేస్తాయి.

త్యాగరాజు తాతముత్తాతలు కర్నూలు జిల్లాలో కంబం తాలూకాలోని కాకర్ల గ్రామవాస్తవ్యులు. కాలవశాత్తు వారు దక్షిణ దేశానికి వలసపోయారు. త్యాగరాజు తాతగారైన గిరిజాల కవి దక్షిణ భారతంలోని తంజావూరు రాజుల మన్ననలను పొందినాడు. తమిళనాడులో మహారాష్ట్రుల పాలనలోఉన్న తంజావూరులో ఒక తెలుగు కవికి ఆనాడు లభించిన ఆదరాభిమానాలు జాతీయ సామరస్యానికి చక్కటి ఉదాహరణ. కులమత ప్రాంతీయ దృష్టితో కాక ప్రతిభా పాండిత్య దృష్టితో కవులను కళాకారులను గౌరవించిన ఆ రోజులు ఆదర్శప్రాయాలు. త్యాగరాజు తండ్రి రామబ్రహ్మం, తల్లి సీతమ్మ.

త్యాగరాజు తండ్రి రామబ్రహ్మం, తల్లి సీతమ్మ. రామబ్రహ్మం గొప్ప పండితుడు. ఆయన రాజమహలులో రామాయణోపన్యాసాలు ఇవ్వడానికి వెళ్ళినప్పుడు ఆయన వెంట అప్పుడప్పుడు బాల త్యాగరాజు కూడా వెళుతూ ఉండేవాడు. తల్లి సీతమ్మ

పురందరదాసు దేవర్నామకృతులూ, రామదాసు కీర్తనలూ పాడుతుంటే పసివాడు త్యాగయ్య పరవశుడై వినేవాడట. తన తల్లి దండ్రులలో సీతారాములను దర్శించి, వారి పలుకు పలుకున రామనామ మహామృతాన్ని ఆస్వాదించి రామభక్తిలో తాదాత్మ్యము చెందిన రసహృదయుడు త్యాగరాజు. "సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మాతండ్రి" అనే ఆయన కీర్తన అందుకే ఇహపరభావనా పరమై ధ్వనికే అలంకారమైనది. రామభక్తి భోగంలో యోగియై, రామసన్నిధిలో సకలనిధి త్యాగియై గానకళా సామ్రాజ్యాధిపతి యైనాడు త్యాగరాజు.

త్యాగయ్యను గురించిన విచిత్రగాథలు ఎన్నో ఉన్నాయి:

1. ఆయన తారకమంత్రం తొంభై ఆరుకోట్ల జపంచేశాడనీ, శ్రీరాముడు ఆయనకు సాక్షాత్కరించాడని చెపుతారు.

2. ఆయన ఆరాధించిన రామవిగ్రహాన్ని వాళ్ళ అన్నయ్య కుటుం కలహకారణంగా కావేరీనదిలో పారవేయించాడనీ అప్పుడు, "ఎందుదా నాడో ఈడకు రానెన్నడు దయవచ్చునో" అన్న కీర్తన చేయగా రాము కలలో కనపడి విగ్రహం పడిఉన్న జాడచెప్పాడనీ, ఆవిగ్రహం దొరకగా "కనుగొంటిని శ్రీరాముని నేడు" అని, "చల్లరె రామచంద్రుని పూలుచల్లరె సొంపైన మనసుతో ఇంపైన బంగారు గంపలతో మం చంపకములను చల్లరె" అని పాడుకున్నాడని ప్రతీతి.

3. త్యాగరాజు శ్రీరంగం వెళ్ళినప్పుడు అక్కడ శ్రీరంగనాథస్వా చైత్రోత్సవం జరుగుతుండగా చూచి "రాజు వెడలె జూతమురారే" కీర్తన పాడాడట. అయితే క్రిక్కిరిసిన జన సమూహాన్ని దాటి ఆ స్వామిసన్నిధికి చేరుకోలేక పోయాడట. అందుకు త్యాగర పరితపించెనట. అంతలో స్వామి కదలలేదని, వాహకులు కదలి లేకపోయారని, అప్పుడొక అర్చకునికి స్వామి ఆవేశించి త్యాగ పరితాపాన్ని వెల్లడిస్తాడని, ఆయన్ని స్వామి సన్నిధికి తీసుకొనిపె "వినరా నామనవి" అన్న కీర్తన గానం చేశాడని; దాంతో స్వామి ముంద సాగెనని వదంతి.

4. త్యాగరాజు కుమార్తె వివాహ సందర్భంలో ఆయన శిష్యుడొ కోదండరామస్వామి తైలవర్ణ చిత్రాన్ని వాలాజపేట ను తిరువైయూరునకు జాగ్రత్తగా శిరస్సుపై పెట్టుకొని తీసుకురాగా చూ త్యాగరాజు 'నను పాలింప నడచి వచ్చితివో' అన్న మోహనరాగక గానం చేశాడట.

5. త్యాగరాజు తిరుపతికి వెళ్ళినపుడు, పుష్కరిణిలో స్నానంచేసి, అహ్నికాదులు ముగించుకొని స్వామి దర్శనానికై ఆలయానికి వెళ్ళేసరికి స్వామికి అడ్డంగా గర్భాలయంలో తెరవేసి ఉన్నదట. స్వామి దర్శనము లభించకపోయెనని తపించిన త్యాగరాజు గళంనుంచి "తెరతీయగరాదా" అనే కృతి గౌళిపంతు రాగంలో ప్రవహించిందట. అప్పుడు దానంతట అది తెర ప్రక్కకు తొలిగిందట.

6. తంజావూరు మహారాజు శరభోజి తనపై ఒకటిరెండు కీర్తనలు రచింపుమని, అందుకు ప్రతిఫలంగా కొంతభూమిని ఆభరణాలను ఇవ్వగలమని రాజోద్యోగులతో త్యాగరాజుకు కబురు పంపాడట త్యాగరాజు అందుకు నొచ్చుకొని తన మనసును సంబోధిస్తూ " నిధి చాల సుఖమా రాముని సన్నిధి చాల సుఖమా" అను కల్యాణరాగ కృతిని ఆలపించేనట. ఈ సంగతి రాజుకు విన్నవిస్తే, త్యాగరాజును బలవంతంగా తీసుకరమ్మని భటులను పంపాడట. అయితే వాళ్ళు బయలుదేరిన మరుక్షణంలోనే రాజుకు భరింపరాని శూలనొప్పి ప్రారంభమైందట. రాజవైద్యులు ఏమీ చేయలేకపోగా జ్యోతిష్కులు 'మహాత్మునికి అపకారం తలపెట్టడం వలన ఈ నొప్పి వచ్చిందని" చెప్పగానే రాజు తన ఉత్తరువులను ఉపసంహరించుకున్నాడట, ఆ వెంటనే నొప్పి తగ్గిందట.

ఇలా ఆయన జీవితంలో జరిగిన సంఘటనలకు ఆయన కీర్తనలకు అన్వయం చెపుతుంటారు వ్యాఖ్యాతలు. ఆయన ప్రసిద్ధ పంచరత్నకృతుల వెనుక కూడా ప్రత్యేకమైన సంఘటనలు, అనుభూతులు దాగిఉన్నట్లు పరిశీలకులు చెపుతూ ఉంటారు. అయితే అందరి మహనీయుల జీవిత చరిత్రలలో వలెనే త్యాగరాజు జీవితంలో జరిగిన వాస్తవ సంఘటన లేవో, ఊహాకల్పితాలేవో విడదీసి చెప్పడం కష్టం.

ఏదెట్లున్నా, త్యాగరాజు ఒక సామాన్య కుటుంబంలో జన్మించి తన ప్రతిభా పాండిత్యాలతో, నిరంతర సాధనతో చరిత్ర ప్రసిద్ధికెక్కిన మహామనీషి. ఆయన జన్మించిన సంవత్సరం వివాదగ్రస్తమే అయినా 1767 మే 4వ తేదీన తిరువాయూరులో అని చాలవరకు అంగీకరిస్తారు. 1784లో ఆయన 18 వ ఏట వివాహం జరిగింది. ఒకే ఒక కుమార్తె ఐన సీతాలక్ష్మి, కుమారుడు పంచాపకేశయ్య, నిస్సంతుగా యౌవనంలో మరణించారు. త్యాగరాజు సంతతివారు ఇపుడెవ్వరూలేరు. 1847లో ఆయన నిర్యాణం చెందినాడు. మొదటి భార్య పార్వతమ్మ గతించిన తర్వాత ఆమె చెల్లెలు కమలమ్మను ఆయన

వివాహం చేసుకున్నాడు.

త్యాగయ్య చిన్ననాడే సంగీత ప్రజ్ఞను ప్రదర్శించాడు. ఆ కాలంలో తిరువైయూరులో నివసించిన శొంఠి వెంకటరమణయ్యగారివద్ద త్యాగరాజు ఒక సంవత్సరంపాటు విద్యాభ్యాసం చేశాడు. గొప్ప వీణావాదన పాండిత్యాన్ని ఆర్జించాడు. ఆయన దాదాపు 24,100 కీర్తనలు రచించినట్లు ప్రతీతి. ఇప్పటికి లభ్యమయినవి దాదాపు 800 మాత్రమే. వాటిని 72 రాగాలలో ఆయన మేళవించుకొన్నాడు.

త్యాగరాజు కేవలం సంగీత మర్మజ్ఞుడేకాదు-కవితా శిల్ప రహస్యవేదికూడా. "మేరు సమానధీర" "అలకలల్లలాడ" అను కీర్తనలు ఇందుకు ఉదాహరణంగా పేర్కొనవచ్చు. భక్తిరసంతోపాటు, రామచంద్రుని లావణ్యా రూపదర్శన తన్మయత్వంలో ఉదాత్త శృంగార రసాన్ని కూడా ఆవిష్కరించాడు. ఆయన రచించిన ప్రహ్లాద చరిత్రలో, నౌకా చరిత్రలో, సీతారామ విజయంలో పాత్ర పోషణ, కవితాశక్తి, సంఘటనల చిత్రీకరణ అద్భుతంగా ప్రదర్శింపబడినవి.

ఆయన కీర్తనలు త్యాగోపనిషత్తుగా ఖ్యాతి గాంచడానికి కారణం, ఆయన భావనా సరళిలోని, నిరంతరాన్వేషణ, హృదయావేదన, దైవారాధన, భక్తిసాధనతో కూడిన ఆధ్యాత్మిక లౌకిక జీవిత విశ్లేషణమే.

"కోకలు వేయున్న కట్టుకొనుట కొకటిగాని మనసా" అని "చేరడేసి గుడ్డికనులు తెరిచి యేమి తెరవకుంటెనేమి" అని, "[illegible] దొర కొడుకుబ్రోచురా" అని, "తనయుని బ్రోవ జనని వచ్చునో, తల్లివద్ద బాలుడు వచ్చునో" అని తన అపార జిజ్ఞాసను, అగాధానుభూతులను తేనెలు కురిసే తేటతెలుగులో అందించిన అమృతమూర్తి త్యాగరాజు. ఆయన తన జీవితకాలంలోనే లోకానికి ఆరాధ్యుడైనాడు. నాదబ్రహ్మయై అణువు అణువూ, తనువు తనువూ పులకించే, తరించే రాగ రసవృష్టి చేసిన మహర్షి. పోతనవలె తన కృతులను రాజాంకితం చేయక, మానవతకు మారురూపమైన దైవానికి అంకితం చేశాడు. తన కళను, తన జీవిత సర్వస్వాన్ని మానవకళ్యాణానికి సమర్పించిన సీతారామభక్తు డాయన. పరమభక్తితో, చిత్తశుద్ధితో చేసిన కళాసృష్టియే నిలుస్తుందనే, ఒక మహత్తర ప్రయోజనాన్ని సాధిస్తుందనే, నాటికీ ఏనాటికీ చెరగని సత్యాన్ని, సందేశాన్ని తన 80 ఏళ్ళ నిండు జీవితాన్ని ఆరనిదీపంగా వెలిగించి లోకానికి చూపాడు త్యాగయ్య. పలుకగలిగిన ప్రతిగళానికీ, వినగలిగిన ప్రతిహృదయానికీ వీణాతంత్రుల్లో, వినిర్మలవాక్సుమాలలో అమ్లానభక్తిభావ పరిమళాలను అందించాడు ఆ మహనీయుడు. అందుకే ఆయన మూర్తిని

దర్శించిన, ఆయన కీర్తిని స్పర్శించిన ప్రతివాడు తూము నరసింహదాసువలె పరమానందపరవశు డౌతాడు. త్యాగరాజును దర్శించి ఆయన మహిమలను కొనియాడుతూ, ఆ పరమభక్తుడు నరసింహదాసు చెప్పిన హృద్యమైన రెండు ఆశుపద్యాలతోనే త్యాగరాజును స్మృతింమదాం.

"కేశవానంద సంకీర్తనావళి వింటి
భావసిద్ధియు శుద్ధభక్తి గంటి
భక్తులు శిష్యులు బలిసి కొల్వగ గంటి
వాఙ్మాధురీ వైభవంబు గంటి
వినయ సత్సంపద్వివేకంబు కనుగొంటి
శ్రీ రామ పదభక్తి చెలువు గంటి
అజునకందగరాని అనుభవంబును గంటి
తన్మయత్వం బాత్మ తనర గంటి
అరసి కనుగొంటి త్యాగరాయార్యునందు
శుద్ధ సద్గుణపుంజ మింకెన్నియైన
దివ్యమహిమాతిశయములు తేజరిలుట
గంటి హర్షాబ్ధి నోలాడు మంటిమదిని

రామపరభక్తి త్యాగయార్యవరునికిని
సమము గానేర రెవ్వరీక్ష్మాతలమున
ప్రేమనా ఘను డొకసారి పిలిచెనేని
రాము డోహో యనుచు మార్పలుకునంట.

త్యాగరాజు చరిత్ర, ఆయన జీవితాదర్శం, ప్రతిభావంతులైన నేటి గాయనీ గాయకులకు, సంగీత శాస్త్రజ్ఞులకు, సృజనాత్మక, నవచైతన్య దీపక గానకళా రాగరచనా దృష్టిని ప్రసాదించి, మార్గదర్శకం కాగలవని ఆకాంక్షిద్దాం.



# స్మరణీయుడు
# కట్టమంచి రామలింగారెడ్డి

కాలం చేసే మహేంద్రజాలం మరుపు. అన్నీ సృష్టించేది కాలమే. అన్నిటినీ హరించేది కాలమే. మనిషిలోని అపార శక్తుల్నీ, దయనీయ పరిమితుల్ని గుర్తు చేసేది కాలమే. మురిపించేదీ - మరిపించేదీ కాలమే.అయితే కాలపు మరిపించే మాయాజాలానికి లొంగని మహనీయులు కొందరు ఈ లోకంలో పుడుతూనే ఉంటారు. వాళ్ల మీద కాలప్రభావం ఎంత ఉన్నా కాలాతీతులుగా నిలిచిపోతారు. అలాంటి అద్భుత మహిమాన్వితులలో గణనీయులు డా॥ కట్టమంచి రామలింగారెడ్డి గారు.

అది 1880 సంవత్సరపు డిశెంబరు 10 వ తేదీ. చిత్తూరు పంచలో ఉన్న కట్టమంచి గ్రామంలో నారాయణమ్మ - సుబ్రహ్మణ్యారెడ్డి రైతు దంపతుల కలలు పండాయి. రమణీయ గ్రామసీమలో రామలింగారెడ్డి ఉదయించారు. కొబ్బరి తోటల మధ్య నెలకొన్న రైతన్న ఇల్లు మహనీయ మానవతామూర్తి వెలసిన కోవెల అవుతుందని ఎవరూ ఊహించి ఉండరు. అయితే పూవు పుట్టగానే పరిమళిస్తుంది అన్నట్లు చిన్నారి రామలింగారెడ్డి లోని శివభక్తి, ఆయన చదువుకు శ్రీకారము చుట్టినప్పటినుండే చిన్మయానందం వెదజల్లింది. నారాయణమ్మ కడుపున పుట్టినా శారదమ్మ ఒడిలోనే పెరిగాడు. యశోలక్ష్మి తోడుగానే వెలిగాడు.

తన పదవ ఏటనే పల్లెటూరి పాఠశాలకు వీడ్కోలు చెప్పి, చిత్తూరులోని ఉన్నత పాఠశాలలో చేరి, తన పదహారవ ఏట పదవతరగతిలో ఉత్తీర్ణుడైనాడు. అపుడే ఆయన ప్రగతి యాత్ర ప్రారంభమైంది. ప్రతిభాశాలి వినయశీలియైన ఆ యువకుణ్ణి చెన్నపురి క్రైస్తవ కళాశాల కన్నులార కద్దుకుంది. చిత్తూరులో తెలుగు పండితుడు కుప్పనయ్యంగారు తెలుగు సాహిత్య చైతన్యాన్ని ఆ పసిహృదయంలో పలికిస్తే, మదరాసులో డా. విలియం మిల్లరు, డా॥ స్కిన్నరు, ఆయన యువ మానసంలో విజ్ఞాన జిజ్ఞాస జ్యోతిని ప్రజ్వలింపజేశారు. ఆ కళాశాలలో సామర్తి రంగయ్య చెట్టి, అధ్యక్షతలో ఆంధ్రభాషాభిరంజని అనే తెలుగు సంఘం నెలకొని ఉండేది. ప్రఖ్యాత నాటక కర్త, పండిత మూర్ధన్యుడు వేదం వేంకటరాయ శాస్త్రి, రెడ్డిగారి లోని ప్రతిభా శక్తిని గమనించి ప్రోత్సహించాడు. "ఆంధ్ర భాషాభిరంజని" సంఘం నిర్వహించిన వ్యాసరచన వక్తృత్వ పోటీలలో చురుకుగా పాల్గొనేవాడు విద్యార్థి రామలింగారెడ్డి. అప్పుడే

ఆయనలోని సృజనాత్మక కవితాశక్తి "ముసలమ్మ మరణం" అనే కావ్యావతారమెత్తింది. రామాయణ భారతాది కావ్యాలలో, భావబంధురమైన ప్రబంధాలలో సత్యసాహిత్యాత్మను దర్శించాడు. మహా పండితుల తలలూపించిన 'కవిత్వతత్వ విచారము' కళాశాల విద్యార్థిగా ఉన్నప్పుడే ప్రకటించాడు. స్వతంత్ర కావ్య నిర్మాణ చేతనకు ఎత్తిన కేతనంలాంటి కళాపూర్ణోదయం ఆయన కవితాతత్వ విచారానికి కేంద్రమై నిలిచింది. తెలుగు సాహిత్య చరిత్రలో రెడ్డి గారికి ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించిన కావ్యరచన, కావ్య విమర్శనాశక్తికి కళాశాల జీవితంలోనే అంకురార్పణ జరిగింది. తాత్వికచింతన, ఆంధ్రాంగ్ల బాషాధ్యయనం ఆయన సృజనాత్మక దర్శనాత్మకశక్తిని ఎంతో ఉద్దీపింపచేశాయి. విశాల వాతావరణంలో ఆయన ప్రతిభావృక్షం వివిధ విజ్ఞాన శాఖలతో విస్తరిల్లింది. చరిత్ర, రాజనీతి, సాహిత్యం, తత్వశాస్త్రం వంటి భావదీప్తులతో ఆయన చైతన్య కల్పకం అనంతాకాశపథాలలో హరివిల్లై విరిసింది.

డా॥ స్కిన్నర్ సహకారంతో ప్రోత్సాహంతో కట్టమంచి విద్యా విజ్ఞానయాత్ర స్వదేశ తీరాలను అధిగమించి దూరతీరాలకు చేరుకుంది. విజ్ఞాన ప్రజ్ఞాన విహాయస వీథుల్లో రెక్కలార్చిన ఆయన ప్రతిభావిహంగానికి విశ్వవిఖ్యాత కేంబ్రిడ్జి వాతావరణం ఎంతో స్ఫూర్తి కలిగించింది. అక్కడి సేయింట్ జోన్సు కళాశాలలో 1902 లో ఆయన చేరాడు. 1903 వ సంవత్సరంలోనే ఆయన ప్రతిభా పాటవాలను, సామర్ధ్యాన్ని గుర్తించి "రైటు" బహుమానంతో ఆయన్ని సత్కరించారు. మరుసటి సంవత్సరమే ఆ కళాశాలలో విద్వాంసుడు (Foundation scholor of St. Johns College) గా ఎన్నుకోబడ్డాడు. 1905లో కేంబ్రిడ్జి యూనివర్సిటీ లిబరల్ క్లబ్ కార్యదర్శిగా ఎన్నికైనాడు. ఆయన ప్రతిభకి గుర్తింపు అంతటితోఆగలేదు. ఆ తర్వాత కేంబ్రిడ్జి యూనియన్ సొసైటికి ఉపాధ్యక్షుడిగా ఎన్నుకోబడ్డాడు. అనాటికి ఏ భారతీయునికి లభించని గౌరవాన్ని ఆర్జించాడు. ఆనాటి ఇంగ్లాండు రాజకీయ పరిణామాలతో ఆయనకు అత్యంత సన్నిహిత సంబంధం ఉండేది. ఆ దేశపు పార్లమెంటు ఎన్నికల్లో లిబరల్ పార్టీకి అనుకూలంగా ఆయన చేసిన అనర్గళ ఉపన్యాసాలు, ఆంగ్లేయులకే అత్యంతాశ్చర్యం కలిగించేవి. కొందరు ఆయన్ని బర్కుతో పోలిస్తే, రంగు పులుమబడ్డ భారతీయుడే కాకపోతే రామలింగారెడ్డి ఇంగ్లాండు ప్రధాని అయ్యేవాడని విజ్ఞులు మరి కొందరు కొనియాడారు. ఆనాటి ప్రపంచ రాజకీయ, సాంఘిక సమస్యల పట్ల రెడ్డి గారికి ప్రగాఢమైన అవగాహన ఉండేది. వివాదస్పదమైన విజ్ఞాన దాయకమైన వక్తృత్వ సభలు ఆయన

యూనియన్ సొసైటీ పక్షాన నిర్వహించేవాడు." That the present system of British Parliamentary Government ought to be allowed to die quickly and quietly", "that this house would welcome prompt introduction of Representative Government in Russia" వంటి విప్లవాత్మకమైన అంశాల మీద ఆయన చేసిన ప్రసంగాలు ఆనాటి మేధావుల మన్ననలందుకొన్నవి. J.M. Keynes, Morgan Philips Price వంటి బుద్ధి జీవులు ఆయన సహాధ్యాయులుగా ఉండేవారు.

పారతంత్ర్యంలో మగ్గుతున్న నాటి భారతంలో రైతు బిడ్డగా పుట్టిన రెడ్డి ప్రపంచాధిపత్యం నెరపుతున్న ఇంగ్లాండు గడ్డ పై నిలిచి, ఇరువయ్యశతాబ్దాన్ని ఆవిష్కరించిన ప్రజాస్వామ్య ప్రగతిశీల ఆదర్శాల శంఖారావం వినిపించాడు.

దేశభక్తి, సేవాసక్తి పరుడైన కట్టమంచి సామర్థ్యాన్ని గుర్తించిన బరోడా సంస్థానాధీశులు ఆయన్ని ఉన్నతవిద్యాధ్యయనం కోసం అమెరికాకు, పంపించడమే గాక, 1907లో ఆయన తిరిగి మాతృభూమిపై కాలుమోపగానే బరోడా కళాశాల ఉపాధ్యక్షపదవి ఇచ్చి గౌరవించారు. నాల్గు దశాబ్దాలపాటు సాగిన ఆయన విద్యా విజ్ఞాన సంవర్థక ఉద్యమానికి ఆ ముహూర్తంలోనే అంకురార్పణ జరిగింది. 1893 నుండి 1906 వరకు యోగీశ్వరుడైన అరవిందులు అలంకరించిన ఆ విద్యాపీఠాన్ని వాగీశ్వరుడైన మన రెడ్డిగారు అధివసించడం ఒక అపూర్వ సన్నివేశం. అయితే అప్పటి కాలంలోనే ఆయన కీర్తి, దిగంతాలు వ్యాపించింది. 1910లో మైసూరు సంస్థానపు దివాను మాధవరావు గారి ప్రతిభా పక్షపాతం మైసూరు మహారాజావారి కళాశాలలో రెడ్డి గారికి ఆచార్య పీఠం వేసింది. ఆయన అపూర్వ బోధనా పద్ధతి విద్యార్థిలోకంలో ఒక నూతన చైతన్య దీప్తి కలిగించింది. మైసూరు యవరాజు శ్రీ నరసింహరాజు ఒడయారులో కలిసి 1913లో జర్మనీ, ఫ్రాన్సు, అమెరికా, చైనా, జపాను వంటి అనేక దేశాలు పర్యటించారు. వారి పరిశోధనాత్మక పర్యటనానుభవాలు ఆ సంస్థానపు సత్వర సర్వతోముఖ అభివృద్ధికి దోహదం చేశాయి. 1915 నుండి 1917 వరకు మహారాజావారి కళాశాలకు ప్రిన్సిపాలుగా ఉండి, 1917 నుండి 1921 వరకు మైసూరు సంస్థాన విద్యాశాఖాధికారిగా వ్యవహరించి విద్యావిధానంలో బోధనా పద్ధతులల్లో రామలింగారెడ్డి గారు విప్లవాత్మకమైన, ప్రయోజనాత్మకమైన మార్పులు తీసుకువచ్చారు. అంటరానివారుగా పరిగణింపబడ్డ హరిజనులకు ఆనాడే సమతాభావంతో ఆయన చేసిన సేవ, ఆయన్ని హరిజన బంధువును చేసింది.

1921లో తన విద్యాధికారి పదవికి రాజీనామ ఇచ్చి, మదరాసు వచ్చి రాజకీయాలలో చొచ్చి యునివర్సిటి నియోజకవర్గంనుండి మదరాసు శాసనసభకు ఎన్నికై 1922 నుండి 1926 వరకు ప్రజాజీవన ప్రగతి కోసం పాటుపడ్డాడు. శాసనసభలో ఆయన చేసిన ప్రసంగాలు, సరస సాహిత్య సురభిళాలు, సమగ్ర విజ్ఞానకోశాలు. ఏరంగంలో ఉన్నా ఆయన విద్యావేత్తగానే వెలిగిపోయారు. 1925లో ఆంధ్ర విశ్వవిద్యాలయ చట్టపు రచనలో, 1926లో విశ్వవిద్యాలయ స్థాపనలో రెడ్డిగారు వహించిన పాత్ర సకల జన ప్రశంసాపాత్రమైంది. చారిత్రాత్మకమైంది. ఆంధ్ర విశ్వవిద్యాలయానికి తొలి ఉపాధ్యక్షులై శాసనసభ వీడి తన సహజ స్వభావోచితమైన విద్యారంగంలో తిరిగి వీరవిహారం చేశాడు. 1930 లో గాంధీజీ నాయకత్వంలో సాగిన స్వాతంత్ర్య సమర సందర్భంలో బ్రిటీష్ ప్రభుత్వం ప్రదర్శించిన పైశాచిక వైఖరికి నిరసనగా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవికి ఆయన రాజీనామా చేశాడు. ఆయన ఎంతటి ప్రతిభాశాలియో అంతటి త్యాగశీలియని నిరూపించుకున్నాడు. 1930 నుండి 1936 వరకు మాత్రమే ఆయన విశ్వవిద్యాలయానికి దూరంగా రాజకీయాలలో ఉండి పోయారు. సంకుచిత రాజకీయాలతో సతమతమై, మహామేధావి తత్వవేత్త రాధాకృష్ణ పండితునికి ఆయన అప్పగించి పోయిన ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవి తిరిగి స్వీకరించారు. 1949 వరకు తన అపార అనుభవాన్ని, అభ్యుదయోన్ముఖ విజ్ఞానాన్ని మాతృదేశం కోసం, మానవాళికోసం ధారవోసిన ధీరోదాత్తుడాయన. 1951 ఫిబ్రవరి 14 వతేదీనాడు ఈ లోకాన్ని సంతాపంలో ముంచి పరలోక గతుడైనారు ఆయన.

రెడ్డిగారి సాహిత్య సేవా సంస్మరణం " ముసలమ్మమరణం"తో ప్రారంభమౌతుంది. నిజానికి "ముసలమ్మ మరణం" ఒక వినూతన కవితా ప్రక్రియా జననం" గా పరిణమించింది. ఒక వ్యక్తి సంఘం కోసం, ప్రాణత్యాగం చేసిన పవిత్ర చారిత్రకాంశాన్ని కవితా వస్తువుగా తీసుకొని చర్విత చర్వణమైన, ప్రతిబా శూన్యమైన తెలుగు సాహిత్య క్షేత్రంలో ఆధునిక యుగ చైతన్యాన్ని ఆవిష్కరించారు. సంప్రదాయాన్ని జీర్ణించుకున్న రెడ్డి క్రొత్త రక్తాన్ని పుంజుకొని నవభావపికమై కూయగానే తెలుగు సాహిత్య లోకానికి ఒక నవయుగ వాసంతం కదలివచ్చింది.

కన్నెర్ర వాలిన ఖరకరోదయకాల మల్లన మ్రింగు జాబిల్లియనగ
జ్వలదగ్ని శిఖలపై నెల నవ్వుతో బోవు ధాత్రీ మహాదేవితనయ యనగ
గెందామరల బారు సుందరముగులీల నల్లనల్లన జొచ్చు నంచ యనగ

కాలమహా స్వర్ణకారకుండగ్నిలో కరగించు బంగారు కరణీయనగ
ప్రళయ కాలానలప్రభాభాసురోగ్ర
రంగదుత్తంగ భంగ సంఘాతము లకు
కలకనొందక, దరహాసమలర, మంద
మందగతిబోయి, జొచ్చె అమ్మగువ నీట ...

ఈ పద్యం రెడ్డిగారి కావ్యశిల్పనైపుణ్యానికి మచ్చుతునక. రెడ్డిగారు అనేక ఇతర గ్రంథాలు రచించారు. ఆర్థిక శాస్త్రము, వ్యాసమంజరి, పంచమి, Speeches on University Reform, Democracy in Contemporary India మొదలైనవి వారి బహుముఖ ప్రతిభకు దర్పణాలు. భాషా విషయంలో ఆయన ఎంతటి – చిన్నయ సూరి అంతటి – సంప్రదాయశీలియో, భావ ప్రకటనలో ఆయన అంతటి అభ్యుదయశీలి. దైవదత్తమైన ఆయన అభివ్యక్తి శక్తి ఆయన వ్యక్తిత్వాన్ని పెంచిపోషించింది. ఆజన్మ బ్రహ్మచారియై, జీవితానంద తత్వమెరిగిన కర్మయోగి ఆయన. ఆయన చలోక్తులు, చతురోక్తులు జీవన సూక్తులుగా నిలిచిపోయాయి. ఎంతటి కర్కశ సన్నివేశంలోనైనా నవ్వుల పువ్వులు వికసింపజేసే కళాచేతను డాయన. నిరంతర విజ్ఞాన తపస్వియై త్యాగభోగయశస్వియైన, చరితార్థుడాయన.

నేను ఎనిమిదవ తరగతిలో చదువుతున్నప్పుడు రెడ్డిగారి అకాలమరణ వార్త విన్నాను. దేశానికి ఎంత విపత్తు జరిగిందో అప్పుడు నాకు అర్థం కాలేదు. విశ్వనాథ సత్యనారాయణ గారు ఆయన గురించి వ్రాసిన పద్యాలు చదివినపుడు నా కంటిలో పొంగిన కన్నీటిలో మాత్రం ఆయన్ని చూశాను. ఆ తర్వాత రెడ్డిగారి జీవితాన్ని స్మరించిన రచనలు కోకొల్లలు. గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు తెలుగులో డి. ఆంజనేయులుగారు ఆంగ్లంలో వ్రాసిన రెడ్డిగారి జీవిత చరిత్రలు, ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు 1980లో వెలువరించిన రెడ్డిగారి శతజయంతి ప్రత్యేక సంచిక, ఆయన స్మృతికి పట్టిన అక్షర దీపాలు. అయితే డా॥ కట్టమంచి రామలింగారెడ్డి గారి జీవితాన్ని సింహావలోకనం చేసిన ఎవ్వరికైనా అంతటి ప్రతిభావంతుడు చేరుకోవలసిన శిఖరాలు చేరుకోలేక పోయాడనే ఆత్మవేదన మిగులుతూనే ఉంటుంది. అందుకు ఆనాటి పరిస్థితులతోపాటు ఆయన కున్న కొన్ని పట్టింపులు కూడా కారణమేమో అనిపిస్తుంటుంది. నార్ల వేంకటేశ్వరరావుగారన్నట్లు కేవలం సాహిత్యక్షేత్రంలో కాదు, తాను కృషి చేసిన ప్రతి రంగంలో డా॥ రామలింగారెడ్డి ఎవరెస్టు శిఖరాన్ని అందుకొనబోతున్నట్లే కనబడి దానికి అల్లంత దూరంలో ఆగిపోతూ వచ్చారు. అవును, "మరొక్క ఊపే చాలు గమ్యాన్ని చేరడానికి" అన్నట్లు సాగింది ఆయన జీవితం. అయినా ఆయన మూర్తి తెలుగు యువలోకానికి యుగ యుగాలు ఆత్మవిశ్వాస స్ఫూర్తిని కలిగిస్తూనే ఉంటుంది.

# నా దృష్టిలో శ్రీ శ్రీ

( ప్రఖ్యాత విమర్శకుడు డా. కె. రామమోహన్ రాయ్ ఆ మధ్య శ్రీ శ్రీ రచనల స్వభావం గురించి నన్ను అడిగిన కొన్ని ప్రశ్నలకు సమాధానాలు, శ్రీ శ్రీ గురించిన నా ప్రశ్నోత్తర వ్యాసం అయింది. సాహిత్య జిజ్ఞాసువులైన తెలుగు పాఠకలోకానికి చిత్త శుద్ధితో అందిస్తున్నాను.)

ప్రశ్న : శ్రీ శ్రీ రచనలను మొదటిసారిగా మీరెప్పుడు చదివారు? అప్పుడు మీ వయస్సెంత? అప్పుడాయన రచనల గురించి మీరేమనుకున్నారు? శ్రీ శ్రీ కవిత్వం గురించి ఇప్పటి మీ అభిప్రాయ మేమిటి?

జవాబు : శ్రీ శ్రీ రచనలను నేను మొదటిసారి 1953-54లో చదివినట్లు గుర్తు. అప్పుడు నా వయసు 17 సంవత్సరాలు. అప్పు డాయన కవిత్వం నన్ను మంత్రముగ్ధుణ్ణి చేసింది. తెలుగు సాహిత్య వనంలో గొంతెత్తిన క్రొత్త కోకిల వలె ఆయన భాసించాడు. సామాన్య మానవుణ్ణి కవితా వస్తువుగా తీసుకొని అసామాన్యమైన భావావేశాన్ని ప్రకటించిన కళాశక్తి ఆయనలో ద్యోతకమయ్యేది. ఇప్పటికీ ఆయన కవిత్వంలో మానవత్వం – మార్పుతత్వం కలసి కదం త్రొక్కుతూ క్రొత్త లోకాలు వెదుకుతున్న అనుభూతి కలుగుతుంది.

ప్రశ్న : శ్రీ శ్రీని యుగకర్తగా మీరు భావిస్తారా? భావిస్తే అందుకు మీరు చూపే నిదర్శనాలేమిటి?

జవాబు : యుగకర్తగా నే నెవరిని భావించను. అనంతమైన దేశ కాలాలలో అసలు యుగం అనే మాటకే అర్థం లేదు. కాకపోతే శ్రీ శ్రీ రెండు మూడు దశాబ్దాలు యువకుల మీద (1940-70) గమనించదగినంత ప్రభావాన్ని కలిగించాడు. స్వేచ్ఛా ప్రియత్వం లోపించిన తెలుగు సాహిత్య సంప్రదాయంలో "గాలియొసగెడి క్రొత్త రెక్కల ధరించి, అతి నిరాఘటముగ విహాయసపథాల నెరుక పడరాని ఎచటికో ఎగసిపోదు" అంటూ క్రొత్త సత్యాన్వేషణకు బయలు దేరిన బాటసారి శ్రీ శ్రీ. ఆయనను ఎందరో అనుసరించారు. ఈ ప్రపంచాన్ని ఈసడించే ఆలోచనాపరులు శ్రీ శ్రీ ఊహించిన మరో ప్రపంచం పట్ల తమ ఆసక్తిని

అభిమానాన్ని చూపించారు.

ప్రశ్న : శ్రీ శ్రీ రచనల్లో 'మహాప్రస్థానం' మాత్రమే మహా కావ్యమని మిగిలిన కవితలు చిరకాలం తలచుకోదగినవి కావనీ అంటారా?

జవాబు : "మహా ప్రస్థానం" శ్రీ శ్రీ రచనలన్నిటికీ మకుటాయమానం. అందులో ఆయన సృజనాత్మక శక్తి అభ్యుదయోన్ముఖంగా అభివ్యక్తమైంది. రాశిలో కంటే వాసిలో అది ఒక విప్లవాత్మక చైతన్యాన్ని ప్రదర్శించింది. అది నాలుగు కాలాల పాటు నిలిచే మహా కావ్యము అనుటంలో సందేహం లేదు. అయితే కవి ప్రతిభ ఏ ఒక రచనకో పరిమితం కాదు. ఆయన ఇతర రచనల్లో కూడ ప్రశంసనీయమైన ప్రత్యేకమయిన భావుకత కనిపిస్తుంది. పువ్వు పుట్టగానే పరిమళించునన్న సామెత శ్రీ శ్రీ కి పూర్తిగా వర్తిస్తుంది. ఆయన కలం పట్టిన నాటి నుండి కన్ను మూసిన నాటి వరకు చేసిన రచనలన్నిటిలో శ్రీ శ్రీ స్వేచ్ఛా ప్రియత్వం, శిల్ప చాతుర్యం కనిపిస్తుంది. ఆయన వ్రాసిన ప్రకృతి ప్రణయ ప్రకీర్ణ గీతాలలో ప్రచ్ఛన్నంగా ఉన్న భావస్ఫూర్తియే మహా ప్రస్థానంలో ప్రజ్వలించింది. "ప్రత్యూషస్ఫురదభ్రమండల విభావైచిత్రముం గాంచి" హృష్టాంతరగుండై "సత్యక్రీడల దేలిపోదు" అన్నప్పుడే ఆయన నిత్య సత్యాన్వేషియైనాడు. ఆయనకు తెలియకుండానే ఒక సాహిత్య "మహా ప్రస్థానం" సాగించాడు. ఆయన రచనలన్నీ ఆ ప్రస్థానంలో మైలు రాళ్లే – ఆ సత్యచైతన్యపు వివిధ రూపాలే.

"ఇమిటేషన్ తప్ప స్వతం
త్రముగా నూహింపగల మెదడు లే కసమ
ర్థముగా కృతులను విరచిం
చి, మమ్ములను పొగడు మంద్రు సిరిసిరిమువ్వా"

అన్న శ్రీ శ్రీ, తన రచనన్నీ ఎందుకు నిలుస్తాయో తనను "యుగకర్తను" చేసి అనుకరిస్తున్న వాళ్లు ఎందుకు కవులుగా నిలువలేరో కూడా స్పష్టం చేశాడు.

ప్రశ్న : శ్రీ శ్రీ వచన రచనలు – కథలు, వ్యాసాలు, నాటికలు గురించి మీ అభిప్రాయమేమిటి?

జవాబు : శ్రీ శ్రీ కథలు నాటికల గురించి నేను ఖచ్చితంగా చెప్పలేను గాని

ఆయన వ్యాసాలు, విమర్శలు, సమీక్షలు ఆయన ప్రతిభా పాండిత్యాలకు దర్పణాలు. సూటిగా, ఘాటుగా చెప్పే లక్షణంతో పాటు రసవత్తరమైన వ్యంగ్య వైభవమూ, ఆలోచ నాత్మకమైన భావుకతా ఆయన వచన రచనలో, కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది.

ప్రశ్న : మార్క్సిస్టు దృక్పథంతో కాకుండా శ్రీ శ్రీని వేరుగా - ఆయన కావ్య వస్తువులను బట్టి శిల్పాన్ని బట్టి మహా కవిగా ఎంచవచ్చునా?

జవాబు : శ్రీ శ్రీ మహా కవి కావడానికి కారణం ఆయనకు ఆపాదించే మార్క్సిస్టు దృక్పథం కాదు. ఈ దృక్పథంలోనే వ్రాస్తున్నా మనుకొని వ్రాసిన, వ్రాస్తున్న అనేకులు "మహాకవులు" కాదుగదా అసలు "కవులు" అనడానికే అర్హులు కాకుండా పోతున్నారు. మార్క్సిస్టు సిద్ధాంతాలు కొన్నాళ్లకు మారిపోవచ్చు. అక్కర లేకుండా పోవచ్చు. అప్పుడు శ్రీ శ్రీ కవిత్వం కూడా నీరు కారిపోతుందా అనే దృష్టితో ఆయన కవిత్వాన్ని పరిశీలించాలి. ఇవాళ మనం పోతన భాగవతాన్ని , కవిత్రయ భారతాన్ని, మనుచరిత్ర, పారిజాతాపహరణం, విజయవిలాసం వంటి ప్రబంధాలను, వేమన పద్యాలు వంటివి చదువుకొని ఆనందించటానికి కారణం అవి ఏదో ఒక ప్రత్యేక దృక్పథంతో వ్రాయబడటం ఆ దృక్పథాలు నేటికి మనకు ఆదరణీయాలు కావడం కాదు. కవితా వస్తువు. తద్వస్తుగతమైన కవిభావన, భావాభివ్యక్తి, రచనా శిల్పం వలన కవితకు వైశిష్ట్యము సంక్రమిస్తుంది. భావుకత లేని వారు, శబ్ద శిల్ప రహస్యం తెలియనివారు ఏ ధృక్పథంతో వ్రాసినా అది సజీవమైన, విశ్వజనీనమైన కనీసం ప్రయోజనాత్మకమైన కవిత్వం కూడా కాలేదు. మార్క్సిస్టు దృక్పథం అనేది ఈ శతాబ్దంలో రష్యా విప్లవం తర్వాత ప్రపంచ వ్యాప్త మైన ఒక రాజకీయ చైతన్యంగా పెల్లుబికింది. అది సాహిత్య చైతన్యంగా సామాజిక చైతన్యంగా ప్రకటితమైనా అది ప్రతిపాదించే "సత్యం" అపూర్వమైనదిగానీ, అచంచలమైనదిగానీ కాదు. శ్రీ శ్రీ అయినా ఏ శ్రీ అయినా సాధించవలసిన సత్యం ఒకటే. దాన్ని అభివ్యక్తం చేసే సరళి మారవచ్చు. శ్రీ శ్రీ తన రచనల్లో సాధించింది ఉపనిషత్ విజ్ఞానంలో వికసించిన మానవతా ధృక్పథాన్ని మించిన ధృక్పథంకాదు. సర్వమానవ సమానత్వాన్ని

దోపిడీ రహితమైన సమాజ ధర్మాన్ని ప్రవచించిన "వేద మార్గం" లో కూడా రచన సాగించినా శ్రీ శ్రీ మహాకవి అయ్యేవాడు. చెప్పేది ఒక్కటే అయినప్పుడు చెప్పడం చేతనైనవాడు ఎలా చెప్పినా గొప్పవాడే అవుతాడు. శ్రీ శ్రీ మహాకవి కావడానికి హేతువు "మార్క్స్‌ను" చదువుకోవటం కాదు. సిసలైన కవితాశిల్ప రహస్యం తెలిసికోవటం. శ్రీ శ్రీని నేను కవిగా గుర్తించేవాణ్ణి కాబట్టి ఆయన " కవితా చైతన్యానికి" పార్టీ రాజకీయపు రంగు పూసి ఆయన్ని కించపరచలేను. ఆయన కల్పించిన భావసత్యాలు విశ్వజనీనమూ, మానవ కళ్యాణదాయయకమూ కాబట్టి మార్క్స్ మాట ఎలా ఉన్నా, శ్రీ శ్రీ మహాకవుల పంక్తిలో స్థిరపడిపోయాడు.

ప్రశ్న : మీ రచనలపై శ్రీ శ్రీ ఎటువంటి ప్రభావాన్ని కలిగించింది విపులంగా చెప్పండి. ప్రభావం ప్రత్యక్షమో పరోక్షమో తెల్పండి.

జవాబు : నా రచనల మీద శ్రీ శ్రీ ప్రభావం లేదనను కాని ఆ ప్రభావం గ్రుడ్డి అనుకరణ మాత్రం కాదు. ఆయన శబ్ద శిల్పం, భావ సౌందర్యం, నిసర్గనిశిత శైలి నన్నెంతో ఆకర్షించేవి. మహా ప్రస్థానం తర్వాత నన్ను కదిలించినవి ఆయన ప్రాస క్రీడలు. ఎంత గొప్ప విషయమైనా సూత్రీకరించి మంత్రించి చెప్పే ఆయన రచనా నైపుణ్యం నన్నెంతో ప్రభావితుణ్ణి చేసింది. అయితే ప్రత్యక్షంగా కంటే పరోక్షంగానే ఆ ప్రభావం నా తొలి రచనల్లో కనిపిస్తుంది. రాను రాను నా శైలి నాదిగానే రూపొందుతున్న దనుకుంటాను.

మనిషి ఈ లోకంలో కూడా సుఖంగా సంతోషంగా, ఆనందమయుడుగా జీవించేఅవకాశం ఉండాలనీ, అందుకు కావలసిన భౌతిక సంపద కూడా అందరికీ సమానంగా పంచబడాలనీ ప్రబోధించే నా సాహిత్య దృక్పథంపై శ్రీ శ్రీ ప్రగతిశీల దృక్పథ ప్రభావం ఉందేమో!

ప్రశ్న : శ్రీ శ్రీ ఉపయోగించిన పదాలను, పదబంధాలను మీ రచనలకు శీర్షికలుగా ఉపయోగించుకున్నారా? శ్రీ శ్రీ కవిత్వపు పంక్తులను మీ రచనలో ఎక్కడైనా 'కోట్' చేయడం జరిగిందా?

జవాబు : లేదు. " కుక్క - కావ్యవస్తువు" అనే నా కవిత మాత్రం "అగ్గిపుల్ల - కుక్కపిల్ల" అన్నీ కవితా వస్తువులే అన్న శ్రీ శ్రీ ప్రవచనానికి

ప్రభావితుడనై వ్రాసినట్లు గుర్తు.

ప్రశ్న : శ్రీ శ్రీ తన సమకాలీకులపై, తదనంతర కవులపై కలుగజేసిన ప్రభావం ఎటువంటిది.

జవాబు : తన సమకాలీకులపై, తదనంతర కవులపై శ్రీ శ్రీ ప్రభావం పుష్కలంగానే ఉంది. అయితే ఆ ప్రభావంలో కొట్టుకుపోయిన వాళ్లంతా "పైడ్ పైపర్లు"గానే మిగిలిపోయారు. శ్రీ శ్రీ లాగానే వ్రాస్తేనే అభ్యుదయ కవులం అవుతామనుకునే భ్రమలోపడ్డ పసివాళ్ళను చూస్తే జాలివేస్తుంది. అయితే క్రమేపి యువకులు ఆ ప్రభావానికి దూరమవుతున్నారు. వచన కవితా ప్రాబల్యం పెరుగుతున్న ఈ రోజుల్లో వినిపించే క్రొత్త గొంతుకల్లో శ్రీ శ్రీ భావచైతన్యానికీ, శబ్ద శిల్పానికీ భిన్నమైన స్వతంత్రదీప్తి కనిపిస్తున్నది. ఏమి చెప్పాలో ఎలా చెప్పాలో తెలియని "కవులు" మాత్రమే శ్రీ శ్రీని గ్రుడ్డిగా అనుకరించి సంతృప్తి పడుతున్నట్లు అగుపిస్తుంది.

ప్రశ్న : భవిష్యత్తులో శ్రీ శ్రీ రచనలు సమాజంపై ఎటువంటి ప్రభావాన్ని కలుగజేస్తాయంటారు?

జవాబు : సాహిత్యపు ముఖ్య లక్షణం నూతన సత్య దర్శనం – రసాత్మక భావ సత్యకల్పనం. మన విలువల్నీ విశ్వాసాలను మార్చే శక్తి సత్య సౌందర్యాత్మకమైన సాహిత్యానికి ఉంది. మనుషులందరూ సమానులే, ఒకరినొకరు దోచుకోవడం, ఒకరిపై ఒకరు దౌర్జన్యం చేయడం మానవ సమాజ వికాసానికి గొడ్డలిపెట్టు అనే ప్రగతి ప్రబోధం శ్రీ శ్రీ సాహిత్యంలో ఉంది. అహం బ్రహ్మాస్మి, తత్వమసి, త్వమేవాహం వంటి అద్వైత దృష్టి ఉన్నవారికి కమ్యూనిస్టు దృక్పథంతో విభేదం లేదు. అయితే సమతాభావం మీద ప్రజలకు నిజమైన విశ్వాసం కల్పించడంలో అటు వేదనాదకవులూ, ఇటు విప్లవ వాద కవులలూ విఫలులయ్యారు. ఫలితం, మతమౌఢ్యం కులతత్వం, అమానుషత్వం, అసమానత్వం మన సమాజాన్ని పట్టి పీడిస్తూనే ఉన్నవి. ఈ దురాచారాలను తొలగించడంలో శ్రీ శ్రీ రచనలు ఉపకరిస్తాయి. అయితే వాటిని రాజకీయ ప్రచార సాధనంగా కాక సాహిత్య దర్శనంగా ప్రజలు స్వీకరించినపుడే ఆ ప్రభావం కలగడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది. సాహిత్యానికి

"సాహిత్య సత్యదర్శనానికి" మానవ సంస్కృతిలో ఒక ప్రత్యేకమయిన స్వతంత్రప్రతిపత్తి ఉన్నది అనే స్పృహ లేనప్పుడు శాశ్వతమైన సాహిత్య ప్రభావానికి, దైనందిన రాజకీయ ప్రభావాలకు తేడా ఉండదు.

ప్రశ్న : శ్రీ శ్రీ వ్యక్తిత్వాన్ని గురించి మీ అభిప్రాయమేమిటి?

జవాబు : శ్రీ శ్రీ అత్యంత ప్రతిభాశాలి, ప్రగతిశీలియైన కవి. మనిషి ఆలోచనల్ని విశ్వాసాలను మార్చే శక్తి, ఆయన కలానికి ఉంది. తొలినాటి ఆయన ప్రణయనాద పద్యాలలో, తదనంతర ప్రగతివాద గీతాలలో, అటుపై ప్రయోగించిన ప్రచార మోద రచనల్లో కూడా ఆయన సృజనాత్మక శక్తి, విశాల విజ్ఞానాసక్తి, ప్రయోజనాత్మక భావ దృష్టి ప్రస్ఫుటమౌతూనే ఉన్నాయి. ఆయన వ్యక్తిగత జీవితం కొంత వివాదాస్పదమే అయినా ఆయన నవ ప్రస్థాన నాయకత్వం అందరూ అంగీకరించవలసిందే. ఆయనలో కనిపించే మంచి గుణం పరిమితమైన రచనలు చేయడమే. కవితాత్మను దర్శించి, స్వప్న సత్య పథాలపై పయనించి శ్రీ శ్రీ కవిత్వం శ్రీ శ్రీని నాలుగు కాలాలపాటు నిలిచే కవిని చేసింది.

ప్రశ్న : శ్రీ శ్రీ అలవాట్లు, బలహీనతలు, పొరపాట్లు ఆయనకవిత్వానికి హాని కలిగించాయంటారా?

జవాబు : ఆయన అలవాట్లు, పొరపాట్లు, బలహీనతలు ఏమిటో మనకవసరంలేదు. అవి ఆయన వ్యక్తిగత విషయాలు. కవిత్వాన్ని, సాహిత్యాన్ని కొలిచే ప్రమాణాలు ఆయా రచనల్లోని గుణాగుణాలకే గాని ఆ కవికి వ్యక్తిగా వర్తించవు. శ్రీ శ్రీ బలహీనతలు శ్రీ శ్రీ రచనల్లో చోటు చేసుకొనలేదు. కాబట్టే అవి శక్తివంతమైన రచనలైనాయి. అలవాట్లు, పొరపాట్లు హానిచేయగలిగిన రచనా శక్తి నిజమైన భావచైతన్యానికి నిదర్శనం కాదు.

ప్రశ్న : "ఈ శతాబ్దం నాదే" అన్న శ్రీ శ్రీ అభిప్రాయంలో మీరు ఏకీభవిస్తారా?

జవాబు : ఆయన అలా అనకుంటే బాగుండేది. ఆత్మవిశ్వాసం మంచిదే కాని, ఆత్మస్తుతి అభిలషణీయం కాదు. నిజానికి ఈ శతాబ్దం వ్యక్తులది కాదు, శక్తులది. ఒక శతాబ్దపు కవి అయినవారు నిజమైన కవి కారు.

వ్యాస, వాల్మీకి, కాళిదాసు మొదలగు వారు తాము ఫలానా శతాబ్దపు కవులమని చెప్పుకోనందుకే కాలాతీత కవులయ్యారు.

ప్రశ్న : "శ్రీ శ్రీకి ముందంతా శూన్యం" అన్న అజంతా గారి అభిప్రాయంతో మీరు ఏకీభవిస్తారా? శ్రీ శ్రీ రచనలకు వారసులుగా మీరు ఎవర్ని తలుస్తున్నారు?

జవాబు : శ్రీ శ్రీ పట్ల అభిమానం ఉన్నవారెవరూ అలా అనరు. "శూన్యం"లో నుంచి పుట్టినవారు శూన్యంగానే మిగిలిపోతారు. వేదాంతార్థంలో ఆయన "స్వయంభువు" అని అన్నా అది ఆయన మూలవ్యక్తిత్వానికే, మార్క్సిస్టు ధృక్పథానికే విఘాతం అవుతుంది. ఒక గొప్ప వారసత్వంలో ప్రభవించిన చైతన్యమూర్తి ఆయన.

శ్రీ శ్రీకి ఫలానా వాడు "వారసుడంటే" అది అతని ప్రతిభనూ, ఆ వారసుని ప్రతిష్ఠనూ కించపరిచినట్లే అవుతుంది. "ఒకణ్ని మించినవాడు ఒకడు ఉండనే ఉంటాడు ఈ లోకంలో" అన్న విశ్వాసం గల నేను శ్రీ శ్రీని ఒక యుగకర్తగా కాని, ఒక వారసుని సృష్టించిన యాంత్రికశక్తిగా గాని ఊహించలేను.

ప్రశ్న : "నా శాశ్వత చిరునామా విరసం" అన్న శ్రీ శ్రీ గారి అభిప్రాయాన్ని మీరు మన్నిస్తారా?

జవాబు : ఆయన చిరునామా ఏదో తెలిస్తే అందరిలాగా ఆయన ఒక ఇంటి వాడే అయ్యేవాడు. ఇంటింటికి క్రొత్త దీపమై కంటి కంటికి వెలుగై ఆయన నిలువాలనీ కోరుకునే శ్రేయోభిలాషిని నేను ఆయన అభిప్రాయంతో ఏకీభవించలేను. విరసంతో ఆయన ఆడిన సరసంగానే ఆ మాటను నేను మన్నిస్తున్నాను.

ప్రశ్న : శ్రీ శ్రీ కవిత్వాన్ని మీరు తరచుగా చదువుతూ ఉంటారా? మననం చేసుకుంటారా?

జవాబు : అవును, ఆయన మాటల్లో ఉన్న మంత్రశక్తి అలాంటిది. అయితే ఆ బుక్కులు ఒక అవిచ్ఛిన్నమైన సత్యసాహిత్య సృష్టిలో భాగంగా నేను అన్వయించి ఆనందిస్తుంటాను.

ప్రశ్న : శ్రీ శ్రీకి తెలుగు జాతి అర్పించదగిన స్మృతి చిహ్నమేమిటి? అది ఏ రూపంలో ఉండాలి?

జవాబు : స్వప్నానికీ - సత్యానికీ మధ్య కట్టిన సాహిత్య "సమతామందిరం".

ఆయన "నక్షత్రాంతతర్నిబిడనిఖిలగానం" తన జాతి జనులు పాడుకునే మంత్రంగా" నిలచిపోవాలి. ఆయన వెలిగించిన కవితా దీపం "చీకటి బోనులో సింహం"లా లోకాలోకనం చేస్తూనే ఉండాలి – శ్మశానాల వంటి నిఘంటువులు దాటి, వ్యాకరణాల సంకెళ్ళు విడిచి, ఛందస్సుల సర్పపరిష్వంగం వదిలి సృజనాత్మక, కల్పనాత్మక శబ్ద శిల్పంతో తన భావతల్పం మలుచుకొన్నాడు శ్రీ శ్రీ. అందుకే ఆయనను "కవీనీగళగళన్మంగళ కళాకాహళాహళిలో కదిలిపోతిని" అంటూ సహృదయులు పాడుకోవడమే ఆయన స్మృతికి సిసలైన చిహ్నం.



# వచన కవిత

కవితకు ఒక నిర్వచనం అంటూ లేదు. కాని ఎవరికి తోచినట్లు వారు దాన్ని నిర్వచిస్తూ ఉంటారు. అయితే, స్థూలంగా హృదయస్పందనం కలిగించే భావనారీతిని కవిత అని పేర్కొనవచ్చు. అంటే కవిత అనేది ఒక విషయాన్ని గూర్చి భావించే పద్ధతి – విషయం కాదు. అందుకే కవితలో కవితా వస్తువు, కవిత అనే రెండు అంశాలు ఉంటాయి. కవితా వస్తువులు ఎవ్వరైనా స్పృశింపవచ్చు. కవిత మాత్రం రసాస్వాదనకు, ఆత్మానుభూతికి మాత్రమే అందుతుంది. కవి తనలో కదలాడే ఆస్వాదనానుభూతి శక్తులను బట్టి ఒక వస్తువును కవితగా మార్చగలుగుతాడు. అలాగే ఆ కవితా స్వరూపాన్ని సౌందర్యాన్ని పాఠకుడు లేక శ్రోత తదాస్వాదనానుభూతి స్థాయిని బట్టి గుర్తించగలుగుతాడు. అందుకే కవితా వస్తువు ఒకటే అయినప్పటికీ, దాన్ని ఆశ్రయించిన కవిత ఆయా కవుల భావనా వైఖరిని, శక్తిని బట్టి భిన్న భిన్నంగా వెలువడుతుంది. కవితా వస్తువులో నుంచి కాక కవి భావనాసరళిలోనుంచి కవిత వెలువడుతుందని మనం స్పష్టంగా గ్రహింపవచ్చు.

ఇక, ఈ కవితను ప్రకటించడానికి – ఆయా శాస్త్ర విజ్ఞానాన్ని, సమాచారాన్ని ప్రకటించడానికి వలెనే – శబ్దాలు, వాక్యాలు మొదలైన భాషాపరికరాలు అవసరమౌతున్నాయి. ఈ శబ్దాలను, వాక్యాలను కూర్చే. తీర్చే తీరునే ఛందస్సు అని మన పూర్వీకులు అన్నారు. అది మన సాహిత్య చరిత్రలో పద్యంగా, గద్యంగా, గేయంగా ఇటీవల వచన గేయంగా వెలువడ్డది. గణ యతిప్రాసలు, మాత్రలు, గతులు – వివిధ ఛందోరీతులను సృష్టించినవి. పూర్వం, అంటే నన్నయాదుల కాలంలో, ప్రబంధ కవులకాలంలో కవిత అంతా గణ యతి ప్రాసాత్మకమైన పద్య చందస్సులో నిర్మింపబడింది. చందో బద్ధమైన పద్యంతో పాటు లయబద్ధమైన గద్యాన్ని లేక వచనాన్ని కవులు వాడుతూ ఉంటేవారు. కాని పద్యమే పెత్తనం చేసిన నాటి కావ్యాలలో అక్కడక్కడ చోటుచేసుకున్న గద్యాలు (వచనాలు) స్వతంత్ర కవితా ప్రక్రియలుగా నిలబడలేకపోయాయి. గణబద్ధమైన పద్య కవితా ప్రక్రియను విడనాడి కొందరు ప్రయోగాత్మలైన కవులు మాత్రాబద్ధమైన గేయకవితా ప్రక్రియను సృష్టించుకున్నారు. అయితే యతి ప్రాసలు పద్యకవితకు అయినట్లు గేయ కవితకు అనివార్యం కాలేదు.

తెలుగు సాహిత్యం ఇటీవలి వరకు ఇంచుమించుగా పద్య గేయాత్మకంగానే

సాగింది. పందొమ్మిది యిరవైయవ శతాబ్దంలో ఆంగ్లభాషా ప్రభావం వలన ఈ సాహిత్యంలో వచనానికి క్రమ క్రమముగా ఎక్కువ ప్రాముఖ్యం లభించడం జరిగింది. ఆర్థిక, రాజకీయ సాంఘిక వ్యవస్థలో వచ్చిన మార్పులవలన సమాజంలో జనసామాన్యం కొంత ప్రతిపత్తిని, ప్రాముఖ్యాన్ని సంపాదించుకున్నది. ఇందువలన పండితులకూ, ప్రత్యేక వర్గాలవారికే పరిమితమయిన సాహిత్యం ప్రజా బాహుళ్యపు అందుబాటులోనికి రావలసివచ్చింది. వచన ప్రక్రియాగతాలైన వ్యాసాలు, నాటకాలు, నవలలు, కథానికలు తెలుగు సాహిత్యరంగంలో విప్లవధ్వజాలెత్తి, వీథుల్లో ప్రజాహృదయ వీథుల్లో విహరించడం మొదలు పెట్టాయి. బుద్ధిమంతులూ, ప్రగతిశీలురైన కవులు తమ కవితా గంధాన్ని పద్యపేటికలో భద్రపరచి ప్రజా బాహుళ్యానికి దూరంకావటం ఇష్టంలేక వారికి సులభానుభవయోగ్యమైన గేయ, వచన గేయప్రక్రియలలో, తత్కవితాపరిమళాలను వెదజల్లడం ప్రారంభించారు.

"దేశమును ప్రేమించుమన్నా
మంచి యన్నది పెంచుమన్నా"

అన్న గురజాడ అప్పారావు,

" ఏదేశమేగినా ఎందు కాలిడినా
ఏ పీఠమెక్కినా ఎవ్వరెదురైనా
పొగడరా నీతల్లి భూమి భారతిని "

అన్న రాయప్రోలు సుబ్బారావు,

" పదండి ముందుకు పదండి త్రోసుకు
పోదాం పోదాం పైపైకి "

అన్న, శ్రీ రంగం శ్రీనివాసరావు, రచనా శిల్పపరంగా కవితాభివ్యక్తిలో కావలసిన ఈ మార్పును గుర్తించినవారే. అందుకే వారు మహానుభావులైనారు. వైతాళికులైనారు. ఈ "రావుత్రయం" ఆధునిక తెలుగు కవితకు "కవిత్రయం" వంటివారు. వారి వారి భావనారీతులు ఎలా ఉన్నా కవితాభివ్యక్తిలో వారు అవలంబించిన నూతన మార్గాలు అ నాటి యువకవులను ఆకర్షించినవి. బీజాలుగా, మొక్కలుగానే నిలిచిపోయినగద్య (వచన) గేయకవిత, ప్రక్రియలకు ఆధునికత, పాశ్చాత్య సాహిత్య సంపర్కము కలిగిన ప్రతిభావంతులైన కవులు కొందరు జీవంపోసి పెంపుచేశారు. పునరుజ్జీవనం కలిగించారు. సృష్టి కాదు కాని ప్రతిసృష్టి చేశారు.

గేయం, వచనగేయం - ఈ రెండు ఆధునిక కవితాప్రక్రియలూ పద్యం

మీద దండెత్తి, తమ తమ స్వతంత్ర ప్రతిపత్తిని తెలుగు కవితా జగత్తులో కల్పించుకోవడం కోసం చేసిన ప్రయత్నంలో నేటికి విజయం సాధించాయనే చెప్పవచ్చు. అయితే వాడితే గాని పరిమళించని పూలవలె, పాడితే గాని రాణించని కవితలై పోతున్నవి గేయాలు. అందుకే పలికితేనే భావం ఒలికిపడే వచనగేయం వైపు గేయ కవులతోపాటు యువకవులందరూ తరలిపోతున్నారు ఇప్పుడు.

కవిత అనగానే వచన కవిత అనే స్థితి ఏర్పడింది. పద్యం వ్రాసినా గేయం వ్రాసినా, గద్యం వ్రాసినా కవులు ప్రజాభీష్టాన్నే గౌరవిస్తున్నారన్న సంగతి మరచిపోరాదు. ప్రజలు ఏది ఎక్కువ కోరితే అదే కవులు అందిస్తున్నారు. "ప్రజా" అనే వ్యక్తిరి నిర్వచనం మారుతున్నదేగాని కవులు ప్రజాభీష్టాను కూలంగా కవితా ప్రక్రియలను చేపడుతున్నారన్న సత్యంలో మార్పు లేదు. ఆధునిక ఆర్థికశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే 'కవితా డిమాండు'ను బట్టి "కవితా సప్లయి" జరుగుతున్నది. ఉత్పత్తి చేసిన కవిత చెల్లుబడి కావాలంటే కవులకు (ఇతర ఉత్పత్తి దారులకు వలెనే) గత్యంతరం లేదు. వచన కవిత సులభంగా అర్థమవుతుంది. అందుకే ప్రజలు దాన్ని ఆదరిస్తున్నారు. కవులకు ప్రజాదరణ కావాలి పర్యవసానంగా కవులు కవితను వచన రూపంలో అందిస్తున్నారు. ఇది యుగ ధర్మం.

అయితే, పరిశీలించవలసిన విషయం ఒకటి ఉంది. కవితా ప్రక్రియకూ కవితా గుణానికి ఏదైనా సంబంధం ఉందా? నన్నడిగితే లేదు – ఉండక్కర్లేదు. కవితా వస్తువుకు, కవితా గుణానికే సంబంధం లేనప్పుడు, ప్రక్రియ మీద కవితా గుణం ఆధారపడి ఉండటానికి వీలులేదు. వచన కవిత ఆధిపత్యం వహిస్తున్నా,పద్యగేయ ప్రక్రియల్లో కూడా బోలెడంత కవితం వెలువడుతున్న రోజులివి. అన్ని ప్రక్రియల్లోనూ వస్తు వైవిధ్యం కనిపిస్తున్నది. అయితే ప్రతి ప్రక్రియ కొన్ని కొన్ని భావాల అభివ్యక్తీకరణకు ఎక్కువ అనుకూల్యం కలిగి ఉంటుంది. ఏ ప్రక్రియలోనైనా కవితా వస్తువు స్థూలంగా మూడు రూపాలలో అవిష్కృతమౌతుంది. ప్రణయ భావసంచలనం, ప్రకృతి సౌందర్యారాధనం, సామాజిక జీవనవిశ్లేషణం, ఏవస్తుపరంగా ఏ ప్రక్రియాగతంగా వెలువడినా ఒక కవిత విలువ ఆ కవిత గుణాన్ని కవితా ప్రయోజనాన్ని బట్టి నిర్ణయించడం కద్దు. ఒక కవితలో వినూత్నమైన, సృజనాత్మకమై రసాత్మకమైన భావనాశబలత ఉన్నదా అన్న పరిశీలన కవితా గుణానికి సంబంధించినది. పోతే భావ స్పందనం వలన, కవితా దృష్టి వలన ఒక వ్యక్తికి గాని, సమాజానికి గానీ ఎలాంటి ఉపయోగం

కలుగుతున్నది అన్న వివేచన కవితా ప్రయోజనానికి సంబంధించినది. గుణం లేనప్పుడు ఒక రచన ఏ ప్రక్రియలో ఉన్నా, ఏ ప్రయోజనాన్ని ఉద్దేశించినా కవిత కాజాలదు.

భావుకుడైన కవి హృదయం ఈ లోకంలోని వస్తువులన్నిటిమీద ప్రసరించి చిత్రవిచిత్రమైన, భిన్న విభిన్నమైన స్పందనలకు, అనుభూతులకు లోనౌతుంది. నిజానికి ప్రతివ్యక్తి, ఈ దృష్టాదృష్ట వస్తుమయ సృష్టి వలన ప్రభావితుడై అనుభూతిని పొందుతున్నాడు. తదనుభూతికి అక్షరరూపం ఇవ్వడానికి ప్రయత్నం చేస్తున్నాడు. ఈ ప్రయత్నంలో సకల శాస్త్రాలు, విభిన్న, విజ్ఞాన శాఖలు ఆవిర్భవించినవి – వేదాలు, ఆర్థిక, రాజకీయ సిద్ధాంతాలు, భూగోళ శాస్త్రం, భౌతిక, రసాయనిక, వైద్య, వాస్తు, శాస్త్రాలవంటి వెన్నో బయలుదేరినవి. లోకవ్యవహారాన్నంతా ఇలా విజ్ఞానశాఖలుగా, శాస్త్ర విషయాలుగా పరిణామం చెందడానికి మూలం హేతువాదం, తార్కిక విధానం. అయితే సాహిత్యం ముఖ్యంగా కవిత్వం దృష్టాంత హేతుగత వైజ్ఞానిక దృష్టితో పాటు తద్భిన్నమైన ఊహానుభూతి గతి కాల్పనిక దృష్టిని ఆశ్రయించి సాగుతున్నది. అందుకే ఆయా వస్తువును కవి దర్శించి ప్రదర్శించే తీరు ఒక వైలక్షణ్యాన్ని , ప్రత్యేకతను సంతరించుకొంటున్నది. ఒక వస్తువులో కవి దర్శించే కాల్పనిక సత్యం, తదితరులు దర్శించే లౌకిక సత్యానికంటే భిన్నంగా ఉండి పాఠకుని హృదయానికి రసస్పందనం, చైతన్యానుభూతి కలిగిస్తుంది. ఈ కవితాత్మ రహస్యం తెలిసిన కవుల రచనలు ఏ ప్రక్రియిలో ఉన్నా కళాఖండాలై ఆకవుల అఖండకీర్తిని పండిస్తున్నవి. కేవల లౌకికదృష్టికే శబ్దచమత్కారం చేర్చి కవితాభాస కల్గిస్తున్న కవుల రచనలు తాత్కాలికంగా మిరిమిట్లు కొలిపే మిణుగురు పురుగులై పోతున్నవి.

"Poetry is the art of substantiating shadows and of lending existence to nothing" Edmund Burke.

The Poet has realised that he has his own way, which is neither scientific or philosophical of kowing the world" - Jaques Maritain.

"The office of poetry is not to make us think accurate but feel truely" - by F.M. Robertson.

పై మూడు నిర్వచనాలు కవితాతత్వానికి మూడు ముఖాలుగా అద్దంపడుతున్నవి. కవిత ఏ ప్రక్రియలో చెప్పినా కళాత్మకమైన అంతస్సత్య దర్శనం కలిగించాలి. అప్పుడే కవిత ఒక విలక్షణమైన, విశిష్టమైన విజ్ఞాన సంపదగా లోకానికి మిగులుతుంది.

కవిత, నాటికీ నేటికీ ఏ ప్రక్రియాముఖాన ప్రసరితమౌతున్నా ముఖ్యంగా మూడు ప్రయోజనాలను సాధిస్తున్నది. ధర్మ ప్రబోధం, మనోరంజనం, సాంఘిక ప్రగతి. ఒక్కొక్క ప్రయోజనం ఒక్కొక్క కాలంలో ప్రాధాన్యం వహించినా అన్ని ప్రయోజనాలు ఆశించే కవులు, పాఠకులు అన్ని కాలాల్లోనూ ఉంటారు. ఒకే వ్యక్తి అయినా మానసిక ప్రవృత్తి ననుసరించి అన్ని ప్రయోజనాలను సాహిత్యం నుంచి ఆశించవచ్చు. అయితే వైజ్ఞానిక సాంకేతిక, రాజకీయ, సామాజిక విషయాలు నేటి మానవజీవితాన్ని - తెలుగు ప్రజాజీవితాన్ని - క్షణం క్షణం ప్రభావిత చేసి పరిపాలిస్తున్నవి. ఇవి పద్యం గేయం వంటి ఛందో నియమాలకు కట్టుబడ్డ ప్రక్రియలకంటే వచన కవితకే ఎక్కువగా పట్టుబడతాయి. అందుకే వచనకవితకు నేడింత ప్రచారం కలిగింది. ఏ వస్తువును స్వీకరించియైనా, ఏ ప్రయోజనాన్ని ఆశించియైనా వచన కవిత వ్రాయటానికి వీలున్నా ప్రగతివాదం ప్రధానవస్తువుగా, సాంఘిక ప్రగతి ప్రయోజనంగా నేడు తెలుగుగడ్డమీద వచన కవిత పొంగి ప్రవహిస్తున్నది.

ఆధునిక భావచేతనను అభివ్యక్తం చేయడానికి సాధనంగా రూపొందుతున్న వచన కవితకు ఉన్న భవిష్యత్తు ఏమిటి? వచన కవిత నేటి యువకవుల్ని బాగా ఆకర్షిస్తున్నది. కారణం ఛందో నియమాలు లేకపోవడం - పద్యగేయ రచనకు కావలసిన పాండిత్యం, సాధన దీనికి అంతగా అవసరం లేకపోవటం. ఉన్నదున్నట్లుగా, తోచినది తోచినట్లుగా వ్యావహారిక భాషలో వ్రాయడానికి అనువైంది ఈ వచన కవితా ప్రక్రియ. వచనం వ్రాయగలిగి నంతకంటే సులభంగా వచన కవిత వ్రాసేస్తున్నారు చాలా మంది ఈ రోజుల్లో. పద్యగేయ ఛందస్సులతో కాని, తద్గతమైన కావ్యాలతో గాని ఏ మాత్రం పరిచయంలేని ఉత్సాహవంతులైన విద్యార్థులు, యువతీ యువకులు తమ ఆలోచనలను, ఆవేశాన్ని అభివ్యక్తం చేయటానికి ఈ ప్రక్రియను ఆశ్రయిస్తున్నారు. అందుకే అభిజ్ఞులూ విమర్శకులూ అయిన చాలా మందికి ఈ ప్రక్రియ పట్ల కొంత చులకన భావం కలుగుతున్నది. కవితాగుణం కవితా శిల్పం లోపించిన కవితలే ఎక్కువగా వెలువడుతున్నట్లగుపిస్తున్నది.

శిష్ట్లా, శ్రీ శ్రీ, ఆరుద్ర, తిలక్, కుందుర్తి, బోయి భీమన్న, దాశరథి, పఠాభి, నారాయణరెడ్డి, శేషేంద్రశర్మ, అరిపిరాల విశ్వం, నరసింహారెడ్డి, సుప్రసన్న, ఇస్మాయిల్, బాపురెడ్డి వంటి ప్రఖ్యాత కవులెందరో తమ తమ ప్రత్యేకతలను వచనకవితా సృష్టిలో ప్రదర్శించారు. శ్రీ కుందుర్తి ఆంజనేయులు ఈ కవితోద్యమానికి చేసిన కృషి ప్రశంసనీయం. ఈ కవితకు

పుష్టిని చేకూరుస్తున్న కవులలో చాలా మంది పద్యగేయ కవులుగా ప్రసిద్ధులైనవారే. సాంప్రదాయిక కవితా శిల్పాన్ని క్షుణ్ణంగా తెలుసుకున్న వాళ్ళే. అందువలన వచన కవితా పీఠాన్ని పటిష్ఠం చేసి దానికి ఉజ్జ్వల భవిష్యత్తును కల్పించదలచిన కవులు సంప్రదాయ ఛందశ్శిల్పాలను కూడా గ్రహించి పరిహరించవలసిన అవసరం ఎంతైనా ఉంది. వచన కవితకు కూడా సుందర శిల్పాన్ని సంతరించవలసిన అవసరం ఉన్నది. కావ్య ఖండికలతోపాటు కథా కావ్యాలు, నాటికలు, నాటకాలు కూడ ఈ ప్రక్రియలో అధికాధికంగా రచింపబడాలి. వచన కవితారచన చేసే కవులు చాలినంత ప్రతిభా పాండిత్యాలను సంపాదించి సముచిత సుందర శిల్పవేత్తలయినపుడే ఆ కవిత భవిష్యత్ తెలుగు కవితా సామ్రాజ్యాన్ని వైభవోపేతంగా పాలించే శక్తిని పుంజుకుంటుంది. 1935 నుండి క్రమ వికాసం చెందుతున్న ఈ ప్రక్రియ కవితా శిఖరాగ్రాలను చేరుకోగలుగుతుంది. అయితే మరొక నూతన ప్రక్రియ ఏదో ఆవిర్భవించి పద్య గేయ ప్రక్రియల వలెనే ఈ గద్య ప్రక్రియను గద్దె దింపే అవకాశం కూడా లేకపోలేదేమో.



# కవిగా కుందుర్తి

కుందుర్తి పూర్తిపేరు కుందుర్తి ఆంజనేయులు. నిజంగా ఆయన ఆంజనేయులే. చూచి రమ్మంటే కాల్చి వస్తాడు. సమాజంలోని కుళ్ళుకు నిప్పంటించే వీరాంజనేయుడాయన. ఆయన దాటలేని భావజలధులు లేవు. ఆయనకు జాడ తెలియని నవకవితా సీత లేదు. చూశారా, నన్నప్పుడే సంప్రదాయం పట్టుకున్నది. ఆంజనేయులు అనేమాట నా నోటినుండి జారగానే అసందర్భ రామాయణంలో పడ్డాను. ఇంతకూ, కవిగా కుందుర్తిని పరిచయం చేద్దామని కలం పట్టుకున్నాను. ఆయన వీర కవితావతారాన్ని చూచి కొంత జడుసుకొన్నాను. అయితే, అచ్చమైన ఒక ఆధునిక తెలుగు మహాకవిని గూర్చి ముచ్చటించే అవకాశం వచ్చినప్పుడు, దాన్ని జార విడుచుకోవటం విజ్ఞత కాదనుకున్నాను. అసంపూర్ణంగానే కావచ్చు, అయినా నాకు నచ్చిన, నా రసాత్మకు దర్శనమిచ్చిన అభ్యుదయ కవితాంజనేయుని అమృత మూర్తిని ఆవిష్కరించాలనే సాహసించాను.

ఆయన సమగ్ర రచనాద్యుతులు వెలిసిన "కుందుర్తి కృతులు", ఆయన సుందర కవితామూర్తికి అక్షర రూపం. "కుందుర్తి కృతులు", ఆధునిక తెలుగు కవితాజగత్తులో ఉప్పొంగిన చైతన్య సరిత్తులు. ఈ నవజీవన గంగాతరంగాలపై లీలగా తేలియాడే కుందుర్తిమూర్తి ఎలా ఉన్నది? ఆ భావనాభంగాలలో తడిసిన గుండెల అనుభూతి ఎట్టిది?

దాదాపు 1940 నుండి 1974 వరకు అంటే మూడు దశాబ్దాలకు పైగా మన దేశంలో సాగుతున్న 'చైతన్యవంతమైన ప్రజోద్యమాల'లో వెలుగుబావుటా పట్టుకొని, ముళ్ళ కిరీటం పెట్టుకొని పరుగెత్తే వీరయోధుడుగా కనిపిస్తాడు కుందుర్తి. సామాన్యుని జీవిత సమస్యల వెనుక, ప్రగతిని ప్రతిఘటించే సామాజిక వ్యవస్థ వెనుక దాగివున్న శక్తులను మాటల ఈటెలతో వేటాడే విప్లవవాదిగా భాసిస్తాడు కుందుర్తి. సామాజిక స్పృహ భవిష్యత్తుపై ప్రగాఢ విశ్వాసం ఆయన రచనల్లోని ప్రతి పదంలో ప్రతి పంక్తిలో ప్రజ్వలిస్తుంటాయి.

ప్రజలను ప్రేమించినవాడు, ప్రగతిని కామించినవాడు కుందుర్తి. ఆ ప్రేమను, ఆ కామనను ఎంతో నిర్భయంగా, కళాత్మకంగా, రసాత్మకంగా ప్రకటించే, ప్రతిపాదించే ప్రతిభా సంపన్నుడాయన. అందుచేతనే ఆయన భావుకత, కవితాభివ్యక్తి నిశితమైన అనుభూతిని రేకెత్తించి పాఠకుల్ని కదిలించి

వేస్తుంది. శక్తిమంతమైన శబ్దాలు, అలంకారాలు ఆయన భావ శరాలను సంధించి విడుస్తాయి. అందుకే అవి అంత సూటిగా ఏకధాటిగా తమ లక్ష్యాన్ని చేరుకుంటాయి.

లోకంలో ఇంతమంది కవితలల్లుతూ ఉంటే, ఏ కొద్దిమందో మాత్రమే ఎందుకు మహాకవులవుతున్నారని అప్పుడప్పుడు నేను ప్రశాంతంగా ఆలోచిస్తూ ఉంటాను. అప్పుడే నాదృష్టి ఈ కవితా రహస్యంలోకి దూసుకుపోతుంది. కవిత్వం అనిర్వచనీయం. అయినా అది అనుభవైకయోగ్యమైన వాస్తవం. ఇదీ అదీ అని చెప్పరాని కవితయొక్క తత్వం తెలుసుకున్న భావనా శిల్పి, రసానందతత్త్వవేత్త స్పృశించిన ప్రతి వస్తువులో నుంచి, అపూర్వ కావ్యరత్నాలు జాలువారుతున్నాయి. అలాంటి కలితా మర్మయోగి కుందుర్తి.

వస్తువులో నుంచి కాదు కవిత పుట్టేది. తద్వస్తుగతమైన కవిభావనా గర్భంనుంచి కవిత ఆవిర్భవిస్తున్నది. అందుకే అమ్మాయి గురించి వ్రాసిన వాళ్ళంతా భావకవులు కావటం లేదు, ఆకలి గురించి రచన చేసిన వాళ్ళందరూ అభ్యుదయ కవులూ కావటం లేదు. అమ్మాయి ముఖం చంద్రబింబంలా ఉన్నదన్న మొట్టమొదటివాడు కవైనాడు. తర్వాతివాళ్ళు కాపీయిస్టులైనారు. ఎడారిలో కాళ్ళు తెగిన ఒంటరి ఒంటెలాగుంది జాబిల్లి అని అన్నవాడు అమాంతం మహాకవి అయినాడు. మాట కొంచెం మార్చి నడుం విరిగిన గుర్రం లాగున్నదన్నవాడు కవిగా కూలిపోతాడు. అమ్మాయి ఉంటుంది; జాబిల్లి ఉంటుంది, ఆకలీ ఉంటుంది. సామాన్యుడు ఉంటాడు - అవి వస్తువులు. వాటిని గురించి కవి భావించే తీరు మారుతుంది. వాటిలో కవి దర్శించే సత్యం మారుతుంది. మామూలుగా కనిపించే సత్యంలోని సత్యం, కల్పిత సత్యం. కవితా సత్యం. కల్పన అంటే సత్యమైన సత్యకల్పన. ఆ దాగిన సత్యంలోనుంచి కవిత ఆవిష్కృతమౌతున్నది. అది ఏదో ఒక ప్రక్రియలోనే పుట్టదు. అది పద్యంలోనూ పుట్టవచ్చు, గేయంలోనూ పుట్టవచ్చు ఏ వచన గేయంలోనూ పుట్టవచ్చు.

ఈ రహస్యం తెలిసిప కవులను కవిత వరిస్తుంది. తెలుగుజాతి అదృష్టమా అని ఈ రహస్యాన్ని గ్రహించిన కొద్దిమంది ఆధునిక కవులలో కుందుర్తి ఒకరు. ప్రణయాన్ని, ప్రకృతిని ఇతరులకు వదిలిపెట్టి, ఆయన ప్రజాజీవితాన్ని ప్రగతి పథాన్ని కవితా వస్తువుగా ఎన్నుకున్నాడు. పద్యాన్ని, గేయాన్ని పాత స్నేహితులకు వదిలేసి వచనాన్ని లేక గద్యాన్ని నాగలిగా చేపట్టి తెలుగు

కవితాసీమల్లో బీళ్ళు దున్నేస్తున్నాడు. రాళ్ళలో రసాలు పండిస్తున్నాడు. బ్రతుకు చీకట్లలో క్రాంతి మాకందాలు నాటేస్తున్నాడు.

ప్రగతిశీలి, ప్రయోగశీలి కుందుర్తి. ఆయనకు తనదైన ఒక దృష్టి ఉంది. అందుకే తనదైన ఒక సృష్టి ఉంది. ఈ దృష్టి చీమలమీదపడ్డా, భామల మీద పడ్డా, పూలమీదపడ్డా, పురుగుల మీద పడ్డా ఆయన మహాకవే అయ్యేవాడు. అయితే ఆయన దృష్టి ప్రజలమీద, ప్రగతిమీద పడటం తెలుగుజాతి అదృష్టం. మానవతాశక్తుల సుకృతం. ఆయన రచన పద్యంలో సాగినా, గేయంలో సాగినా ఆయన ప్రతిష్ఠకు లోటుండేది కాదు. అయితే ప్రాచీన కావ్యాల్లో పద్యాల మధ్య నలిగి ఊడిగంచేసి అస్పృశ్యంగా ఉండిపోయిన గద్యం నోము పండి అది కుందుర్తి చేతిలో పడింది. తెలుగు సరస్వతి వీరవిహారానికి విప్లవానంద స్పందనం అయింది. నవజీవన ఋతువులుగా, నవోదయ దీధితులుగా కుందుర్తి కృతులుగా రూపించింది.

"కుందుర్తి కృతులు" పదునాలుగు కళాఖండాలుగా, ప్రజాశక్తి కోదండాలుగా విరిసినవి, వెలసినవి. "నయాగరా" మొదలు "శిక్ష ఏమిటి" వరకు సాగిన ఈ కవితా జైత్రయాత్రలో కవిగా కుందుర్తి దర్శించని జనతా సమస్యల సంతలు లేవు, బాధాగాథల అడవులు లేవు, ప్రశ్నలజడివానలు లేవు, చీకటి కోటలు లేవు, వెలుతురు బాటలు లేవు. ఆయన ఆలోచనలకు, ఆవేదనలకు అంతులేదు. ఆయన ఆశయాలకు, ఆదర్శాలకు విశ్రాంతి లేదు.

"వీచే పెనుగాలిలాగ
నాచేతి కలంలాగ
నవా నవా నవా నవా
నడచే విప్లవసైన్యం
జయిస్తుంది, జయిస్తుంది."

అనే ఆశాభావంతో నయాగరా జలపాతంగా నిత్యచైతన్య గీతాలు ఆలపిస్తున్నాడు కుందుర్తి. అయితే విప్లవ ప్రస్థానం ఒకనాటితో ముగిసేది కాదు. మానవ జీవితం విప్లవోన్ముఖి, ప్రగతిశీలి కాబట్టి సామాన్యుడు సారథిగా సాగే మార్పు రథం అడ్డంకులను ఎదురుకుంటూనే ఉంటుంది.

"హిమాలయం పెంచుకున్న శిఖరాలు
దక్షిణాన సేతువును దర్శించేలోగా"
'దేశ పటాన్ని కొరికిన'

"అయిదువందల సంస్థానాలు"

"పాలివ్వని పాడిబర్రెల్లాంటి రాచరికాలు"

లేకుండా చేసిన ప్రజా ఉద్యమాలలో ప్రాణంపోసినవి కుందుర్తి ఆర్తి గీతాలు. కాలం, చరిత్ర కలిసి ఆడిన నాటకంలో చెలగాటంలో నలిగిపోయిన సగటు మనుషులను ఓదార్చి, వారిని వెలుగు తీరాలకు చేర్చే బాటలు అన్వేషించే ప్రజాకవి కుందుర్తి.

"మత్తుగా ఆలోచించడం మొదలుపెడితే
మనకు త్రోవ కనిపించదు
ఎత్తుగా ఆలోచించడం నేర్చుకుంటే
ఏదీ సమస్యకాదు" అనే క్రాంతదర్శి ఆయన.

ఎత్తుగా, లోతుగా ఆలోచించి, సత్యామృతాన్ని సామాన్యునికి పంచే ప్రజ్ఞ, ఉపజ్ఞ కుందుర్తి కలానికి ఉన్నవి.

"నదులు అభిసారికలై పంటపొలాల్ని వెదుక్కుంటై"
"శాంతి రెండురకాలు - తన చుట్టు తాను తిరిగేది ఒకటి,
యుద్ధాలచుట్టు తిరిగేది రెండు"
"ప్రగతి పసిపాపను పురిటింట్లోపట్టి హత్యచేయాలని
ప్రయత్నం జరుగుతుందనీ"
"శోకాలబావిలో దూకింది సమాజం
తన నీడ తానే చూచి బెదిరింది సమాజం"
"భూమ్మీద పస్తులున్న మనుష్యుల్ని చూచి
ఆకాశం కంటతడి పెడుతున్నట్లు
వాన ముమ్మరంగా కురుస్తుంటే"

ఎంతో ఎత్తుగా ఆలోచిస్తేగాని భావగోచరం కాని సత్యాలివన్నీ. ప్రగతి కోర్టులో ప్రజావిజయవాది కుందుర్తి కవితచే చెప్పించిన సత్యాలివి. సానుభూతిచే ఇప్పించిన సాక్ష్యాలివి. ఇంచుమించు వేయిపుటలను ఇలాంటి అంతస్సత్యాలలో నింపివేశాడు కుందుర్తి.

'నగరంలో వాన' ఆయన కవితాజగత్తులో కురిపించిన నవరసాలసోన. ఎందరు కవులు లేరు, ఎన్ని నగరాలు లేవు, ఎన్ని వానలు కురియడం లేదు. అయితే హైదరాబాదు నగరంలో కురిసిన ఒక వానలో తడిసిన కుందుర్తి కవితా మూర్తి శివతాండవం చేసింది. ఆయన గుండెలో పడిన ఒక్కొక్క వర్షబిందువు

ఒక్కొక్క భావసింధువుగా ఉప్పొంగింది. ఆయన దృష్టి అనే ముత్యపుచిప్పలో పడినవి కాబట్టే ఆ అమాయికమైన వానచినుకులు అమూల్యమైన ఆణి ముత్యాలైనాయి.

"నగరంలో కురిసే వాన కు తెలుసు
గొడుగు, జీతపు రూకల్లో మిగిల్చి
కొనడం వట్టిమాటని
గోనెసంచి కప్పుకోవడం నాగరికులకు మోటని"
"చీకటి మాటికి కోర్టుకెక్కడం చీదరెత్తింది కాబోలు
హైకోర్టుభవనం మీద చింతతో చిందిన చినుకు
ప్రక్కనే ఉన్న మూసీనదిలో పడి ముక్కుమూసుకుంది"

ఇలా, కుందుర్తి వానచినుకుల పేరుతో అన్యాయాల ప్రేగులు తెగిపోయే, అసమానతడొక్కలు చెక్కలయ్యే వ్యంగ్యవైభవాన్ని కురిపిస్తాడు. కవిగా కుందుర్తి తనకుతాను చెప్పుకున్న మాటలు యువకవులకు వెలుగుబాటలు.

అచలాన్ని నేను కదిలిస్తాను
అందుకే ప్రతిసారి వజ్రంలా పదునెక్కిన పాట
అమృతాన్ని నేను కొనితెస్తాను అందుకే పక్షిలా ఎగిరే
స్వేచ్ఛా స్వాతంత్ర్యాల బాట"
"నిత్య జీవితంలో జరిగే సంఘర్షణలను
నిరాకరించలేదు నా కవిత"
"విశ్వాసాన్ని సంబోధించి మేల్కొలిపే బాధ్యత నాది
ఉషస్సు వెండితెరమీద ఉదయ సూర్యుని పాత్ర
విశ్వాసాన్ని సంబోధించి వెక్కిరించే తత్వం నాది
నేటి మీద భవిష్యత్తు చాటిన జైత్రయాత్ర"
"బ్రతుకు సముద్రం ఉప్పునీటి లోతుల్లో పర్యటిస్తాను
దొరికిన సత్యాల ముత్యాలు గీతాల గోతాలకెత్తిస్తాను
నవకవనం భవన నిర్మాణంలో కవులందరినీ పని చేయిస్తాను.
జగతి గుండెలోని మూగజీవాల సంగీతాలు పైకి తీస్తాను"

కుందుర్తి కవితామూర్తి సామాన్యుని సంక్షేమానికి కట్టుబడింది. ఆయన ఒక రాజకీయ వాదానికో ఏదో ఒక నినాదానికో దాసుడు కాడు. "ఆయా కాలాలలో ఏవీ కార్యక్రమాలు అమలు పరచటం ద్వారా నేటి నిర్జీవ సాంఘిక

వ్యవస్థను మార్చవలెనో తెల్పుకోవాల్సిన ప్రధాన బాధ్యత రాజకీయ వేత్తలది. వారు చేసే కృషికి దోహదకరంగా రచన చేస్తూ, అభిప్రాయలు ప్రకటిస్తూ వారిని విప్లవోన్ముఖులుగా తయారుచేయటం ఈ నాటి కవియొక్క బాధ్యత. స్థూలంగా ఇదీ నా దృష్టి" అంటాడు కుందుర్తి "ఇదీ నా దారి" అనే తన తొలిపలుకుల్లో. "ఇదీ నాదారి" నిజానికి తొలిపలుకులు కావు, కుందుర్తి కవితాత్మకు అద్దం పట్టిన అద్భుత కవితా ఖండికగా పేర్కొనవచ్చు. ఆయనను మానవ కళ్యాణం కోసం కృషి చేసిన మహనీయులందరూ ఆకర్షించారు, ఉత్తేజ పరిచారు. మార్క్సు వాదంలో ప్రగాఢ విశ్వాసం ఉన్నవాడైనా, నెహ్రూ, గాంధీ, టాగూరు వంటి మానవతా వాదుల పట్ల తనకున్న భక్తి విశ్వాసాలను సుందర కవితా దీపాంజలి పట్టి ప్రకటించాడు. తన గురువుగారైన విశ్వనాథ సత్యనారాయణ గారికి "విశ్వనాథ షష్టిపూర్తికి" కుందుర్తి సమర్పించిన ప్రశంసా శతపత్రము, ఆయన సహృదయతకు, హృదయ వైశాల్యతకు అక్షర సాక్ష్యము.

కన్నతల్లి కన్ను మూసినపుడు కుందుర్తిలో పొంగిన ఆవేదన తరంగాలు ఆలపించిన "మాతృగీతం" అమృత గీతం.

"నా గుండె నదిలో వచ్చిన వరదలా పొంగుతున్నది
నర నరాల్లో జీర్ణించిన నా మార్క్సిస్టు మధురోహలు
భారతీయ వేదాంత భావనకు లొంగిపోతున్నవి"

"అమ్మ" అనే అమృత భావనలో అందరూ పసిపిల్లలై పోతారు. అందుకే హిమాలయోన్నతమైన కుందుర్తి భావనా శిఖరాలు తల్లి ఒడిలో వ్రాలిపోయాయి.

"ఎందుకన్నావమ్మా నీ బంగారు కడుపున
ఇంత జాలి లేని మూర్ఖుణ్ణి
చలనం లేని స్థాణువును
ఎంత వూదినా పలకని
ఈ వెదురు బొంగు వేణువును"

అని తన ఆత్మ ఘోష వినిపిస్తాడు. ఇలా అనగలిగిన కొడుకును చూచి ఏ తల్లైనా మూర్ఖుడనుకోదు - వేదాంతి అనుకుంటుంది. స్థాణువు అనుకోదు - చైతన్య సింహం అనుకుంటుంది. ఆయన సుందర స్వప్నాలకు కడుతున్న అభ్యుదయ భావనా హర్మ్యాన్ని, ఆధునికతా సౌందర్యాన్ని మోస్తున్న తరతరాల భారతీయ సంస్కృతీ సంప్రదాయాల పునాదుల్ని ఒక్కసారి అలా తట్టి చూపిస్తాడు తన

మాతృగీతంలో. కుందుర్తి సాహిత్యం అంతా ఒక ఎత్తు – ఈ మాతృగీతం ఒక ఎత్తు.

కరువు వచ్చినా, వరద వచ్చినా, పండుగ వచ్చినా యుద్ధం వచ్చినా కుందుర్తి గుండెలో సామాన్యుడు గూడు కట్టుకుంటాడు. చరిత్ర ఆయన్ని పిలిచినట్లు ఉలిక్కిపడతాడు. వెలుగు తీరాలకు ప్రయాణం కడతాడు. "వృత్తాన్ని వదిలేసి మానవవృత్తాన్ని స్వీకరించా"డని, కవితను అల్లరి పెట్టాడని, "పండితుడు దోషజ్ఞుడు మాత్రమేనని వాదించా"డని, "పాఠకుడు రసజ్ఞుడని ప్రతిపాదించా"డని తన మీద తెచ్చిన "అభియోగాలను" లెక్క చేయకుండా తన దారిన తాను వెళ్ళిపోతుంటాడు. "సామాన్యుని దగ్గరి చుట్టాన్ని, సంప్రదాయపు చెరువు తెగ్గొట్టిన ప్రమాదపు నీటి మట్టాన్ని" అని స్వాభినందన చేసుకుంటాడు. "మేఘాల్ని కవ్విస్తాను" అంటూ ఏదో రసావేశంలో తేలిపోతాడు.

వచన కవితలో ఆశ, ఆచార్ల గారమ్మాయి, శిక్ష ఏమిటి వంటి నాటికలు సృష్టించి, భగవంతునికి బహిరంగలేఖలు వ్రాసి, వేకువ వెలుగుల్లో చీకటి లోకాలను స్నానమాడించి మార్పుకు స్వాగతం పట్టిన మహోజ్జ్వల జ్వాలగా భాసిస్తాడు కుందుర్తి. సృజనాత్మకతకు, మౌలికతకు తన కవితలలో కోటలు కట్టాడు. ఆయన కృతులు ఆశాద్యుతులు – భవిష్యత్ మానవాకృతులు.



# పీఠికా పీఠాధిపతి

"శ్రీ శ్రీ పుట్టి సాహిత్యాన్ని, ఘంటసాల పుట్టి సంగీతాన్ని నాశనం చేశారని నా ఉద్దేశం. యువతరాల కళారాధకుల పాలిటికి వారిద్దరూ పైడ్ పైపర్లు ( Pide Pipers ) అయినారు. వారి వ్యామోహంలో కుర్రవాళ్ళంతా తమ తమ వ్యక్తిత్వాలను, సృజన శక్తులను పోగొట్టుకొని కేవలం వారికి ఫోటో నమూనాలుగా తయారైనారు. సంగీత సాహిత్యాలు పట్టి రైలు పట్టాలై ఊరుకున్నై. సంగీతం జోలి మన కక్కరలేదు కాని, సాహిత్యం మాత్రం శ్రీ శ్రీ చేతుల్లో చావు దెబ్బ తిన్నది. అభ్యుదయ భంజకమైన ఇలాంటి హీరో వర్‌షిప్ (Hero worship) ఇంతవరకు ఎక్కడా ఉండలేదు. ఇదంతా నా పీఠికకు ఉపపీఠిక........"

"బాపురెడ్డి గద్యకావ్యాలు" పుస్తకానికి 1970 లో పీఠిక వ్రాస్తూ మహాకవి భీమన్న మనపై విసిరిన విప్లవ భావ బాంబు ఇది. కళా ప్రపూర్ణ బోయి భీమన్న గారు ఏ సభలో సమావేశంలో పాల్గొన్నా ఏదో సంచలనాత్మకమైన, వివాదాస్పదమైన అభిప్రాయం వెలిబుచ్చక ఉండలేరు. అలాగే ఆయన వ్రాసే ప్రతి గ్రంథంలో, ప్రతి రచనలో చివరకు గురు, లఘు పుస్తక పీఠికల్లో కూడా ఒక విలక్షణమైన విప్లవాత్మకమైన సత్యాన్ని అవిష్కరించక ఉండలేరు. సృజనాత్మకత, మౌలికత, అభ్యుదయ శీలతకు అలవాలమైన ఆయన అకుంఠిత లేఖిని పండించిన అద్వైత, రసాద్వైత, సత్యసంపద అపారమైనది.

పైన పేర్కొన్న పీఠికా పంక్తులు పండిత పామర లోకంలో ప్రబలమైన ప్రతిస్పందనం కలిగించాయి. 'మీ పుస్తకానికి భీమన్న గారు వ్రాసిన పీఠిక బ్రహ్మాండంగా ఉంది కాని, శ్రీ శ్రీ గురించి, ఘంటసాల గురించి ఆయన వెలిబుచ్చిన అభిప్రాయం బాగులేదేమో?' అని అనేక మంది మిత్రులు నాతో అంటూ వుంటారు. ఆ మాటలకు ఉన్న వాచ్యార్థాన్ని కాక వాటి వెనకాల ఉన్న సత్యాన్ని ఆవేదనను మీరు గ్రహించాలని చెపుతూ, ఆయనను సమర్థిస్తూ ఆ మాటలకు నేను వ్యాఖ్యానం చేస్తూ వుంటాను. కొంత వాద వివాదం తర్కం జరిగింతర్వాత పలువురు నాతో ఏకీభవించడం నేను గమనించాను. భీమన్న అభిప్రాయాన్ని అర్థం చేసుకోవడానికి ఆ వాక్యాలు, విపులమైన ఆ పీఠిక నేను పదే పదే చదివాను. వివాదస్పదమైన ఆ నాలుగు పంక్తుల్ని విడదీసి విమర్శించడం కంటే, ఆయన సంపూర్ణ సాహిత్య తత్వాన్నీ, ఆయన స్వేచ్ఛా జీవన వ్యక్తిత్వాన్నీ, సామాజిక స్పృహను దృష్టిలో ఉంచుకొని పరిశీలిస్తే

అందులోని ఉదాత్తత స్పష్టమవుతుంది.

పొగడడమే సాహిత్య విమర్శగా చలామణి అవుతున్న ఈ రోజుల్లో, అందరూ పొగడుతున్న శ్రీ శ్రీ, ఘంటసాల వంటి మహానుభావుల్ని 'తెగడడం' సాహసోపేతమైన కార్యం. నిజానికి ఈ 'తెగడడం' కూడ ఒక రకంగా వారిని 'పొగడడమే' అయిందనుకుంటాను.

" శ్రీ శ్రీ చేతుల్లో సాహిత్యం చావు దెబ్బ తిన్నది" - అన్నది ఒక వాక్యం కాదు. ఒక మహా కావ్యం. ఒక బృహత్తర పరిశోధనాంశం. ప్రతిభావంతులైన పట్టభద్రులు డాక్టరేట్లు పుచ్చుకోవడానికి వ్రాసే "సిద్ధాంత వ్యాసాలకు" కావలసినంత సరుకు అందులో ఉంది. డాక్టరేటు పుచ్చుకునే యోగ్యత నాకున్నట్టు లేదు కాబట్టి, ఆ పని నేను భవిష్యత్ సాహిత్య స్వరూప నిర్ణేతలైన నేటి యువసాహిత్య విద్యార్థులకు వదలివేస్తున్నాను. ఇంతకూ శ్రీ శ్రీ చేసిన నేరం ఏమిటి? భీమన్న చేసిన ప్రకటనలోని అంతరార్థమేమిటి? తీపి మాటలు వల్లిస్తూ జేజేలు కొట్టించుకొనే ఈ కాలంలో చేదు మాటలు చెపుతూ భీమన్న ఎందుకు నింద పాలౌతున్నాడు?

సాహిత్యం, సంగీతం సృజనాత్మకమైన కళలు.. అవి ఒకరితో పుట్టి ఒకరితో చచ్చేవి కావు - కాకూడదు. భీమన్నగారన్నట్లు ప్రస్తుతానికి సంగీతం మాట వదిలేసి, సాహిత్యం సంగతి చూద్దాం. సాహిత్యమంటే మనకు తెలుగు సాహిత్యం. ఇతర సాహిత్యాల్లో కూడా శ్రీ శ్రీలు పుట్టి ఆయా సాహిత్యాలకు ఏ విధంగా హాని చేశారో ఇప్పుడు మనకు అప్రస్తుతం.

20 వశతాబ్దంలో ఒక అపూర్వమైన సాహిత్య చైతన్యం తెలుగుదేశంలో కలిగింది. భాషా విషయంలో, భావనాసరళిలో విప్లవాత్మకమైన పరిణామాలు వచ్చాయి. వ్యావహారిక భాష వ్రేళ్ళు తన్నుకొని ప్రజాగళాలలో, రచయితల కలాలలో విజయ దుందుభులు మ్రోగించింది. గ్రాంథిక భాషావాదం తలవంచుక తరలి పోయింది. భాషా విప్లవానికి తోడుగా భావ విప్లవం కూడ తెలుగు గడ్డ మీద వీర విహారం చేసింది. పురాణేతిహాసాల నుంచి, ప్రబంధాలనుంచి మాత్రమే స్పందనం పొంది సాహిత్య ప్రతిమలు సృష్టించే శతాబ్దాల భావదాస్యం పోయి, స్వతంత్రంగా ఆలోచించి, సత్యాన్వేషణ చేసి, సరిక్రొత్త అనుభూతులను పొంది, సరసభావకావ్యాలు వ్రాసే సాహిత్య చైతన్యం తలెత్తింది. నాయకుడు ఉంటేనేగాని నడవలేని మన దాస్య బుద్ధి దీనికి ఎవడు నాయకుడు అని వెతకడం ప్రారంభించింది. ఎవరి రచనకు ప్రచారం కలిగితే, ఎవరి పేరిట భజనమండలి

ఏర్పడితే వాడే నాయకుడనే ధోరణి రచయిత్ర సామాన్యంలో బయల్దేరింది. అప్పారావు గొప్పవాడంటే, కాదు కాదు సుబ్బారావని, కృష్ణశాస్త్రి భావకవినేత అంటే శ్రీ శ్రీ అభ్యుదయ కవితాధినేత అని వర్గీకరణం చేసి ముఠా నాయకుల్ని, ఎన్నుకోవడం, జరిగింది. వెల్లువలా ఉప్పొంగిన యువ చైతన్యానికి, సృజనాత్మక, ప్రయోగాత్మక శక్తికి ఈ వర్గ నాయకులు అవరోధం కలిగించారు.

అయితే తప్పు ఈ "పరమానందయ్య" లదా లేక వారి శిష్యులదా అన్నది వేరు విషయం. "పెద్దనవలె కవిత చెపితేనే పెద్దనవలె హాస్యోక్తి", ఒక భావ కవిశేఖరుని వలె వ్రాస్తేనే, మరొక అభ్యుదయ కవిశ్రీ వలెనే గీస్తేనే కవుల మౌతాం అనే అధికారోక్తి అయింది. క్షీణయుగం కంటె హీనమైన గొర్రెదాటు కవిత్వ స్థితి ఏర్పడింది. మార్క్స్ చెప్పిన సిద్ధాంతాలను, సాహిత్యంలో, కవిత్వంలో ప్రతిధ్వనింప చేస్తేనే అది ప్రజాకవిత్వం అవుతుందనే ఒక రాజకీయ సాహిత్య వాదానికి బలం చేకూరింది. ఎలా వ్రాస్తే కవిత్వమౌతుందో కాక, "ఏమి వ్రాస్తే అవుతుందో" అనే "ఇతివృత్తవాదం" బయల్దేరింది.

"గర్జించు రష్యా, గాండ్రించు రష్యా" తో ఎలుగెత్తిన శ్రీ శ్రీ అభ్యుదయ కవిత్వ నాదం అందరిని ఆకర్షించింది. సామాన్య మానవేతివృత్తం 'మహా ప్రస్థానం' సాగించడంతో అందరూ మైమరచి, తమ స్వంత ఆలోచనలను, అనుభూతులను మూటకట్టేసి, దశ దిశలు శోభించవలసిన యువ సాహితీ యాత్రికులు పైడు పైపరు వెంటలాగా శ్రీ శ్రీ వెంట పడ్డారు. ధ్వని లేని ప్రతి ధ్వనులైనాయి వారి గొంతుకలు. అభ్యుదయ కవిత్వం అంటే శ్రీ శ్రీని అనుకరించడమే అన్నంత భ్రాంతిలో పడ్డారు పాపం పసివారు. ఈ దయనీయ స్థితికి కారణభూతత్వం శ్రీ శ్రీకి ఆపాదించాడే కాని భీమన్న ఆయన ప్రతిభాశక్తిని శంకించలేదు. నిజానికి భీమన్న ఆగ్రహావేదన శ్రీ శ్రీ మాయలో చిక్కి తమలోని ఉదయమాన 'కవితాశక్తి శ్రీ' ని పోగొట్టుకుంటున్నారే పైకి రావలసిన కుర్రవాళ్లు అన్నదే.

శ్రీ శ్రీ సాంప్రదాయాన్ని బాగా ఆకళింపు చేసుకొని, పూర్వాపరాలు అర్థం చేసుకొని మార్క్సిస్టు సామ్యవాద విప్లవానికి దోహదం చేసే భావ సృష్టికి పూనుకున్నాడు. కవిత 'మార్క్సిస్టు' సిద్ధాంతంలో అంతర్గతమైన నవభావ సృష్టిలో ఆవిర్భవించింది. అనుభూతి సత్యాన్వేషియై నూతన భావసృష్టి చేయగల్గిన కవి, కూలివాణ్ణి గురించి వ్రాసినా కుటుంబ నియంత్రణం గురించి వ్రాసినా దేశకాలాతీతమైన దివ్య కవిత్వమే అవుతుంది. కవితా తత్వాన్నీ,

సాహిత్య, తత్వాన్నీ, రసతత్వాన్నీ, ప్రగతి తత్వాన్ని అధ్యయనం చేయటం అటుంచి, కనీసం అర్థం చేసుకోవడం మానేసి యువకులు శ్రీ శ్రీని గుడ్డిగా అనుకరించడమే పరమ లక్ష్యంగా పెట్టుకోవడం సజీవమైన సాహిత్యానికి "చావుదెబ్బ" అని భీమన్న అభిప్రాయం. గర్జించడం, గాండ్రించడం కవితకు నేర్పిన శ్రీ శ్రీని అనుకరించబోయి అరవడం, మొరగడం మొదలు పెట్టారు. అనేకమంది యువకవులు – అంతేకాక కళాత్మకత,భావుకత ఉన్న 'భావకవులను' భయపెట్టడం, తరిమి కొట్టడం మొదలు పెట్టారు. కోకిలలు కావలసిన వారిని పట్టి కాకుల్ని చేశాడే శ్రీ శ్రీ అని అభ్యుదయ వసంతా రామ భీముడు పడ్డ ఆవేదనను సహృదయులు అర్థం చేసుకోలేరా? శ్రీ శ్రీ అభ్యుదయ శీలాన్ని కాదు భీమన్న నిరసించింది; ఆయన పరంగా స్వశక్తిని కోల్పోయిన యువకవుల చేతుల్లో నిర్జీవమౌతున్న తెలుగు సాహిత్యాన్ని చూచి ఆయన వాపోతున్నారు.

అభ్యుదయ తత్వాన్ని దురన్వయం చేసి నవరసభరితం, సత్యచైతన్య ద్వారం కావసిన తెలుగు సాహిత్యాన్ని నినాద రాజకీయవాద సాధనం చేయడం దురదృష్టకరం అని భీమన్న విచారం. ఆలోచన మానేసి, అనుభూతిని వెలివేసి అభ్యుదయ వాదం పేరుతో శ్రీ శ్రీ చేలాంచల పట్టుకొని ఊగులాడే జడభరతులను చూచి భీమన్న జాలిపడ్డాడే కాని, నిజానికి శ్రీ శ్రీని నిందించటం కాదు. శిష్యకోటి పట్టుకులాగే కండువాను వారికే వదిలేసి తన దారిని తాను తప్పించుకుపోయిన సాహిత్య ప్రస్థానం శ్రీ శ్రీది. మరి ఆయన చేతిలో సాహిత్యం చావు దెబ్బ తిన్నది అంటే భీమన్నను మనం అభినందించాలి కదా! అభిశంసించకూడదు కదా! సృష్టించే శక్తిని పెంచుకోవలసిన యువరచయితలను 'స్తుతించే' స్థితిలో పడగొట్టడం శ్రీ శ్రీ దోషం – నేరం – వేల వేల మామిడి గున్నలకు ఆశ్రయమిచ్చి నట్టే ఇచ్చి, తన నీడలో వాటిని మోడులు చేసిన వటవృక్షం శ్రీ శ్రీ. మానవుని నిసర్గమైన సృజనాత్మక శక్తిని, ప్రత్యక్షంగానో పరోక్షంగానో అణచివేసే ఏ వాదమైనా, ఏ వేదమైనా గర్హనీయమే. తెలుసుకో, అన్వేషించు; నూతన సత్యాలను దర్శించు, మారుతున్న మానవ జీవిత సమస్యలను పరిష్కరించు అని ఆత్మవిశ్వాసాన్ని, మనిషే దేవుడనే మానవతావాదాన్ని ప్రబోధించవలసిన మహనీయులు "ఇదే మనకు ప్రమాణం" "ఇతడే సర్వజ్ఞుడు" అనే భ్రాంతి కల్గించడం విజ్ఞాన విద్రోహం.

భీమన్న వ్రాసిన నాలుగు మాటల్లో నాలుగు వేదాలసారం ఇమిడి వున్నది. మన సాహిత్యలోక వికాసానికి ఒక ఉజ్జ్వల సందేశం ఉన్నది.

నేటి యువతరం స్వతంత్రంగా ఆలోచించి 'అహం బ్రహ్మోస్మి' అన్న ఆత్మ విశ్వాసంతో ముందుకుపోవాలి. వేదంతో ఆత్మజ్ఞానం ఆగిపోయినా అయిన్‌స్టీన్‌తో పదార్థజ్ఞానం నిలిచిపోయినా, త్యాగరాజుతో సంగీతం, భోజరాజుతో సాహిత్యం పరాకాష్ఠ అందుకున్నదన్నా అది అభ్యుదయకరం కాదు. అట్లాగే శ్రీ శ్రీ చేతుల్లో చావు దెబ్బ తిన్న ఆధునిక తెలుగు కవితా విహంగం, మళ్ళీ రెక్కలార్చి అభ్యుదయానంద నక్షత్రమండలంలో విహరించాలనీ, ప్రతి కవీ ఒక నూతన ప్రజామండలం కావాలని ఆకాంక్షించే భీమన్న అమృత వాక్కులు ఒక్క తెలుగు సాహిత్య వికాసానికే కాదు, విశ్వ సాహిత్య భవిష్యద్దీప్తికి ఆశీఃకిరణాలు కావాలని ఆకాంక్షిస్తున్నాను. సంపూర్ణ సాహిత్యమూర్తిగా, సరససరసజ్ఞ తెలుగు ప్రజాహృదయ పీఠంపై సన్మాన సౌరభోపేతుడై అభ్యుదయ భావ వసంతుడు, పద్మశ్రీ, అఖిల జనాభిమాన పద్మశ్రీ విరాజితుడు, కళా ప్రపూర్ణుడు బోయి భీమన్నగారు అమృత సాహిత్యోత్సవం జరుపుకొంటున్న శుభ సందర్భంలో అభినందిస్తున్నాను - ప్రేమాంజలి ఘటిస్తున్నాను. నేనొకపుడు పీఠికా పీఠాధిపతిగా అభివర్ణించిన భీమన్న గారు త్వరలో జ్ఞానపీఠ గౌరవాన్ని, నోబెల్ బహుమాన పీఠ ప్రాభవాన్ని అందుకొని తెలుగు సాహిత్య సరసప్వతికి విశ్వజనగణ జయహేల సమకూర్చగలరని ఆశిస్తున్నాను.

(కళా ప్రపూర్ణ, పద్మ శ్రీ, బోయి భీమన్న
షష్టి పూర్తి సందర్భంలో వ్రాసింది - 1971)



# కవిత చిరునామా – సినారె అన్వేషణ

( డా. సి. నారాయణరెడ్డి సాహిత్య సమాలోచన సదస్సులో చదివిన వ్యాసం )

తెలుగునాట ఇంటింటా వినిపించిన డా॥ సి. నారాయణరెడ్డి పేరు నేడు భారత భారతి నోట వినిపిస్తూంది. తెలుగుతల్లి తీయతేనియ పోసి పెంచిన ఈ వెలుగు శిశువు నేటికి విశ్వంభర సాహిత్య వేదికమీద విజయశంఖం పూరిస్తున్నాడు. హనుమాజిపేటలోని రైతు దంపతులు బుచ్చమ్మ – మల్లారెడ్డి వలపువాటిలో మట్టిబొమ్మగా పుట్టిన బుడుతడు, కవిత్వధర్మదీక్షాపరుడై, విజ్ఞాన ప్రజ్ఞాన గజవదనుడై కవిగణపతిగా ఎదిగినాడు. శబ్ద, భావ,రాగ శిల్ప శైలీ విలాసాలన్నీ తనవే అనిపించుకున్న సినారె స్థిర విలాసము "కవిత" యే అయిపోవడం సాహిత్య జగత్తు అదృష్టం. "కవిత నా చిరునామా" అని చాటగలిగిన ఈనాటిమేటి మహాకవి సినారె ఒక్కడే. అయితే, నారాయణరెడ్డి చిరునామా కవితయా లేక కవిత చిరునామాయే నారాయణరెడ్డి గారా అన్న విచికిత్స కూడా సరససాహిత్యాత్ములకు కలగడం సంతోషదాయకం. ప్రతిష్ఠాత్మకమైన భారతీయ జ్ఞాన పీఠ పురస్కారాన్ని అందుకున్న సందర్భంలో నిరంతర సాహిత్య తపస్వి నారాయణరెడ్డి "సాహిత్య సమాలోచన సదస్సు" నిర్వహిస్తున్న ఆంధ్రసారస్వత పరిషత్తు వారినీ ముఖ్యంగా పరిషత్తుకు ప్రాణప్రదమైన శ్రీదేవులపల్లి రామానుజరావు గారినీ హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఈ పవిత్ర సాహిత్య యజ్ఞంలో నన్ను కూడా పాల్గొనవలసిందిగా ఆజ్ఞాపించినందుకు వారికి నా కృతజ్ఞతలు. " కవిత నా చిరునామా" అని ప్రకటించిన నారాయణరెడ్డి గారి కవితాన్వేషణ గురించి నాకు తోచిన నాలుగు మాటలు చెప్పాలనుకుంటున్నాను.

"నవ్వనిపువ్వు"ల పాటతో ప్రారంభించిన నారాయణరెడ్డి కవితాయాత్ర నాలుగు దశాబ్దాలుగా సాగుతున్నది. గేయాలు, గేయ నాటికలు, పద్యాలు, పాటలు, వచనకవితలు, కథా కావ్యాలు, విమర్శవ్యాసాలు, పరిశోధన గ్రంథాలు, తెలుగుగజళ్లు, మొదలైన సమస్త సృజనాత్మక ప్రబోధాత్మక సాహిత్య ప్రక్రియలన్నింటిలో తన ప్రత్యేకతను నిలుపుకుంటున్న ప్రయోగశీలి ప్రతిభాశాలి ఆయన.

" కనులందు వెలుగురేఖలు చిందుతారకలు
నాదారి చూపుకన్నావ లేనా డౌనా
చదలేటి బంగారు సైకతస్థలులు

నాలోని నాదప్రకృతి
నవనవంగా చేస్తున్నది జ్వాలా తపస్సు
వ్రేలుస్తున్నది
వేలా తీత కవితా హేలా హవిస్సు"

**(తేజస్సు నా తపస్సు – 1975)**

అంటారాయన. నారాయణరెడ్డి గారి కవితాత్మ విశ్వాసం ఘోషించే సత్యసౌందర్యనాదం ఇది. "The office of the poetry is not to make us think accurately but feel truely" అంటాడు దివ్యజ్ఞాని F.W. Robertson (1816-53) సత్యస్ఫూర్తి కల్పించడమే సాహిత్య పరమార్థం. మనిషిని మహోన్నత శిఖరాలవైపు నడిపిస్తూ, మనిషి స్వప్నాలను మనోజ్ఞ సత్యాలుగా రచిస్తూ కాలశక్తిని శాసించగలదు కవితాశక్తి. సినారె కవితాశక్తి మానవత్వాన్ని, రసానందతత్వాన్ని రెక్కలుగా తొడుక్కొని అన్వేషిస్తున్నది జీవితాన్ని. ఎక్కడ సత్యాన్వేషణ ఉన్నదో అక్కడ కవిత సాక్షత్కరిస్తుంటుంది. ఎక్కడ కవిత రూపం దీపిస్తున్నదో అక్కడ నారాయణరెడ్డి వాణి వినిపిస్తూంటుంది. ఎక్కడ నారాయణరెడ్డి భావహేలాహవిస్సు ఉన్నదో అక్కడ కవితశ్రీనివాసం ఉంటుంది. అందుకే కవితామతల్లి సుందరదరహాసం నారాయణరెడ్డి స్థిరవిలాసం. "కవిత నా చిరునామ" అని సినారె చెప్పుకోవడానికీ మనమంతా ఒప్పుకోవడానికి కారణం ఇది. ఫ్రెంచి మహాకవి Alphones de Lamartine (1790-1869) అంటాడు – "Sad is his lot, who, once atleast in his life has not been a poet". అంటే, తన జీవితకాలంలో కనీసం ఒక్కసారైనా కవికాలేని వాని గతి దయనీయమైంది. మరి కవితే తానుగా తానే కవితగా తాదాత్మ్యం చెందే రసతపస్వి మహాకవి పద్మశ్రీ, జ్ఞానపీఠ గౌరవనీయుడు ఆచార్య నారాయణరెడ్డి ఎంతటి ధన్యుడో చెప్పనవసరము లేదు. తన చుట్టు తాను తిరుగుతూ, భూగోళం సూర్యుని చుట్టూ తిరుగుతున్నట్లే, కవి తనను తాను అన్వేషిస్తూ సకల సృష్టి రహస్యాలను సంశోధిస్తుంటాడు. మనిషి విలువల్ని విశ్వాసాలను మార్చగలిగే మంత్రశక్తి ప్రదర్శిస్తాడు. కనుకనే నారాయణరెడ్డికి "నాదరోదసి నినదించే నిషాదం" వినిపిస్తుంది. జడలకట్టిన అరణ్యాలను అడుగులే ప్రశ్నలై అడుగుతున్నట్లు స్ఫురిస్తుంది. ఆయన నదుల్ని పెరట్లో కట్టేసి పాడి ఆవుల్ని చేయగలడు. "అలల నురుగుల మీద అచ్చవుతున్న అక్షరాలను" చూడగలడు. ఆయన శ్వాసకోశాలు శబ్ద కోశాలు. ఆయన హృదయ స్పందనం భావపుష్పనందనం. ఆయన వాక్కుల్లో బుక్కులు మొలుస్తాయి –

నా పదముద్రలను దాచు పటములేనాడౌనో "

(నారాయణ రెడ్డి గేయాలు – 1955)

అంటూ తొలి అడుగువేశాడు. "రేపటి ఉదయం నాలో లోపల గుసగుసలాడెను, మనిషీ నీ భవిష్యత్తు మహోజ్వలంగా ఉందని" ఆనాడే అన్నాడాయన. అభ్యుదయోన్ముఖుడై సాగిపోతూ" మల్లికవలె మాట్లాడే మానవమిత్రుని కోసం" గవేషణ ప్రారంభించాడు. నింగినీ నేలనూ ఏకసూత్రంలో కూర్చిన అపూర్వ కవితాయాత్ర అది. ఋతుచక్రం వలె ఆయన జీవితచక్రం సాగిపోయిన సత్యాన్వేషణ అది. నిలకడ లేని నిరంతరాన్వేషణలో ఉన్నవారికి ఒక ఇల్లూ వాకిలీ ఉండదు. తా మున్న చోటే తమ 'చిరునామా'గా వెలుగుతుంటారు. అందుకే "తేజస్సు నా తపస్సు" అని గ్రహించిన సింగిరెడ్డి నారాయణరెడ్డి అసలు " ఇంటి పేరు చైతన్యం" అని, ఆయన " కంఠమే పాంచజన్య మని .....మారుమ్రోగింది. అభినవ మహర్నాదం " అప్పుడు ఆయన గుండె, నిర్లిప్త చైతన్యమే ఇల్లుగా – వేనోళ్లుగా " ఘోషించింది –

"నా కంటి వెలుగు
ఎన్నో కోట్ల ఉదయాల ఉదయాలకే పురుడు పోసింది
నా శ్వాస, అలనాడే
విశంభరా వధూ పదములకు పారాణి పూసింది.
నావాణి, ఎపుడో
పదునాల్గు భువనాల కంఠాలు శ్రుతి చేసింది
నా రసన
శుష్క హృదయులకే సుధాద్వారాలు తెరిచింది
నా స్పర్శ, చిత్రాల్ల నవనాడులను మీటి
సృష్టికి రసానంద దృష్టి నిచ్చింది "

(ఇంటి పేరు చైతన్యం – 1976)

అందుకే తన పంచేంద్రియాలు ఎప్పుడూ రగిలే ఇంధనాలై ఏవిధంగా నూతన దృష్టికీ, నూతన సృష్టికి దోహదం చేశాయో గుర్తించగలిగిన తేజస్వీ డా. నారాయణరెడ్డి. ప్రకృతి శక్తులకు బాసటగా రుపొందే జ్వలిత చేత నానుభూతులను ఆవిష్కరించే అక్షరతపస్వి ఆయన. ఆయన భావుకత అందుకోలేని అంతరిక్షాలు లేవు. ఆయన వాణి శ్రుతిచేయలేని అంతరంగాలు లేవు.

"శిశిరాన్ని రేపటి వసంతానికి చేగంటగా సమకూర్చుకొని

దృక్కుల్లో అలంకారాలు వెలుస్తాయి. "నడకనుంచి రోదసీ నౌక దాక ప్రస్థానం" సాగించే ఆయన కాంతి రథానికి కేతనం కవిత్వతత్వ చేతనం.

విశ్వవిఖ్యాత ఆంగ్లకవి, విమర్శకుడు Samuel Taylor Coleridge - (1972-1834) అంటాడు.

"Poetry has been to me its own exceeding great reward: it had given me the habit of wishing to discover the good and beautiful in all that meets and surrounds me". సినారె సత్యకవితాన్వేషణం కూడా, శివశంకరమైన సౌందర్యదర్శనం కోసమే తన జీవితానుభూతులను అఖిల మానవ ప్రగతిగీతులుగా ఆలపించడం కోసమే. అందుకే " ఆదిమదశనుంచీ ఆధునిక దశ వరకు మనిషి చేసిన ప్రస్థానాలు" అన్నీ తన 'విశంభర' వీణాశ్రుతులలో పలికించి పులకించాడు. "ప్రకృతిలోని చలనశీలానికి పరిణామం మనిషి, జగతిలోని భ్రమణ గుణానికి ప్రతిరూపం మనిషి" (విశ్వంభర - 1980) అంటూ ప్రగతి తత్వాన్ని పరిమళీకరించాడు. మనిషికోసం తపిస్తాడు. మారణశక్తుల్ని శపిస్తాడు. రాక్షసత్వంపై విజృంభిస్తాడు. రాగోదయాలను ఆహ్వానిస్తాడు. "కవిత నా చిరునామా" అని తన కావ్యస్వామ్యాన్ని ప్రకటిస్తాడు.

1988లో వెలువడ్డ "కవిత నా చిరునామా"లో 75 కవితలున్నాయి. ఇవన్నీ డా॥ నాయణరెడ్డి గారు మూడు సంవత్సరాలు (1986 -88) వివిధ పత్రికల్లో ప్రచురించినవి. వీటిని ఒక క్రమంలో కూర్చి తీర్చిన వారు ప్రముఖ కవి ప్రసిద్ధ పరిశోధకుడు డా॥ ఎన్. గోపీ గారు. ఈ కవితలన్నీ సినారె పరిపూర్ణ భావుకతకు ప్రతీకలే - కాలం కంటిలో విరిసిన మానవకల్యాణ కాంతిరేఖలే "అడుసు ప్రక్కలో వెల్లకిలా పడుకొని ఆకాశాన్ని పిల్చుకుంటున్న" వీధి గురించి నారాయణరెడ్డి చేసిన ఆవేదన భాష్యం ఆధునిక కవిత్వచరిత్రలోనే మొలకెత్తిన ఒక మహాభ్యుదయోపనిషత్తు. ప్రతిరోజు మనం చూస్తున్న వీధిలో విహరించే నవనాగరిక మానవునికి కూడా గగుర్పాటు కలిగిస్తాయి. కవితకున్న అనంత కళాశక్తిని ఆవిష్కరిస్తాయి.

" గుడిసె ఒరలో పదను పెట్టుకుంటున్న
ఖడ్గ స్వప్నం వీధి......
గజ్జికుక్క మూల్గులను గడప గడపకు
ప్రసారం చేస్తుంది వీధి
వీగే నేస్తం - వీధి అభయహస్తం
ఆకలేస్తే వీధి దోసిలి - ఆగ్రహిస్తే వీధి పిడికిలి".....

" వీధిని నడుముకు చుట్టుకొని నడుపు
వెయ్యి వోల్టుల వేడిపుడుతుంది
వీధిని గొంతులో తొడుక్కొని అరుపు
విశ్వాసమే నీ వెంట పడుతుంది." – అంటాడు. నగర వీధికి గగనవీధికి నడుమ చెలిమికలిమి వెదజల్లే సినారె. అలాగే ఆయన మెట్లు మెట్లుగా పరచిన మరొక మేటి కవిత "సొక్షులు" – నింగిని నేల మీద దింపడానికి ఆయన నిర్మించిన అమృత సోపాన పంక్తులు. ఋషిత్వం, ప్రగతితత్వం, తన భాషగా మలచుకొన్న త్రికరణ శుద్ధి వ్యాకరణమే సూత్రీకరించగల ఈ కవితా సత్యాలను చూడండి:

"మెట్లు అలసిపోవు
ఎక్కేదిగే అడుగులు అలసిపోతాయి
మెట్లు సహనానికి గీట్లు.........
ఆరో ఇంద్రియమున్నట్లు అప్పుడప్పుడు పసికడతాయి పడే అడుగుల పరమకోటిల్యాన్ని –
మట్టివ్రేళ్ళల్లో కట్టుకున్న మెట్లు చెట్టుకు ఆరోహణలు ఆకాశం ఊడకు కట్టుకున్న మెట్లు మబ్బుకు అవరోహణలు" ఎన్ని మెట్లెక్కితే ఎన్ని కాంతిగోళాలను చెక్కితే ఇలాంటి శుభంకర కవితేశ్వరి సాక్షాత్కారమవుతుందో మీరే ఊహించుకోగలరు. నారాయణరెడ్డి గారి ఆలోచనాలోచనాల ఆవేశాన్వేషణలో లభించిన నవరత్న పీఠాలు ఆయన కవితా సంపుటాలు. అందుకే తాను "యుగ యుగాలుగా చీకట్ల మెట్లెక్కుతున్న ఊర్ధ్వకవజీవిని" అంటాడు. "ఎక్కడమే తప్ప దిగడం ఎరుగని నిత్యారోహిని " అంటాడు. "ఆలోచనల గొడ్డళ్ళు శిరసులోని నరాలను నరుకుతుంటే నిటారుగా చిమ్మిన రక్తాన్ని నేను" అంటాడు. అనడమే కాదు. ఆయన అక్షరాలా చేసిన భావప్రకటనల మీద సాక్షాత్ సరస్వతీదేవితోనే సాక్షి సంతకాలు చేయించుకుంటాడు. "నేను నడుస్తాను నిశీధి ముళ్ళ కంపల మీద నెత్తురు సంతకాలు చేసుకుంటూ" అని ఆయన చేసిన అరుణారుణ సంతకాలు రమ్యాక్షర శోభితాలు, త్రికాల ప్రామాణికాలు.

"సృష్టికుంది ఎవరో చేసిన సంతకం
దృష్టికుంది కనులు చేసిన సంతకం
చెవికుంది శ్రుతిచేసిన సంతకం
చవికుంది మతిచేసిన సంతకం"

( ఇంటి పేరు చైతన్యం )

అంటూ నిగూఢవ్రాతలనూ, జాతకాల గీతలనూ గుర్తించగల తన నైపుణ్యాన్ని ప్రదర్శిస్తాడాయన. మబ్బులచేత మెరుపు సంతకాలను కూడా తన తేట తెలుగు గజల్లలో ఈ మధ్య చేయించుకున్న సాధికార సాహిత్య సన్మాన పత్రగ్రహీత ఆయన. వేయేళ్ల తెలుగు సాహిత్య చరిత్ర సారాన్ని, తన జిజ్ఞాస చషకంలో విజ్ఞాన పీయూషంగా త్రాగేసి, నవనవోన్మేష సత్యగానం చేసే నిత్యచైతన్య చైత్ర కోకిలము ఆయన.

నన్నయ్య మొదలు నా వరకు, తెలుగు కవిత్వ ధర్మక్షేత్రంలో నవ్యసాహిత్యోద్యమాలు నడిపిన వీరులందరూ నావాడంటే నావాడని అభిమానించే అపూర్వ వ్యక్తిత్వం నారాయణరెడ్డిగారిది. అనితర సాధ్య జవసత్వములఆయనది. ఒక గురజాడ, ఒక రాయప్రోలు, ఒక శ్రీ శ్రీ, ఒక విశ్వనాథ, ఒక కృష్ణశాస్త్రి, ఒక దాశరధి, ఒక కుందుర్తి వంటి యోధానుయోధులెందరో తెలుగు సాహిత్య గగనంలో విజయపతాక లెత్తినవారే. ఎవరి కంఠశంఖాలు వారొత్తినవారే. వీరితో డా॥ నారాయణరెడ్డి గారిని పోల్చడం, అనవసరం - అవివేకం. ఎవరిని మించిన వా రెవరనే వెర్రి వాదాలకంటే ఎవరు అందించిన దెవరికి ఉపకరిస్తుందనే సహృదయ వేదన ముఖ్యం. వారి ఆలోచనలు, ఆశయాలు, అనుభూతులు, ఆదర్శాలు మానవవిజయగీతాలుగా పురోగమన సంకేతాలుగా మనం మిగుల్చుకో గలిగితే చాలు. యుగకర్తలు, పీఠాధిపతులు కాదు కావలసింది. సత్యాన్ని నిత్యం చేసే సారస్వత శక్తి మూర్తులు, గత కీర్తిని తలచుకుంటూ, బంగారు భవిష్యత్తును పిలుచుకుంటూ వర్తమాన జీవితాన్ని వైభోవోపేతం చేసే వైతాళికులు కావాలి. సంప్రదాయ శృంఖలత్వం, స్వార్థపర విశృంఖలత్వం కాదు మనకు కావలసింది. మానవుని లోని సమతాదృష్టిని ఉద్దీపింపచేస్తూ, సమరతత్వాన్నీ అసురత్వాన్ని ఆర్పివేస్తూ, కనిపించే మనిషికీ, కనిపించని దైవానికీ ఒకే మాతృభాష నేర్పించే విజ్ఞాన ప్రజ్ఞాన కవితా రచనాచార్యులు కావాలి.

నేడు, నారాయణరెడ్డి, సృజనాత్మక సుప్రభాత కవితావైతాళికాచార్యుడు. ప్రాచీన ఆర్వాచీన భాషలో సమీచీన భావాలను పండిస్తున్న కాలాతీత విత్తక్షేత్రజ్ఞుడు "అమృతం పంచి పెడుతున్నాను అందరూ రండీ" అంటూ "మరో హరివిల్లు" ఎక్కుపెట్టిన నవమార్తాండ కవి ఆయన. ఇరు వయ్యొకటవ శతాబ్దంలో కాలుమోపుతున్న కాలాన్ని కేలెత్తి పిలుస్తున్న కలకంఠం ఆయన. వ్యాస వాల్మీకి కాళిదాస రవీంద్రాది విశ్వకవీంద్రుల దర్శనాదర్శం ఆయన మెడలో దండగా వేద్దాం. మతాలుగా మతాలుగా చీలిపోతున్న సాహిత్య

సాధకులను సమత, సమైక్యత, సత్యశీలత పీఠం మీద సమావేశపరచుమని విన్నవిద్దాం. తెలుగుబారతి కీర్తిని తీర తీరాలకు, దూర దూరాలకు తీసుకవెళుతున్న మైత్రి సూత్రాన్వేషి విశ్వ వికాసభావ పిపాసి సినారెను మనసారా ఈ శుభసందర్భంలో కవితా చందనం తోనే సత్కారిద్దాం.

ఆచార్య నారాయణరెడ్డి!
సాహిత్య తపస్సులో నీ మనస్సు కూర్చున్న
మట్టిగద్దె జ్ఞాన పీఠం అయింది.
నెరసిపోతున్న నీ నీలాలకలు
శివసుందరసత్యాలు కురిపిస్తున్న
మేఘ కిరీటం అయింది.
కపటనాటక కీటకాల విలాసం కోసం
నవ్వని నీ తొలికావ్యపు పువ్వు
కష్ట జీవుల కన్నీటిని తుడిచే
కర్మయోగనాగార్జున సాగరంలో
నవజీవనకాసారంలో
పద్మశ్రీయై నవ్వింది
రసానంద మందిరంలో పరిమళించింది.
వెన్నెల వాడల్లో విహరించిన
నీ ప్రణయరాగచకోరాలు
రామప్ప గుడిలో రవళించిన
నీ ప్రణవభావమంజీరాలు
స్వేచ్ఛాఉదయపు హృదయంలో ఘోషించిన
నీ ప్రగతి ఋతుచక్రాలు
తెలుగు గుండెల వెండి తెరమీద
బంగారు తీగలై సాగుతున్నాయి
విశ్వంభర వీణాశ్రుతులై మ్రోగుతున్నాయి......

సంప్రదాయానికి ప్రయోగాన్ని
ప్రయోగానికి సంప్రదాయాన్ని
ప్రాణభిక్షగా పెట్టిన
పురోగతి వితరణ శీలివి నీవు
కాలపు తీర్పు ఇచ్చే మార్పు వసంతాలలో

మాయని మానవత్వ కర్పూర కేళివి నీవు ......
హిమాలయ ఔన్నత్యాన్ని
హిందూమహాసముద్రపు గంభీరత్వాన్ని
స్పర్శించే నీ ప్రతిభా పాండిత్య పక్షాలు
అక్షరాల గవాక్షాలు
అందుకోలేని ఆకాశం లేదు
అందుకే
భారత భారతి నీ మీద పెట్టుకున్న
ఆశలకు అంతులేదు.



# హృదయ లేఖ

ఒక 'అమృతహృదయం' వినిర్మలానురాగంతో కాన్కగా ఇచ్చిన ఈ పుస్తకంలో ఏమీ వ్రాయాలి? ఎవరి కేమని ఉత్తరాలు వ్రాయాలి? నా జీవితానుభవాలను వ్రాసుకోవాలా? నా ఆశయాలను చిత్రించుకోవాలా? నా ఊహలకు రూపకల్పన చేయాలా?

అనేక విషయాలగురించి వ్రాశాను. పాడాను. కాని అవ్యక్తమైన భావాలు, ఆవేదనలు నా మనోమండలంలో కల్లోలం రేపుతున్నవి. వాటిని ఎలా చిత్రించాలో తెలియదు. ఎవరికి ఏమని తెలయజేయాలో కూడా స్ఫురించదు. అయితే --

"మబ్బు వోలెనే నా ఎద
మారుచుండునురా ప్రభూ!
గాలివోలెనే నా భా
వాలు నిల్వలే వాకచో"

అని ఓ చోట అనేశాను. అంతా నిజమే. అయినా నా జీవితం కొన్ని విస్పష్టమైన, నిశ్చలమైన ఆశయాలను ఆలంబనంగా చేసికొనే సాగుతున్నది. వాటి పూర్ణ స్వరూపాన్ని నేను చిత్రించలేకపోవచ్చు. కాని ఛాయమాత్రంగానైనా నన్ను గురించి నేను నీవంటి కళామూర్తికి, హిమాలయోన్నత శీలికి, సహృదయురాలికి తెలియచేసి, మనోభారాన్ని కొంత తేలిక పరచుకోవాలను కుంటున్నాను. ఈ ఉత్తరం పోస్టు చెయ్యను. నీకందజెయ్య వచ్చును. అయినా నీకు చేరినట్లే, నీకు విషయాలన్ని తెలిసినట్లే భావిస్తున్నాను, వ్రాస్తున్నాను.

నేను జన్మించిన సమయం నాకు తెలియదు. కాని 3 rd August, 1935 అంటారు. నేను మరణించే దెప్పుడో నాకంత జ్ఞానం లేదు. అయినా ఒకనాడు తప్పకుండా అందరిలాగానే ఈ జగత్తు వీడిపోతానని సంపూర్ణ విశ్వాసం ఉంది. ఈ మధ్యకాలం – జీవిత కాలంలో – నేను చేయవలసిం దేముందో తెలియదు. కాని ఇంత వరకు చేసింది దాదాపు ఏమీ లేదనే అనుకుంటున్నాను. అయితే చాలా చాలా చేయాలని మాత్రం అప్పుడప్పుడు ఆలోచిస్తూ ఉంటాను. ఏదో ఒకటి ఆరంభిస్తాను. అంతో ఇంతో కార్యం చేస్తాను. విజయం సాధిస్తే నింగివరకు పొంగిపోతాను. ఓడిపోతే పాతాళం దాక క్రుంగిపోతాను. సంతోషిస్తాను, విచారిస్తాను, దుఃఖిస్తాను; ఓదార్చుకొంటాను, మరచిపోతాను. ఊహ మత్తులో నూతన పథాలవెంట నడుస్తాను. మళ్ళీ అదే వృత్తంలో తిరుగుతూ

ఉంటాను. జయాపజయాల మధ్య సుఖదుఃఖాల మధ్య, వాస్తవికత ఊహల మధ్య, ఆశయాలకు అనుభూతులకు మధ్య అంతు తెలియని ఈ సృష్టి రహస్యం చూచి సతమతమవుతూ ఉన్నాను. ఎత్తుపల్లాలను దాటుతూ ఎక్కడికి పోతున్నావో తెలియకుండానే సాగిపోతున్నాను.

ప్రేమిస్తున్నాను, ద్వేషిస్తున్నాను. చిత్ర విచిత్రంగా ప్రవర్తిస్తున్నాను. అయితే ఏదీ ఒ ప్లాను ప్రకారం, ఒక నిర్దుష్ట సూత్రావలంబనతో చేయడం లేదు. హిమబిందువులను చూచి హిమమైపోతున్నాను. అగ్ని జ్వాలలు చూచి ఆవేశపడుతున్నాను. అయితే జీవితంలో సౌఖ్యం ఆనందం అనుభవించాలని అనవరతం ప్రయత్నిస్తూనే ఉన్నాను. కాని, ఏది అనందదాయకం, ఏది అనుభవయోగ్యం, ఏది కాదు - అనే విషయంలో నిరంతరం మానసికాందోళనకు లోను అవుతున్నాను. తాత్కాలిక సమాధానాలతో క్షణికావేశ ఉద్వేగాలతో తృప్తిపడుతున్నాను. నా జీవిత విధానంలో ఆశయంలో సంపూర్ణమైన, కనీసం సర్వసమ్మతమైన మార్గం మాత్రం కనిపించడం లేదు.

రాగద్వేషాలు, అశానిరాశలు గురించి క్షుణ్ణంగా తెలిసికొంటే దాదాపు జీవిత సమస్యలన్నీ పరిష్కారమౌతాయాయో అనిపిస్తుంటుంది. ఏ వ్యక్తిని ఎందుకు ప్రేమిస్తానో, ఎందుకు ద్వేషిస్తానో తెలియదు. అసలు రాగద్వేషాలు ఎప్పుడు ప్రారంభమవుతాయో, ఎలా పెంపొందుతాయో చెప్పడం కష్టం. అసలు మానవసంబంధాలు (human relations) ఏ మూలసూత్రాల మీద ఆధారపడుతున్నాయో తెలిసికొంటే అనేక సమస్యల్ని అవలీలగా తేల్చివేయవచ్చునేమో. Sputniks తయారుచేయడం, గ్రహాంతరయానాలు చేయడం అంత సుళువుగా మానవసంబంధాలలోని రాగద్వేషాల సమస్యను పరిష్కరించడం సాధ్యం కాదేమో అనిపిస్తుంది. ఇదంతా వేదాంతమనిపించవచ్చు. కాని, ఇవన్నీ నాదనలేని నిత్యసత్యాలనడంలో సందేహం లేదు.

ఒక మనిషి - ఒక ఆత్మ మన మధ్యనుండి విడిపోయినప్పుడు మనలో తుఫాను రేగుతుంది. మన గుండెను ఎవరో దోచుకున్నట్లనిపిస్తుంది. మన కెవరో హాని చేసినప్పుడు వాని మీద కసి తీర్చుకోవాలనిపిస్తుంది. ఈ భూమి మీద అతడు లేకుండా చేయాలనిపిస్తుంది. ఒక వ్యక్తిని ఈ గోళం పైనుండి తొలగించి. ఏదో సాధించామని అనుకోడానికి హేతువేమిటో స్ఫురించదు. అయితే అందరూ ఈ జగత్తును వీడిపోవలసే ఉంది. ఇహం క్షణిక సుఖాలకు - లేనిపోని వేదనలకు నిలయమని అందరూ అంగీకరిస్తారు. ఇదంతా మాయ, భ్రమ అని

కొందరంటారు. కాదు ఇది మానవ మానసికతత్వం అని మరికొందరు చెబుతారు. అయితే ఎవరూ దీనికి అసలు హేతువు ప్రకటించరు. మానవ చరిత్ర విప్లవాత్మకమైన మార్పులకు గురియైంది. అనేక వ్యవస్థలు తారుమారైనవి. కాని రాగద్వేషాలు నిరంతరం మానవ సమాజాన్ని వెన్నాడుతునే ఉన్నవి.

అందుకే 'ప్రేమ' అనేది మానవసమాజ సరోవరంలో వికసించిన పద్మం అనిపిస్తుంది. ప్రేమానురాగాలు లేని మానవ సంఘాన్ని ఊహించలేము. కన్నీళ్ళు చిరునవ్వులు, త్యాగం, అనుకంప ఇవన్నీ ఆ ప్రేమాబ్జపు రేకులేమో? ప్రేమ, అమిశ్రితమైన గుణంకాదు. దాన్ని అంటుకొనే నీడలాగ ద్వేషం కూడా వేలాడుతుంటుంది. అయితే మానవానందం, సౌఖ్యం నిజంగా అతని ప్రేమ పరిమాణం మీద ఆధారపడిఉంటుందేమో. సంపూర్ణ ప్రేమాన్వితుడు దేవుడనుకుంటే తప్పు లేదేమో. నేను చాలామందిని ప్రేమించాను. కారణాలు విభిన్నాలు – అనేకం. నా అదృష్టం అనుకుంటాను నేను ఈ ప్రపంచంలో చాలా తక్కువమందిని ద్వేషించాను. నేను ఎవరినీ ద్వేషించకూడ దనుకుంటాను. ఎవరి మనస్సుకు బాధ కల్గించకూడదనుకుంటాను. మంచి ఎక్కడున్నా ప్రేమించాలనిపిస్తుంది. చెరుపును మాత్రం వేలెత్తి చూపక మానలేను. సాధ్యమైనంతవరకు సహృదయంతో సర్వజీవులయందు, సర్వపదార్థాలలో సౌందర్యాన్ని, మంచిని తిలకించడానికి ఆకాంక్షిస్తాను. అందం చూచినప్పుడు గుండెను పెంచి పాడుకుంటాను. కురూపాల్ని చూచినప్పుడు విచారిస్తాను. అవి కూడా సుందరతను పొందాలని జాలిగా ఆశిస్తాను. ఒకరి హృదయానికి బాధ కల్గించాలంటే నేనెంతో భయపడతాను; అధైర్యపడతాను. ఒక వేళ అట్లాంటిది ఆవేశంలో చేసినా అమితంగా బాధపడతాను. నాలో నేను కుంచుకొని పోతాను. నన్నెవరైనా ద్వేషించినా నేను సహించలేను. నే నెవర్నైనా ద్వేషించి సంతోషించలేను.

ఒక చిరునవ్వుకు నేను సహస్రార్చనలు చేయగలను. ఒక నిర్మ హృదయానికి హారతి పట్టగలను. ఒక అనురాగభావానికి అంజలి ఘటించగలను పవిత్రమైన మైత్రికోసం ప్రాణాలైనా ఇవ్వడానికి సిద్ధమే. అయితే అసురత్వాన్ని అన్ని విధాల అడ్డగించగలను. రావణుణ్ని రాముణ్ని చేయాలని ప్రయత్నిస్తాను. చెరుపు అంతా మంచిగా మలచడానికి అవకాశం ఉందని నాకు ఆశ ఉంది. సత్యం చెప్పడంవల్ల మనిషికి ఓ విధమైన ఆత్మశక్తి, దక్షత, ధైర్యాలు ఏర్పడతాయి. నేను అసత్యం ఎన్నడూ చెప్పలేదు అనలేను. కాని

సాధ్యమైనంతవరకు సత్యపు సరిహద్దులు దాటకుండా ఉండడానికే ప్రయత్నించాను. అసత్యం చెప్పినా అది ఎవరికీ హానికల్గించకుండా ఉండాలని నా భావం. తాత్కాలికోద్రేకాలను తగ్గించడం కోసం, మైత్రి సంబంధాలను కాపాడడంకోసం, అప్పుడప్పుడు సరదాకోసం అబద్ధాలు అనేకం చెప్పినాను అయితే మోసగించాలని గాని, వంచించాలని గాని నేను అసత్యాలు చెప్పినట్లు జ్ఞాపకం లేదు. శరణాగతుని రక్షణయందు, వివాహాది విషయాలందు అనృతం పల్కవచ్చునన్న ధర్మసూక్ష్మం సమంజసమైందేనేమో !

అన్నిటికంటె ముఖ్యంగా నేను చాలా సున్నితమైన హృదయం కలవాణ్ణి. ఈ sensitiveness నుంచి బయటపడడానికి చాలా ప్రయత్నించాను. కొంతవరకు సఫలీకృతుడనైనా ఇంకా వాని పునాదులు దృఢతరంగా నాలో ఉన్నవని చెప్పడానికి విచారిస్తున్నాను. నాలోని emotions, sensitiveness నన్ను విచిత్రమైన భావోద్రేకాలకు గురి చేస్తుంటాయి. నేనెంత ఆనందించగలనో అంతగానే విచారసాగర గర్భంలో మునిగిపోతాను. ఎంత ఉన్నతంగా ఊహించగలనో, అంత నిరాశా నిస్పృహలకు గురియై పరితపిస్తాను. అయితే వెలుగు చీకట్ల జాడలు కొంతవరకైనా ఎరుగుదును కాబట్టి నా మనస్తత్వమును నిరూపించుకొనుటలో కొంత వరకు విజయం సాధించానని చెప్పగలను.

కొన్ని విషమపరిస్థితులకు, బాధాగత వాతావరణములకు ఎదురొడ్డినిల్చే నిబ్బరము–శక్తి నాలో కొంత వృద్ధిపొందుతున్నట్లు గ్రహిస్తున్నాను. అయినా చాలావరకు కలవరపడడం – హృదయాందోళనకు గురికావడం, ఆవేశోద్రేకాలకు లోనుకావడం – నాకు తప్పడంలేదు. ఒక్క చిన్న సంఘటన నన్నెంతో కదిలిస్తుంది. – తుఫానులో ముంచెత్తుతుంది. నేనెవ్వరికైనా బాధకల్గించానని తెలిసికొన్నప్పుడు – నా ఆత్మకు వంచనకల్గినప్పుడు నిజంగా నేనెంతో పశ్చాత్తాపానికి , పరితప్తతకు లోనైపోతాను. ఆహోరాత్రులు దాన్ని గురించి ఆలోచించకుండా ఉండలేను. ఏదో ఒకటి తేల్చుకొనేదాక నా అంతర్యుద్ధాగ్ని చల్లారదు. నేను ఇతరులను క్షమించగలను కాని నన్ను నేను క్షమించుకోలేను. ఇతరుల శక్తిలేమిని చూసి వారి అపజయాలను చూసి విచారిస్తాను. అవే నాపరమైనప్పుడు నన్ను నేను నిందించుకొంటాను. నాలో నేను క్రుంగిపోతాను – నిరీహకు లోనౌతాను. అందుకే నేనెందరి తప్పులు ఎన్నినా, ఎందరిని ఏవిధంగా దూషించినా, విమర్శించినా వారిపట్ల నాకున్న అభిమానాన్ని గాని ప్రేమను గాని విసర్జించలేను. వారితో విరోధాన్ని పెంచుకొని

తృప్తిచెందలేను. ఆత్మీయత, ప్రేమానురాగాల ముందు నాకు అన్ని లోపాలు క్షమార్హాలు అనిపిస్తాయి. నిజంగా కొందరి వ్యక్తులపట్ల కొన్ని కొన్ని సంఘటనలపట్ల నాకెంత ఆగ్రహావేశాలు కల్గినవో ఆలోచించుకుంటే కంపించిపోతాను. అదంతా అలాగే పొడిగిస్తే నా జీవితంలో అసలు మిత్రులుండేవారు కాదేమో అనిపిస్తుంది. అయితే ఇప్పుడు మాత్రం నాకు అతిగా చెప్పవలసిన శత్రువంటూ ఎవ్వరూ వ్యక్తిగతంగా లేరని చెప్పగలను. నన్ను కూడా శత్రువుగా భావించేవారుగాని, విధిగా ద్వేషించేవారుగాని ఉన్నారని అనుకోవడం లేదు. విశ్వప్రేమ, విశ్వభ్రాతృత్వం నన్ను ఆవరించినవి. నేను అందుకే అన్ని విషయాలపట్ల విశ్వజనీనమైన దృక్పథం అలవరుచుకోవడానికే ప్రయత్నిస్తూ వచ్చాను. విశ్వప్రేమాన్వితుణ్ణై దోషాలను క్షమించి సర్వతోముఖమైన సౌందర్యానందాలు ఈ ప్రపంచంలో ఉదయించాలని నే నెప్పుడూ కలలు కంటుంటాను. నేను వ్రాసే ప్రతి కావ్యఖండంలో ఈ సర్వజనీనత, సహజానురాగాలు ప్రతిఫలిస్తుంటాయి. నాకెరుకలేకుండానే, మా మిత్రుడు (Mr.మధుసూధనరాజు) ఒక నాడీ విషయం నాకు తెలియజేసి నప్పుడు నన్ను నేను క్రొత్తగా చూసినట్లనిపించింది.

మానవ సమాజ రక్షణ కోసం, అభివృద్ధి కోసం కొన్ని నియమాలు, సూత్రాలు అవసరం. అందరూ కొన్ని మూలసూత్రాలను నియమాలను అనుసరిస్తేనేగాని సంఘంలో జీవించడం సాధ్యం కాదు. ఇట్లాంటి వాటిని social necessities అంటాము. ప్రభుత్వం, రక్షణ యంత్రాంగం లేకున్నా సమాజ వ్యవస్థ నిలుస్తుందేమో కాని, కొన్ని సాంఘిక నియమాలు పాటించక పోయినట్లైతే సమాజం అనిశ్చితమైన వాతావరణంలో ప్రమాదాలకు, భయానికి, అయోమయానికి గురియై నశించిపోతుంది. ఈ నియమాలవే సాంఘిక నీతి అనవచ్చు. అహింస, దయ, గౌరవము, సౌభ్రాత్రత, సహనం ఇట్లాంటివి నశించిపోతే సమాజం అరణ్యప్రాయమై పోతుంది. స్వీయ ఆత్మరక్షణ, ఆస్తిరక్షణ అనేవి మానవునికి ప్రపంచంలో జీవించడానికి ప్రధానహక్కులు కల్పిస్తవి. అందరూ జీవించి – సౌఖ్యంగా, ఆనందమయంగా కాలం గడపాలంటే ఇటువంటి నియమాలు అనుసరించక తప్పదు. ఆత్మవికాసానికి, సాంఘికాభివృద్ధికి నిజంగా కొన్ని సర్వజనాచరణీయమైన సిద్ధాంతాలు, నియమాలు ఉండవలసిందే. అయితే వీటి స్వరూపం కాలానుగుణంగా మారుతూ ఉండాలి. మానవ సంబంధాలు ముఖ్యంగా నైతిక, సాంస్కృతిక ఆధ్యాత్మిక విలువల మీద ఆధారపడి ఉంటాయి. ఎవరివల్లగాని,

ఏవిషయంవల్లగాని, ప్రభావితులం కాకుండానే మనం మైత్రి అనుకంప, ప్రేమానురాగాలు ప్రకటిస్తుంటాము. పరిచయంతో పని లేకుండానే ఒక వ్యక్తి రోడ్డు మీద పడిపోయినప్పుడు గాని, ప్రమదానికి గురియైనప్పుడు గాని మనం సానుభూతి ప్రకటిస్తాము. సహాయం చేస్తాము. ఏ ప్రతిఫలం ఆశించకుండానే మనం ప్రతిరోజు అనేకమందికి స్వల్పంగానో అధికంగానో సహాయం చేస్తూనేఉంటాము. ఇదంతా మన విధిగా భావిస్తాము. ఇతరులకు సహాయం చేసిగాని, ఇతరుల దయానురాగాలు పొందినప్పుడు గాని మనం ఎంతో సంతృప్తి చెందుతాము. ఇవన్నిటికి కారణం మనలో ఉన్న ఆత్మ, ఆలోచనాయంత్రం అని విశిష్టమైన మానవలక్షణాలని తాత్వికులు అంటారు.

అయితే ఈ నీతినియమాలు అన్నీ ఏ విధంగా ఆలోచించినా మానవ ఆత్మానందానికి, సంఘ వికాసానికి వ్యతిరిక్తాలు కాకూడదు. ఎంతవరకు మనచట్టాలు, మనసాంఘిక, నైతికసూత్రాలు, నియమాలు మానవ మనో వికాసానికి, ఆనందానికి, సౌఖ్యానికి ఉద్దేశింపబడి ఉంటవో అంతవరకే వాటికి అర్థం, అవకాశం ఉంటుంది. వీటినే Liberty, Equality, Freternity మొదలైన Concepts లో వెల్లడిస్తారు. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని, హృదయానందాన్ని నిరోధించే ఏ శక్తినీ మానవుడు సహించలేడు. అయితే కొన్ని నీతి నియమాలను మన భ్రమావరణంలో ఉండి ఆచరించి నిత్యానందం పొదుతున్నామని నా అభిప్రాయం.

దేశంలో ఇప్పుడు దాదాపు అన్ని రంగాల్లో సంక్షోభం చెలరేగింది. ఆర్థిక, విదేశ ద్రవ్యమారక, సాహిత్య వ్యాపార రంగాలలోని సంక్షోభాలు భౌతికమైనవి పదార్థసంబంధమైనవి కాబట్టి వాటి పరిష్కారం కూడా అంతకష్టం కాదు. కాని స్వభావంలో, శీలంలో, విశ్వాసంలో సంభవించిన సంక్షోభాలు చాల ప్రమాదకర మైనవి. ఆత్మసంబంధమై సాంస్కృతిక ప్రాతిపదిక మీద ఏర్పడ్డవి. కాబట్టే నివారణ కష్టసాధ్యమైనది. ఇటువంటి Decadent Cultural Crises in Character and Confidence ఇప్పుడు మనదేశాన్ని సమాజాన్ని వేటాడుతున్నాయనిపిస్తుంది. ఇవ్వాళ ప్రతివ్యక్తి ఒక విధమైన అనిశ్చలత్వానికి, అవిశ్వాసానికి, అస్పష్టతకు లోనై కలవరపడుతున్నాడు. వ్యక్తి సంబంధాలు వక్రమార్గాలు పట్టినవి. సంబంధాలు, ప్రవర్తన ప్రాతిపదికలు కోల్పోయి ఊగులాడుతున్నవి. ఆత్మవిశ్వాసం, ఇతరులమీద నమ్మకం కోల్పోయి నేటి మానవుడు దరిలేక అల్లాడుతున్నాడు. ఈ స్థితి మోసం, స్వార్థం, పక్షపాతం, అన్యాయం రూపంలో కన్పిస్తున్నది. దేశంలోని మేధావంతులు ఈ విషయాన్ని

కొంతవరకు గుర్తించారు. కాని కావలసినన్ని నివారణ సాధనాలు అందించడంలేదు - ఉపయోగించడం లేదు.

సమాజంలో స్త్రీ పురుష సంబంధాలు చాల ముఖ్యమైన విషయం. వారు పరస్పరం ఒకరిపట్ల ఒకరు ఎలా ప్రవర్తించాలన్న అంశం కాలానుగుణంగా మారుతూవస్తున్నది. స్త్రీని సగౌరవంగా చూసే సంఘం నాగరికమైందని వివేకానందుని వంటి దివ్యజ్ఞానులు ఒప్పుకొన్నారు. ఇది చాల వరకు భారతదేశంలో పాటించబడింది. జపాన్ వంటి కొన్ని దేశాల్లో యువకులకు, పిల్లలకు సంఘంలో ఎక్కువ గౌరవం ఆదరణ ఉన్నట్లు తెలుస్తుంది. ఏది ఎలా ఉన్నా వయస్సుతో లింగబేధంతో సంబంధం లేకుండా ప్రతిమానవునికి సమానమైన గౌరవం జరిగే సంఘం, జాతి ఎక్కువ నాగరికమైందని నా అభిప్రాయం. అందరిలోనూ మానవాత్మ ప్రతిబింబిస్తుంది, అందరికీ ఒకేరకమైన feelings ఉంటాయి, అందరికి ముఖ్యంగా స్త్రీ పురుషులకు సంఘంలో సమాన ప్రతిపత్తి హక్కు ఉండాలన్న వాదన ఆధునిక ప్రపంచంలో ముఖ్యంగా మన దేశంలో మహత్తర ఉద్యమ రూపం దాల్చింది. చాల ముదావహం. స్త్రీ విద్య, మహిళా సంఘాలు, ఉద్యోగాల్లో స్త్రీలకు ప్రత్యేక అవకాశాలు - ఇవన్నీ వాంఛనీయాలే. అయితే ఈ స్త్రీ స్వేచ్ఛ స్వాతంత్ర్యాల పేరుతో మానవసంఘానికి మసి పూయడం గర్హనీయం. స్త్రీ కొరకు సమానమైన విద్యా సౌకర్యాలు ఒక వైపు కల్పిస్తే సంపూర్ణ సహ విద్యను మరోవైపు నిరోధిస్తున్నారు. ప్రత్యేక మహిళా విద్యాలయాలు అయితే నేమి - అసలు సహవిద్యా సంస్థలనే వాటిల్లో స్త్రీలకు ప్రత్యేక ఏర్పాట్లు కల్గించడమైతేనేమి స్త్రీ పురుషులు, ఒకే ప్రాతిపదిక మీద, ఐక్యంగా ఆలోచించి కార్యాచరణకు సిద్ధం అయ్యే అవకాశాలకు భంగం కల్గిస్తున్నవి. Biological necessities విషయంలో మహిళలకు ప్రత్యేక అవకాశాలుండకూడదని నేను అనడం లేదు. కాని, సమాన ప్రతిపత్తిని, సాంఘిక సమానత్వాన్ని పెడమార్గం పట్టించకూడదు. భయం మీద, మోసం మీద, ఆధారపడ్డ సాంఘిక న్యాయం స్వేచ్ఛా స్వాతంత్ర్య ఛాయల్లో జరిగే అవినీతి కంటె హీనమైంది. నీతి అనేది ప్రకృతి సత్యాలమీద, మానవమానసిక వికాసంమీద ఆధారపడిఉండాలి. అసమానాలమీద, పక్షపాత స్వార్థపరత్వాల మీద నిలిచిన నీతి నీతి కాదు. మానవ స్వేచ్ఛకు సాంఘిక పురోభివృద్ధికి మధ్య ఉన్న అగాధానికి వంతెన ఉండాలి. మానవ సంబంధాలు, నీతి నియమాలు మానవప్రకృతికి అనుగుణంగా ఉండి మానవుణ్ణి దేవతగా మలచేవి కావాలి గాని కృత్రిమత్వంలో పీడించి అసురత్వాన్ని ఆపాదించేవిగా ఉండరాదు.

అందుకే నే నెప్పుడు ఏ వ్యక్తితో కలిసినప్పుడైనా స్వేచ్ఛగా, హృదయపూర్వకంగా మాట్లాడాలని ఆత్రత పడతాను. సహృదయత్వం క్రొత్త పాతల నెరగదేమో అనిపిస్తుంది. ప్రపంచంలో అన్నిటికంటె విచిత్రమైన విషయం 'స్నేహం' మమకారం అనిపస్తుంది. 'స్నేహితం' అనేది దానంత అదే ఒక స్థితి (itself a phenomenon) అని నా విశ్వాసం. అందుకే నేనెందరితోనో ఏ ప్రత్యేక ఉద్దేశ్యం లేకుండానే మైత్రి చేస్తూ ఉంటాను. అనేక మంది కళాశాల విద్యార్థి విద్యార్థినులతో నేను కలిసి మెలిసి ఉండాలని ప్రయత్నిస్తాను. ఉంటాను కూడ. ఆడపిల్లలతో మైత్రి చేయడం కేవలం biological reason అనే అభిప్రాయం శుద్ధ తప్పు అని నా అభిప్రాయం. అసలు కేవలం స్వార్థబుద్ధితో శారీరక సౌఖ్యవాంఛతోనే కాని స్నేహం చేయకూడదనుకుంటే జీవితం ఎడారిప్రాయమౌతుందేమో! మనిషిలో కళాతృష్ణ ఆత్మానందం అనేవి ఉంటాయని నా వ్యక్తిగతానుభవంవల్ల తెలిసికొన్నాను. ప్రతిక్రియలో ఛాయా మాత్రంగా స్వార్థం జీర్ణించిఉంటే ఉండవచ్చు. కాని అసలుమానవ ప్రవర్తనే స్వార్థ బద్ధం అనడం అన్యాయం. ఒక సౌందర్య వస్తువును కవి ఆనందించడంలో అవినీతి కాని స్వార్థం కాని ఉందంటే నేను ఒప్పుకోను. ఒక అందమైన యువతిని చూసి ఆనందిస్తే తప్పు లేక పోవడమే కాక మానవత్వం, సహజత్వం ఉందని నేననుకుంటాను. సౌందర్యాన్ని చూసి ఆనందిచలేనివాడు కాని, ముగ్ధుడు కాని వాడు కాని సంపూర్ణ మానవుడు కాదని నా అభిప్రాయం. ఇక సుందరతను ఉద్దేశపూర్వకంగా ఉపేక్షించేవారు కాని, చూడనట్లు నటించువారు కాని సజీవులైన రాక్షసాధములని నా విశ్వాసం. వారికంటె నిర్జీవ పాషాణాలు మేలు. ఇటువంటి కొన్ని విషయాలు చాల చిన్నవిగా కన్పించవచ్చు కాని నిజంగా ఇవే మానవ జీవిత సూత్రం - చరిత్ర సారం -అన్ని తత్వాలకు పరిశీలనాత్మక అంశాలు.

సౌందర్యం కప్పిపుచ్చ బడడంగాని, జీవితం నుండి వేరు చేయబడడం గాని నేను సహించలేను. అయితే శాశ్వత సుందరతను పోషించాలని మాత్రం నేను ఆశిస్తాను. క్షణికానందదాయకమై, మనఃకాలుష్యం కల్గించే సౌందర్య భ్రమావరణలోఉండాలని నేనెప్పుడు అనను. A thing of beauty is a joy for ever అన్న Keats అపరసత్యం సర్వదా అంగీకరిస్తాను. హృదయాన్ని కదిలించే సుందర దృశ్యం చూసినప్పుడు నే నేదో విజయం సాధించినట్లు భావిస్తాను.

ఒక సుందరీ మణి విసిరిన చిరునవ్వు ఎంతో భాధా భారాన్ని దింపుతుంది. ఆమె పట్ల మనకు వేరే అభిప్రాయం ఉండనక్కర లేదు. ఆమె మన నుండి ఏమో ఆశించనక్కరలేదు. కాని, భగవంతుడు (ప్రకృతి) ప్రసాదించిన ఆ సుందర

దరహాసాన్ని బాధామయ జగత్తు లోనికి ప్రసారం చేయడం కూడ మానవ ధర్మమే అని నా విశ్వాసం. అందుకే చిరునవ్వు నవ్వలేని స్త్రీలను ముఖ్యంగా యువతులను చూసినప్పుడు వెగటు కల్గుతుంది. వారిని ద్వేషించకపోయినా వారు మన కేదో లోపం చేస్తున్నట్లు ఫీలవుతాను. మందస్మితం, దాన్ని వెదజల్లేవారి సుందరమైన ఆత్మను ప్రదర్శించడమే కాకుండ అందుకొన్నవారి మనోమండలాలను క్షాళనం చేసి ఆనందం పంచిపెడుతుంది. ఇది ఉదాహరణకు పేర్కొన్నాను. ఇటువంటి సహజ సౌందర్య కళాకళికలు మానవునిలో అనేకం ఉన్నవి. వాటిని జగుత్తులో సార్థకం చేయకపోవడం కూడ ఆత్మద్రోహమే. ఈ ప్రపంచం అటువంటి సర్వ సౌందర్య సంభరితమై ప్రసన్నమైన సౌఖ్యానందాలను ప్రసరించేది - ప్రకృతి సత్యమైన వినిర్మల స్వేచ్ఛావాయవులు ప్రసరించిన్నాడే అని నా నమ్మకం. ఈ విషయం గురించి నేను నీతో ఒకప్పుడు ప్రసంగవశాత్తు ప్రస్తావించినప్పుడు నీవు ఓ చిరునవ్వుతో ఒప్పుకొంటున్నట్లు జ్ఞాపకం.●

*● 1957లో విద్యార్థిగా ఉన్న బాపురెడ్డి ఓ అభిమాని బహూకరించిన అందమైన నోటు బుక్కును అందుకున్నప్పుడు ఆయనకు కలిగిన హృదయ స్పందనం ఇది. ఆయన జీవితతత్వాన్ని నిర్వచించే సాహిత్య దర్శనం ఇది – ప్రకాశకులు.*

# ఉద్యమించిన పద్యరాజనందిని

గద్యం, గేయం, కవితా స్యందనాలై ఊరేగుతున్న ఈ రోజుల్లో పద్యానికి పట్టం కట్టే వాళ్ళు కరువైపోతున్నారు. నా వంటి వాళ్ళు కొందరు మాత్రం పద్యం, గద్యం (వచన కవిత), గేయం - ఈ మూడు కవితా ప్రక్రియల్లో సమభావం, సమాదరణ చూపిస్తున్నారు. కవితా వస్తువే కవిత అని భ్రాంతిపడి కొందరు భావుకతను చావు దెబ్బ తీస్తుంటే, కవితా ప్రక్రియే కవితా తత్వమని భావించి కొందరు కవితా శిల్పాన్ని బండబారకొడుతున్నారు. కవిత్వం కవితా వస్తువులో నుంచి కాదు, తద్వస్తుగత భావ శక్తినుంచి ప్రవహిస్తుందనీ, కవితా శిల్పం భావాభివ్యక్తి శక్తి అనీ గ్రహించిన వాళ్ళు ఏ వస్తువును ఎన్నుకున్నా, ఏ ప్రక్రియ అవలంబించినా సృజనాత్మక, ప్రయోజనాత్మక సుందర కవితా సత్యాలు ఆవిష్కరిస్తున్నారు. కవితకు ప్రమాదం ఏర్పడేది ఏదో ప్రక్రియవల్లనో, ఏదో కవితా వస్తువువల్లనో కాదు, ప్రతిభా దారిద్ర్యం వల్ల, దర్శనాంధత్వంవల్లనే అని విజ్ఞులు, రసజ్ఞులు గ్రహిస్తున్నారు. అందుకే తిరిగి అన్ని ప్రక్రియల్లో విశాల వస్తు వైవిధ్యంతో గత రెండు దశాబ్దాలనుండి సుందర భావ బంధురమైన కవిత మన భాషలో వెలువడుతున్నది. ఆ కోవకు చెందిన సత్ ప్రయత్నమే "రాజనందిని".

"రాజనందిని" ఒక హృద్యమైన పద్యకావ్యం. అది వస్తుపరంగా మధ్య యుగపు రాజకీయ వ్యవస్థను ప్రతిబింబిస్తున్నా, భావనాపరంగా ఆధునిక ప్రజాస్వామ్యపు విలువల్ని పోషిస్తున్నది. నిజానికి ఈనాటి రాజకీయపు ఎత్తుగడల్ని, కుతంత్రాలను వ్యంజించే పద్యకావ్యం ఇది. కృతికర్త శ్రీ మందరపు వెంకటేశ్వరరావు బహుళ ప్రచారంలో వున్న వచన, గేయ ప్రక్రియలను కాక సలక్షణమైన సనాతన ఛందోబంధురమైన పద్య ప్రక్రియను ఎన్నుకొని ఈ కావ్యేతివృత్తాన్ని నిర్వహించడం ఆయన ఆత్మ విశ్వాసాన్ని సూచిస్తున్నది. పద్యంపట్ల ఆయనకు ఉన్న మక్కువ, వర్ణనాత్మక శైలిపట్ల ఉన్న ఆసక్తి, త్యాగశీలం ఎడల ఉన్న అభిమానం, మీదు మిక్కిలి స్త్రీ శక్తి ఎడల ఆయనకున్న అచంచల విశ్వాసాన్ని గౌరవాన్ని రెండువందల అర్వై అయిదు పద్యాలలో హృద్యంగా అభివ్యక్తం చేశారు. ఆయన వ్రాసిన తొలికావ్యమే అయినా ఇది ఆయన గడించిన విస్తృతానుభవానికి, జీవిత తత్వావగాహనకు, ప్రగతిశీలతకు దర్పణం పట్టుతున్నది. పీఠికలో ఈ కావ్యరచనకు ప్రేరణ గురించి ఆయన చేసిన వివరణ ఎంతో ఆసక్తిదాయకంగా ఉంది. కవి తన ఎదలోని ఊహలకు రెక్కలు తొడిగేదాక నిద్రపోలేడనే సత్యానికి ఈ కావ్యం తార్కాణంగా పేర్కొన వచ్చునేమో!

ఈ కథాకావ్యంలో ఆరు అధ్యాయాలున్నాయి. అయితే కథా వస్తువుకు ప్రాణప్రదమైన సంఘటన మొదటి అధ్యాయం "అంకురార్పణ" లో నిక్షిప్తమై ఉన్నది.

"ఒక్కొక రొక్కరీతి తన యోలగమం దనుమానముల్ బయల్
గ్రక్కగ చక్రవర్తి వెటకారముగా నగి, నిక్కువంబుగా
'టక్కరి టక్కులే' యని తటాలున పత్రము చింపివేయగా
రెక్కలుడుల్లు పావురము రీతి బడెన్ భువి, లేఖ దుఃఖియై".

శాంతి సందేశ కపోతాన్ని, సమరోన్మాదం, కుటిల రాజకీయ వ్యూహం ఎలా కూల్చివేస్తాయో ఇక్కడ చిత్రించబడింది. ఎంతో హృద్యమైన వర్ణన – కవి సరళ శైలికి, ధారాశుద్ధికి, శిల్పచాతురికి ఈ పద్యం ఒక మచ్చు తునక. "ఇది పితృ దేవు చిత్తరువు" అనే రెండవ అధ్యాయంలోని పద్యం ఓ రాజమాత, యుద్ధానికి బయలుదేరే రాజు విజయచంద్రుని దీవిస్తూ, "జయలక్ష్మిని" కొత్త కోడలుగా తెచ్చి ఆ పటము ముందుంచుమని ఆదేశించిన తీరు ఎంతో మనోహరంగా ఉంది. మాతృ వాత్సల్యానికీ, రాజనీతికీ మణిహారంలా మెరిసిపోతున్నది ఆపద్యం.

"రాతి నిర్మాణములు చీలి రాలి పడగ
కూలిపడకుండ ఆ మట్టికోట నిలిచె,
ఉద్ధతులబోలె బడుగు వారుడుగరేమొ
బాధలరుదెంచి కటువుగా పల్కరింప".

యుద్ధవర్ణన సందర్భంలో కవి చిలికించిన కమనీయ భావాలలో ఇది పేర్కొనదగినది. ఆ మట్టి గోడల మాటున నిజానికి కవి బడుగువర్గాల శక్తిని వ్యంజింపజేస్తున్నాడు. ఒక సామాజిక సత్యాన్ని కళాత్మకంగా ప్రవచిస్తున్నాడు. ప్రగతిశీలమైన ఒక విలువను ప్రతిపాదిస్తున్నాడు. ఇక మూడవ అధ్యాయం "దౌత్యము" సహజసుందరముగా సాగింది.

"తారుణ్యమా అది తనవితీరగ జేయు
సాము ముగ్గిన దోర జామపండు
..............................................
లావణ్యమా అది రసికాభిరామమౌ
మావి చివుళ్ళచెంగావి మెఱుపు..."

అంటూ సీసపద్య శిల్పలావణ్యంలో "రాజనందిని" సౌందర్యాన్ని శ్రీ

వేంకటేశ్వరరావు ఎంతో రమణీయంగా అభివర్ణించారు.

" అందాల రామ చిలుక - మొదటి వేలుపు నాటిన ముద్దు మొలక"

అయిన రాజనందిని ఎంతటి అపురూప సౌందర్యవతియో అందటి సుగుణవతి – త్యాగమతి. కవివర్ణనా చాతుర్యానికి ఈ ఘట్టం ఒక ప్రబల దుర్గం. నాల్గవ అధ్యాయం "సాక్షికము" లో ఆరవ అధ్యాయం "ఉపసంహారము" లో రెండు సీసపద్యాల కుంచెతో కవి చిత్రించిన "కత్తిపోట్లు" కావ్యేతివృత్తానికి ప్రాణం పోసినవి.

"సామ్రాజ్య ధిక్కారచర్య లారోపించు
కపట నాటక మొక్క కత్తిపోటు
ధనమున కాశించి ద్వార రక్షకనేత
మెత్తబారిన దొక్క కత్తిపోటు
విజయగర్వముతోడ విర్రవీగెడి వైరి
కటు భాషణము లొక్క కత్తిపోటు
రకరకంబుల బాధలకు తావలంబైన
కారవాసంబొక్క కత్తిపోటు
ఇన్ని కత్తిపోట్ల కిన్నాళ్ళు సైపంగ
చాటు కత్తిపోటు చేటు తెచ్చె,
వెన్ను జూచుగాని వెన్నును చూపని
విజయచంద్రునకును వెన్నుపోటు".

విజయచంద్రుని వీరమరణం ఎంత హృదయ విదారకంగా చిత్రించాడో రాజనందిని ప్రతీకార వాంఛను కూడా అంత వీరోచితంగా అభివర్ణించాడు కవి.

"సామ్రాజ్య వైరుధ్య శక్తులన్ మిష , పోరు
కల్పించినందుకీ కత్తిపోటు
ధనలోభమును జూపి ద్వార రక్షక పాపి
కవ్వించినందుకా కత్తిపోటు
చెరసాల నిదురించు నరనాథు గికురించి
కడతేర్చినందుకీ కత్తిపోటు
పతిదేవు భగవంతు గతి గొల్చు సతి నిల్లు
కామించినందుకా కత్తిపోటు
నాల్గు కత్తిపోట్లు, నాల్గు నేరాలకు

ముట్టచెప్ప నాదు మ్రొక్కుతీరే "
నను చు కత్తిపోట్ల నామెచూపగ ప్రజ
జయము రాణీ! జయము! జయమనంగ.

ఈ "కత్తిపోట్ల నాటకం" కవి పరిశీలనా దక్షతకు కథాకథనా ప్రతిభకు చెక్కుచెదరని యధార్థం. ఇందులోని ప్రతి కత్తిపోటు - ముఖ్యంగా రెండు "చాటు కత్తిపోట్లు" చిందించిన రక్తధారలు విషాదాంత జలధిలో విలీనమై పోతున్నవి.

"పులుపులుముకొనెను రత్నము
మలినాత్ముని దుష్ట దృష్టి మఱలించుటకై,
బలిదాన యజ్ఞ ఫలమున
పులుగడిగిన రత్నమగుచు పాలు పెసలారెన్".

నిజంగా ఈకందం ఈ కావ్యానికి డెందం. "మాన సంరక్షనార్థం" మానవతి, రాశీభూతధృతియైన "రాజనందిని" చేసిన త్యాగం రసాత్మకమైంది ఈ కావ్యంలో.

పోతన, జాషువా, కరుణశ్రీవంటి పద్య శిల్పాచార్యుల ప్రభావం ఈ కవిమీద కన్పిస్తున్నా, సజీవమైన, స్వతంత్రమైన పద్య రచనాశక్తి ఆయనకున్నట్లు ఈ కావ్యం నిరూపిస్తున్నది. శ్రీ వేంకటేశ్వరరావు గారు ప్రారంభించిన ఈ పద్య కావ్యరచనా యజ్ఞం నిర్విరామంగా కొనసాగాలని ఆశిస్తున్నాను. "పాతకొత్తల మేలికలయిక"కు, ప్రయోజనాత్మక ప్రగతిశీల కళాసృష్టికి, ఆయన రచనలు దోహదం చేయగలవని విశ్వసిస్తున్నాను. స్థాలీపులాకన్యాయంగా నేను చేసిన కావ్యపరిచయాన్ని ఇంతటితో ముగిస్తూ మీరే కావ్యం స్వయంగా చదివి ఆనందించవలసిందిగా కోరుతున్నాను.



# మారుతున్న గ్రామీణ జీవితం

మార్పు ప్రగతికి ప్రాణవాయువు. నిజానికి తరతరాలుగా, యుగయుగాలుగా, మానవ సమాజం సాధించిన అభ్యుదయానికి కొలతబద్ద మార్పు. మార్పురథం మీద, పరిణామ పథం మీద ఒకనాటి రాతియుగం ఈనాటి రాకెట్టు యుగానికి చేరవచ్చింది. మార్పు అనేమహాశక్తి తరంగాల మీద మానవజీవితం సాగిపోతున్నది. అయితేఈ మార్పు అన్ని దేశాల్లో, అన్ని కాలాల్లో, ఒకే పరిణామంలో, ఒకే పద్ధతిలో జరగటం లేదని చరిత్ర చాటుతున్నది. మన దేశంలో ఈ మార్పు స్వాతంత్ర్యానంతరం బహుముఖంగా జరుగుతున్నది. ప్రభుత్వ విధానాల ద్వార, పంచవర్షప్రణాళికల ద్వార, రకరకాల పథకాల ద్వార, ప్రత్యేక కార్యక్రమాల ద్వార ప్రజాజీవితంలో ప్రగతి శీలకమైన మార్పులు తీసుకరావడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

భారతదేశం పల్లెల్లో నివసిస్తున్నది. ఇది సకలజన విదితమైన సత్యం. ప్రపంచంలోని గ్రామీణ జనాభాలో సుమారు 50శాతం ఇండియా, చైనా దేశాల గ్రామీణ జనాభాయే. అందుచేతమన జాతి జీవితంలో మార్పు రావాలంటే గ్రామీణ జీవితంలో మార్పు రావాలి. ఇది నిర్వివాదాంశం. సంతోషకరమైన విషయం ఏమిటంటే నూటికి 80 శాతం ప్రజలు నివసిస్తున్న గ్రామ ప్రాంతాలను అభివృద్ధి చేయాలనే విషయంలో ప్రభుత్వమూ, ప్రజలూ దృఢ సంకల్పంతో కృషి చేస్తున్నారు.

గ్రామీణ జీవితాన్ని, పట్టణ జీవిత స్థాయికి తీసుకురావటం మన ప్రగతి ప్రస్థాన ప్రధాన ఆశయాలలో ఒకటి. ప్రకృతి శోభావిలసితమైన పల్లె జీవితం ప్రగతి శోభా పులకితం చేయడం మార్పు లక్ష్యాలలో ముఖ్యమైనది. మారుతున్న మన గ్రామీణ జీవితాన్ని ఒక సారి దర్శిద్దాం - పరిశీలిద్దాం.

మార్పు బహిర్ముఖంగా, అంతర్ముఖంగా రెండు విధాలుగా జరుగుతుంది. భౌతికమైన మార్పు ఎంత అవసరమో, బౌద్ధికమైన మార్పు అంతకంటే ఎక్కువ అవసరము. అయితే గ్రామీణ జీవితంలో నేడు బయటికి కనిపించే మార్పు నిజానికి గ్రామ ప్రజలాలోచన సరళిలో, వైఖరిలో వస్తున్న మార్పుకు ప్రతిబింబం. అలాగే, గ్రామ ప్రజల ఆలోచన వైఖరులలో వస్తున్న మార్పు ఆధునిక సమాజంలో అత్యంత వేగంగా కలుగుతున్న శాస్త్ర సాంకేతక వికాసానికి ప్రతిస్పందనగా మనం గుర్తించాలి.

పల్లెజీవితంలో వస్తున్న మార్పుకు పల్లెసీమల భౌతిక స్వరూపం

(Physical Scinario) అద్దం పడుతున్నది. పల్లెల బాహ్యరూపం పరిశీలిస్తే ఎంతో ఆసక్తి దాయకంగా ఉంటుంది. శతాబ్దాలుగా కరుడుగట్టుకపోయిన నిర్బల నిస్సహాయ గ్రామీణ జీవితంలో కలిగిన విప్లవాత్మకమైన మార్పులకు చిహ్నలేమిటి? అదుగో! ప్రజాస్వామ్యనిలయంగా, చైతన్యాలయంగా రూపొందిన గ్రామ పంచాయితి, క్రొత్తగా కట్టిన భవనంలో బడి, వీధి వీధిలో విద్యుద్దీపాలు, వాడవాడల్లో మురికిని కడిగే కాలువలు, బలహీన వర్గాల నూతన గృహ సముదాయాలు, టకటకా భూమి దున్నే ట్రాక్టర్లు, చకచకా నీరు చిమ్మే మోటార్లు, తీరైన రసాయనిక ఎరువులు, మేలిరకపు విత్తనాలు, తగిన దిగుబడినిచ్చే పంటచేలు, ఉద్యోగాలు పెంచే పరిశ్రమలు, శ్రమ తగ్గించే యంత్రాలు, అప్పు ఇచ్చే బ్యాంకులు, ఆప్యాయంగా వచ్చిపోయే బస్సులు, వర్తమానాలు, వార్తలు అందించే పోస్టాఫీసులు, టెలీఫోన్లు, స్త్రీ శక్తి చాటే మహిళామండలులు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, రక్షిత మంచినీటి చలివేంద్రాలు - ఇవన్నీ గ్రామ సీమల్లో మనకు స్వాగతం పలికే క్రాంతి తోరణాలు. అడుగడుగున మార్పు వెలిగిస్తున్న ఆనందదీపాలు.

గ్రామీణ జీవితాన్ని చీకటి కూపంలోకి నెట్టినది అవిద్య. విద్య లేకపోతే విజ్ఞానం లేదు. విజ్ఞానం లేకపోతే మనకు ఎన్ని అవకాశాలున్నా ఉపయోగించుకొనే ఉపజ్ఞత ఉండదు. అందుచేత బాలబాలికలందరికీ తప్పని సరిగా ప్రాథమికవిద్యాగంధం అందించాలని ప్రభుత్వం చట్టరీత్యా ప్రయత్నిస్తున్నది. బలహీన వర్గాలవారి అభాగ్యులైన పిల్లల భావి సౌభాగ్యానికి విద్య ప్రధాన సాధనంగా ఉపకరిస్తున్నది. పల్లెల్లో ఈనాడు చెట్టు చెట్టుపై పక్షుల కిలకిలారావాలతో పాటు, ప్రతి ఇంటిలో పసివారి పాఠ్య పఠనా రావాలు కూడా వీనుల విందుగా వినిపిస్తున్నాయి. గుడిలో దైవభక్తి దీపంతో పాటు పల్లె బడిలో విద్యానురక్తి దీపం కూడా వెలుగుతున్నది. సాధారణ విద్య, వయోజన విద్య విజృంభిస్తుంటే నిరక్షరాస్యత వెనుదిరిగిపోతున్నది. అక్షరాభ్యాసం కోసం కూడ ఆమడల దూరం అర్భకులు వెళ్లవలసివచ్చిన ఒకనాటి దయనీయ స్థితి పోయి, పుట్టిన ఊరిలోనే లేక ప్రక్క ఊరులో హైస్కూలు విద్య కొన్ని సందర్భాలలో కాలేజీ విద్య కూడా అభ్యసించడానికి అనువైన పరిస్థితులు ఏర్పడ్డాయి. అలా విద్యతో పాటు వైద్యసౌకర్యాలు కూడ ఆరోగ్య కేంద్రాల ద్వారా, అనవ సంచాల వైద్య సిబ్బందిద్వారా ఆబాలగోపాలానికి అందుతున్నాయి.

గోచీ పెట్టుకొని, గొంగళి వేసుకొని గొర్లనో, గొడ్లనో కాసుకొనే నిరుపేద కూడా నేడు సరికొత్త జీవితాన్ని ఎలుగెత్తి పిలుస్తున్నాడు. ఎండలో ఎండి వానలో

సౌభాగ్య సంగీతం, సంతోష దరహాసం పండించేది నేనంటే నేనని విద్యుత్తంత్రులు, భూగర్భ జల తరంగాలు పోటీ పడుతూ మార్పు గీతాలు పాడుతున్నాయి.

పేద వర్గాల వారికి సముచిత గృహనిర్మాణ పథకాలు, పనికి ఆహారం పథకం క్రింద చేపట్టిన ప్రత్యేక నిర్మాణ కార్యక్రమాలు, పల్లె జీవితంలో గుణాత్మకమైన మార్పు తెస్తున్నవి. వెట్టి చాకిరీ నిర్మూలనం, కనీస వేతన చట్టాలు, ఊరూరికి బస్సు పథకం, చెట్ల పెంపకం, నిత్యావసరవస్తువులు సరఫరా చేసే సహకారమార్కెట్లు, చౌక దుకాణాలు, పాలశీతలీకరణ కేంద్రాల ద్వార పాడి పశువుల అభివృద్ధి, మేలిరకపు కోళ్ల గొర్రెల పెంపకం, ఆధునాతన వ్యవసాయ పద్ధతులు, మొదలైన మార్పులు గ్రామీణ జీవితాన్ని గణనీయమైన అభివృద్ధి స్థాయికి చేర్చినవి.

పల్లె స్త్రీలు ఆర్థికంగా వెనకబడ్డా ఆలోచన పరంగా వారు అభ్యుదయ శీలురే. దేశ జనాభాలో సగం మంది మహిళలే. వారు ప్రగతి పథంలో పయనిస్తే తప్ప జాతి జీవనంలో రావలసిన మార్పు రాజాలదు. పల్లె స్త్రీల మనుగడలో ఆచారవ్యవహారాలలో ఆరోగ్యకరమైన మార్పులు వస్తున్నవి. ఊరూరికి మహిళామండలులు ఏర్పడుతున్నాయి. అవి స్త్రీ సమగ్ర సంక్షేమానికి, సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి కంచుకోటల్లాగ, తయారవుతున్నాయి. స్త్రీ కేవలం వంటింటి కుందేలు కాదని పట్టణ స్త్రీల కంటే ఎక్కువగా పల్లె స్త్రీలే నిరూపిస్తున్నారు. పురుషులతో పాటు విద్య, వృత్తి విద్యాగంధం అందించి, స్త్రీలు కుటుంబ ఆదాయానికి తోడ్పడేటట్లు వారికి ధనసహాయం సంతరించి బాల్యవివాహాలు, వరకట్నాలు వంటి దురాచారాలకు దూరంగా వారిని పెంపుచేయడానికి ప్రబల ప్రయత్నాలు జరగుతున్నాయి. విద్యుచ్ఛక్తి, రక్షిత మంచినీటి సరఫరా, పిండి, బియ్యం మిల్లులు మొదలైనవి గ్రామ ప్రాంతాలలో స్త్రీల జీవిత సుఖానికి వరప్రసాదంగా వర్థిల్లుతున్నాయి. కుటుంబనియంత్రణ స్త్రీ జన్మ హక్కు పిల్లల కోడియైపోయే తల్లికి జీవితం ఒక పెంటదిబ్బ అయిపోతుంది. అందుకే సంసార సుఖం, వ్యక్తిత్వ వికాసం, సాంఘిక సమాన ప్రతిపత్తి ఆర్థిక స్వాతంత్ర్యం స్త్రీకి సంతరించాలంటే పరిమిత కుటుంబ వరం స్త్రీకి ప్రసాదించవలసి ఉన్నది. అందుకే " ఇద్దరు పిల్లల కంటే ఎక్కువ నేను కనను, ఈ దీక్షను భంగం చేసే హితం నేను వినను" అంటూ స్త్రీ పోరాడవలసి ఉన్నది. అయితే ప్రగతిశీలమైన పరిమితకుటుంబ విషయంలో సాధిస్తున్న మార్పు చాల పరిమితంగానే ఉన్నది. ఈ రంగంలో మార్పును మరింత వేగంగా

నాని వరదలో కొట్టుకుపోయి, బురదలో ఇరుక్కుపోయి యమయాతనలు పడ్డ బడుగు బ్రతుకులు నేడు గుండె ధైర్యంతో నిలబడి, ప్రభుత్వాదరణల గొడుగు పట్టుకొని, క్రొత్త అవకాశాల ఇల్లు కట్టుకుని సుఖజీవితోన్ముఖుడై సాగిపోతున్నాడు. ఒరులకు ఊడిగం చేసినవాడు నేడు స్వయం ఉపాధి కల్పించుకుంటున్నాడు. గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నవారు ఇప్పుడు ఉత్పాదన రంగంలో వ్రేళ్లు తన్నుకుంటున్నారు. వడ్డీ వ్యాపారస్థుల వైకుంఠపాళిలో చితికిపోయిన పేదబ్రతుకులు, ప్రభుత్వ బ్యాంకుల ప్రసన్న దృక్కుల్లో ప్రఫుల్లమౌతున్నాయి. ఒక వైపు సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థలు, నమరొకవైపు హరిజన గిరిజన పేదవర్గాల ఆర్థిక సహాయ సంస్థలు గ్రామీణ ప్రాంతాల లోని కష్ట జీవులను, దరిద్ర రేఖల దాటించడానికి ధన సహాయం చేస్తున్నాయి.

ఈనాడు కుగ్రామాలలో ఎటు చూచినా మార్పుమధుమాసం వెల్లి విరుస్తున్నది. మ్రోడుబారిన జీవిత వృక్షాలపై ఆశాసుమాలు హసిస్తున్నవి. బీటువారిన జీవన క్షేత్రాలలో నవచైతన్య శోభ పరిమళిస్తున్నది. పల్లెటూళ్లు పల్లవిగా ప్రగతి కోకిల సుగతి గీతాలు పాడుతున్నది.

దుక్కి దున్నే మోట లాగే బక్క ఎడ్లమొర విన్నా వోయేమో అన్నట్లు ట్రాక్టర్లు,ఆయిల్ ఇంజన్లు, కరంటు మోటార్లు పల్లెపొలాలలో అవతరించాయి. క్రొత్త చెరువులు, కుంటలు, బావులు, గొట్టపుబావులు, నీటిపాటలు పాడే జీవనదృశ్యాలు, పల్లెల్ని అలంకరిస్తున్నాయి. పాతాళపు లోతులలో దాగిన అఖండ జలధారలను రిగ్గులు బయటికి తీస్తుంటే, ప్రజాశక్తి భాగీరధులు పల్లె పల్లెలో గంగావతరణ చేయిస్తున్నట్లు అనిపిస్తుంది. ఎరువుల్లేక ఎద్దుల్లేక, విత్తంలేక, విత్తనంలేక రైతులు దిగాలు పడిపోయే, పొలాలు, పడావా పడిపోయే విషమపరిస్థితులు పల్లె జీవితం నుంచి క్రమంగా నిష్క్రమిస్తున్నవి. వ్యవసాయ ఉపకరణాల గిడ్డంగులు, సహకార వాణిజ్యబ్యాంకులు రైతుల అవసరాలు తీర్చడానికి స్నేహ హస్తాలు చాస్తున్నవి. ప్రయోజనకరమైన పని చేపట్టే వానికి అడగగానే అప్పులిచ్చే ఆర్థిక సంస్థలు గ్రామీణ జీవితంలో మార్పురథాలు లాగుతున్నవి.

విద్యుచ్ఛక్తి గ్రామీణ జీవితానికి క్రొత్త వెలుగు ప్రసాదిస్తున్నది. గ్రామీణ విద్యుదీకరణ పథకాల వలన, వీధి వీధిలో ఇంటింటిలో కాంతిరేఖలు వెలుస్తున్నవి. చీకటి కంకటి మీద సొమ్మసిల్లి పోయిన హరిజన గిరిజన వాడలకు గ్రామ పంచాయితీలు వెలుగు సేచనము కలిగిస్తున్నవి. పల్లె సీమల్లో నేడు

నాని వరదలో కొట్టుకుపోయి, బురదలో ఇరుక్కుపోయి యమయాతనలు పడ్డ బడుగు బ్రతుకులు నేడు గుండె ధైర్యంతో నిలబడి, ప్రభుత్వాదరణల గొడుగు పట్టుకొని, క్రొత్త అవకాశాల ఇల్లు కట్టుకుని సుఖజీవితోన్ముఖుడై సాగిపోతున్నాడు. ఒరులకు ఊడిగం చేసినవాడు నేడు స్వయం ఉపాధి కల్పించుకుంటున్నాడు. గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నవారు ఇప్పుడు ఉత్పాదన రంగంలో వ్రేళ్లు తన్నుకుంటున్నారు. వడ్డీ వ్యాపారస్థుల వైకుంఠపాళిలో చితికిపోయిన పేదబ్రతుకులు, ప్రభుత్వ బ్యాంకుల ప్రసన్న దృక్కుల్లో ప్రపుల్లమౌతున్నాయి. ఒక వైపు సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థలు, నమరొకవైపు హరిజన గిరిజన పేదవర్గాల ఆర్థిక సహాయ సంస్థలు గ్రామీణ ప్రాంతాల లోని కష్ట జీవులను, దరిద్ర రేఖల దాటించడానికి ధన సహాయం చేస్తున్నాయి.

ఈనాడు కుగ్రామాలలో ఎటు చూచినా మార్పుమధుమాసం వెల్లి విరుస్తున్నది. మోడుబారిన జీవిత వృక్షాలపై ఆశాసుమాలు హపిస్తున్నవి. బీటువారిన జీవన క్షేత్రాలలో నవచైతన్య శోభ పరిమళిస్తున్నది. పల్లెటూళ్లు పల్లవిగా ప్రగతి కోకిల సుగతి గీతాలు పాడుతున్నది.

దుక్కి దున్నే మోట లాగే బక్క ఎడ్లమొర విన్నా వోయేమో అన్నట్లు ట్రాక్టర్లు,ఆయిల్ ఇంజన్లు, కరంటు మోటార్లు పల్లెపాలాలలో అవతరించాయి. క్రొత్త చెరువులు, కుంటలు, బావులు, గొట్టపుబావులు, నీటిపాటలు పాడే జీవనదృశ్యాలు, పల్లెల్ని అలంకరిస్తున్నాయి. పాతాళపు లోతులలో దాగిన అఖండ జలధారలను రిగ్గులు బయటికి తీస్తుంటే, ప్రజాశక్తి భాగీరథులు పల్లె పల్లెలో గంగావతరణ చేయిస్తున్నట్లు అనిపిస్తుంది. ఎరువుల్లేక ఎద్దుల్లేక, విత్తంలేక, విత్తనంలేక రైతులు దిగాలు పడిపోయే, పొలాలు, పడావా పడిపోయే విషమపరిస్థితులు పల్లె జీవితం నుంచి క్రమంగా నిష్క్రమిస్తున్నవి. వ్యవసాయ ఉపకరణాల గిడ్డంగులు, సహకార వాణిజ్యబ్యాంకులు రైతుల అవసరాలు తీర్చడానికి స్నేహ హస్తాలు చాస్తున్నవి. ప్రయోజనకరమైన పని చేపట్టే తివానికి అడగగానే అప్పులిచ్చే ఆర్థిక సంస్థలు గ్రామీణ జీవితంలో మార్పురథ ు లాగుతున్నవి.

విద్యుచ్ఛక్తి గ్రామీణ జీవితానికి క్రొత్త వెలుగు ప్రసాదిస్తున్నది. గ్రామీణ విద్యుదీకరణ పథకాల వలన, వీధి వీధిలో ఇంటింటిలో కాంతిరేఖలు వెలుస్తున్నవి. చీకటి కంకటి మీద సొమ్మసిల్లి పోయిన హరిజన గిరిజన వాడలకు గ్రామ పంచాయితీలు వెలుగు సేచనము కలిగిస్తున్నవి. పల్లె సీమల్లో నేడు

సౌభాగ్య సంగీతం, సంతోష దరహాసం పండించేది నేనంటే నేనని విద్యుత్తంత్రులు, భూగర్భ జల తరంగాలు పోటీ పడుతూ మార్పు గీతాలు పాడుతున్నాయి.

పేద వర్గాల వారికి సముచిత గ్రహనిర్మాణ పథకాలు, పనికి ఆహారం పథకం క్రింద చేపట్టిన ప్రత్యేక నిర్మాణ కార్యక్రమాలు, పల్లె జీవితంలో గుణాత్మకమైన మార్పు తెస్తున్నవి. వెట్టి చాకిరీ నిర్మూలనం, కనీస వేతన చట్టాలు, ఊరూరికి బస్సు పథకం, చెట్ల పెంపకం, నిత్యావసరవస్తువులు సరఫరా చేసే సహకారమార్కెట్లు, చౌక దుకాణాలు, పాలశీతలీకరణ కేంద్రాల ద్వార పాడి పశువుల అభివృద్ధి, మేలిరకపు కోళ్ల గొర్రెల పెంపకం, ఆధునాతన వ్యవసాయ పద్ధతులు, మొదలైన మార్పులు గ్రామీణ జీవితాన్ని గణనీయమైన అభివృద్ధి స్థాయికి చేర్చినవి.

పల్లె స్త్రీలు ఆర్థికంగా వెనకబడ్డా ఆలోచన పరంగా వారు అభ్యుదయ శీలురే. దేశ జనాభాలో సగం మంది మహిళలే. వారు ప్రగతి పథంలో పయనిస్తే తప్ప జాతి జీవనంలో రావలసిన మార్పు రాజాలదు. పల్లె స్త్రీల మనుగడలో ఆచారవ్యవహారాలలో ఆరోగ్యకరమైన మార్పులు వస్తున్నవి. ఊరూరికి మహిళామండలులు ఏర్పడుతున్నాయి. అవి స్త్రీ సమగ్ర సంక్షేమానికి, సంపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి కంచుకోటల్లాగ, తయారవుతున్నాయి. స్త్రీ కేవలం వంటింటి కుందేలు కాదని పట్టణ స్త్రీల కంటే ఎక్కువుగా పల్లె స్త్రీలే నిరూపిస్తున్నారు. పురుషులతో పాటు విద్య, వృత్తి విద్యాగంధం అందించి, స్త్రీలు కుటుంబ ఆదాయానికి తోడ్పడేటట్లు వారికి ధనసహాయం సంతరించి బాల్యవివాహాలు, వరకట్నాలు వంటి దురాచారాలకు దూరంగా వారిని పెంపుచేయడానికి ప్రబల ప్రయత్నాలు జరగుతున్నాయి. విద్యుచ్ఛక్తి, రక్షిత మంచినీటి సరఫరా, పిండి, బియ్యం మిల్లులు మొదలైనవి గ్రామ ప్రాంతాలలో స్త్రీల జీవిత సుఖానికి వరప్రసాదంగా వర్థిల్లుతున్నాయి. కుటుంబనియంత్రణం స్త్రీ జన్మ హక్కు. పిల్లల కోడియైపోయే తల్లికి జీవితం ఒక పెంటదిబ్బ అయిపోతుంది. అందుకే సంసార సుఖం, వ్యక్తిత్వ వికాసం, సాంఘిక సమాన ప్రతిపత్తి ఆర్థిక స్వాతంత్ర్యం స్త్రీకి సంతరించాలంటే పరిమిత కుటుంబ వరం స్త్రీకి ప్రసాదించవలసి ఉన్నది. అందుకే " ఇద్దరు పిల్లల కంటే ఎక్కువ నేను కనను, ఈ దీక్షను భంగం చేసే హితం నేను వినను" అంటూ స్త్రీ పోరాడవలసి ఉన్నది. అయితే ప్రగతిశీలమైన పరిమితకుటుంబ విషయంలో సాధిస్తున్న మార్పు చాల పరిమితంగానే ఉన్నది. ఈ రంగంలో మార్పును మరింత వేగంగా

జరిగే ఆశాకిరణాలు మాత్రం కనిపిస్తున్నవి.

మనం మారాలి - మన మనస్తత్వం మారాలి. మన ఉపాధి పద్ధతులు మారాలి. మన కులవ్యవస్థ, సంఘ వ్యవస్థ మారాలి అనే హేల గ్రామీణ ప్రజావాణి నేడు వినిపిస్తున్నది. అసమానతలు - దోపిడీలు తొలగిపోవాలి. దురాచారాలు ఏ రూపంలో ఉన్నా అంతరించాలి. సమతాసమైక్యతా వేదికపై సకల జన కళ్యాణ లక్ష్మి అవతరించాలి అనే సామాజిక స్పృహ, అభ్యుదయ భావుకత అమాయకులైన పల్లె ప్రజల గుండెల్లో పరవళ్ళు త్రొక్కుతున్నవి. అభ్యుదయనిరోధక శక్తులు, సాధన సంపత్తి లోపం, వారి ఉత్సాహాన్ని, ఉద్వేగాన్ని కొంతవరకు అరికట్టుతున్నా, పల్లె జీవితాన్ని సర్వాంగ సుందరంగా, పరమానంద భరితంగా తీర్చిదిద్దుకోవాలనే వజ్రసంకల్పం వారిలో స్పష్టంగా కనిపిస్తున్నది. నిత్యచైతన్యంతో, నిర్మాణ దీక్షతో పల్లె ప్రజలు సాధిస్తున్న ప్రగతి విప్లవం గ్రామీణ జీవితాన్ని ఆదర్శ శిఖరాలకు చేరుస్తుందని ఆశిద్దాం.



# ఆత్మశ్రుతి

## (బాపురెడ్డి గారు తమ కృతులకు శ్రుతి చేసిన తొలి పలుకుల్లో చిలికిన కొన్ని భావగంధాలు)

## 1

............ప్రకృతి శాస్త్రాలు, విజ్ఞాన శాఖలు కొన్ని కొన్ని నిర్దిష్టమైన సత్యాలను ఆధారంగా చేసుకొని తమ తమ పరిధిలో వస్తుతత్వాన్ని పరిశీలించి ఏదో ఒక ప్రయోజనాత్మక ఫలితాన్ని సాధిస్తున్నాయి. కాని, కవిత్వం ఒక వస్తువులోని ఏదో ఒక సత్యానికి కట్టుబడి సంతృప్తి చెందదు. దేశకాలానుగుణంగా భౌతిక ప్రయోజనానుకూలంగా ఒకే వస్తువులో అనేకానేక సత్య దర్శనం చేయగల మహాశక్తి కవిత.

పంచేంద్రియానుభవయోగ్యమయిన సృష్టిని పరిశీలించి, విశ్లేషించి, ప్రయోజనాత్మక సత్యాలను ప్రబుద్ధం చేసేవి లోకంలోని చదువులు, శాస్త్రాలు. కాని, కవిత భౌతిక సృష్టిగతమైన భావసృష్టి చేస్తుంది. ఉన్నదానిలో ఉన్నదనుకున్న దానిలో లేనిదాన్నీ, లేనిదానిలో లేదనుకున్న దానిలో ఉన్నదాన్నీ దర్శించి, మన అనుభూతికి అందిస్తుంది కవిత. కొంచెం గంభీరంగా చూస్తే ప్రతి వస్తువు కొన్ని సత్యాలకు నిలయంగా భాసిస్తుంది. ఒక వస్తువులో మనమింతవరకు చూడని ఒక సత్యాన్ని చూడగలిగినప్పుడు కలిగే విచిత్రానుభూతి రసానందం - రసానుభూతి. అందమయిన అమ్మాయి మోములో దాగిన చంద్రబింబాన్ని చూపించిన ఆదికవి అలాంటి అస్పృష్ట సత్యాన్ని ఆనందానుభూతిని పంచాడు. రహస్యమేమిటంటే ప్రతివస్తువు లోనూ ఏవో కొన్ని మరికొన్ని, ఇంకా కొన్ని సత్యాలు గర్భితమై ఉన్నాయి. ఒక కవి ఎన్నెన్ని క్రొత్త గుప్త సత్యాలపై గల తెర తీయగలిగాడన్నదే ఆ కవి ప్రతిభా పాండిత్య విశేషాలకు ప్రథమ ప్రబల తార్కాణం.

అయితే ఏ వస్తువులో ఎన్ని సత్యాలు నిక్షిప్తమై ఉన్నాయన్నదే ఇక్కడ కీలకమైన ప్రశ్న. అందుకు నా వినమ్ర సమాధానమే ఈ రచన. సత్యాలు అనంతం- ప్రతి వస్తువులో దాగివున్న సత్యాలు అనంతం. ప్రతివస్తువూ దేశ కాలాల లీలా రూపమే. అందుకే దేశ కాలాలను నిర్వచించే ఆ అనంతత్వమే దేశ కాల బద్ధమయిన ప్రతివస్తువునూ పరివేష్టించింది.

భౌతిక సత్యాలు, భావసత్యాలు, కల్పనాసత్యాలు, అనుభూతి సత్యాలు- అన్ని కవితా సాహిత్య సుందర బృందావనంలో విరబూసిన అగణితభావకోరకాలే. సత్యాలు రసపోషకాలు; సత్యాలు అనుభూతి హేతువులు; సత్యాలు ఇంద్రియానంద ప్రేరకాలు. సత్యాన్వేషణయే సత్య దర్శనమే, సత్యావిష్కరణయే సాహిత్య పరమావధి.

సత్యాలు అనంతమన్న భావస్ఫూర్తితోనే దైవత్వ మానవత్వాల ఏకత్వ రూపదర్శనం చేశాను. దైవం సత్యస్వరూపి, సత్యం అనంతరూపి. అనంత సత్యారాధనమే ఈ రసానందకావ్యం.

కవితా వస్తువులు, కవితా సత్యాలు అనంతం. నాపరిమిత జీవ చైతన్యానికీ, భావచైతన్యానికి అందిన కొన్ని సత్య చిత్రాలను, రసానుభూతులను మీ కందిస్తున్నాను. అవి ఎందరి దృక్పథాలను సకల జనానంద సంకల్పోన్ముఖుల్ని చేయగలిగితే అంతటి ఆత్మానందభరితుణ్ణవుతాను.

సర్వ సమత సత్యవాదం నాది. సాహిత్య సామ్యవాదం నాది. హేతువాద వినాదాలను ఇతర శాస్త్రాలకు వదిలేసి, హృదయ వాద నాదాలను కదిలించాలనే సంకల్పం నాది. ప్రభాదృష్టి నాది; ప్రగతి దృష్టి నాది. ........................

*(అనంత సత్యాలు 1986, రెండవ ముద్రణ)*

## 2

............"అనంత సత్యాలు" నా కవితా తత్వానికి నిర్వచనం అయితే, నాద వేదాలు " నా జీవతత్వానికి ప్రవచనంగా నేను భావిస్తున్నాను.

సంగీత నాదాలు సాహిత్య వేదాలు సమైక్యం చెందిన సరస సంగమ తీర్థం ఈ కావ్యం. ఆనందరాగ డోలికలపై ఊగే సత్య సాహిత్య వాణి ఈ అక్షర వేణి. శృంగార రక్తితో, దేశ భక్తితో, సృజనాత్మక శక్తితో నాకు నేనే భావవీణనై, జీవన శ్రుతినై పాడుకున్న, అమ్లాన అనంత వసంత గీతా లిపి.

అంతర్ముఖుడనై, యోగమార్గగతుడనై, ఆత్మజ్ఞాన దర్పణంలో దర్శించిన భావసత్యాలు, బహిర్ముఖుడనై, ప్రయోగ మార్గానువర్తినై, పదార్థ విజ్ఞాన ముకురంలో తిలకించిన భౌతికసత్యాలు మేళవించిన విశ్వవాద్యబృంద గీతానంద బృందావనం ఇది.

ఈ "నాదవేదాలు" త్రిముఖాత్మకంగా ఆవిష్కృతమైనవి - ప్రణయ నాదం, ప్రగతి నాదం; ప్రణవ నాదం; త్రయీనాద, అంతర్వేద సారం ఈ నాకవితా సారం. ప్రేయసీ ప్రియుల రాగబంధం ప్రణయ నాదం; మానవాభ్యుదయ ప్రబంధం ప్రగతి నాదం. ఆత్మానంద ఛందం ప్రణవనాదం. ఇవి ఏకైక సత్యోన్ముఖంగా సాగే అనంత భావ కిరణాశ్వ సమాకర్ష శివ సుందర ఆనంద స్యందనం ఈ కావ్యం. సకామ ప్రేమ, సామాజిక ప్రేమ, దైవ ప్రేమ ప్రేరేపించిన పవిత్ర జీవిత యాత్రానుభూతి పుటి ఈ నాదవేద కావ్య సంపుటి.

మనిషికీ మనిషికీ మధ్య పేరుకున్న అసూయ, అసమానత, స్వార్థ సంకుచిత మనస్తత్వ తిమిరాలను తొలగించడానికి వెలిగించిన నవభావ స్నేహ గీతజ్యోతులివి. కనిపించే మనిషికి,కనిపించకపోయినా ఉన్నాడనిపించే దేవునికి మధ్య పంచేంద్రియానుభవయోగ్యమయిన ఇహలోకానంద దాయకమైన మైత్రీ భావన నెలకొల్పే సత్య కల్పనా సాహిత్యమిది. మనిషికీ దేవునికీ ఒకే మాతృభాష నేర్పే మహోజ్జ్వల భావభౌతిక వాద వేద మిది. సమతా సౌభాగ్యసంగీత వేదనాద మిది...........

*(1981 – నాదవేదాలు)*

## 3

.............. నృత్య గేయ రూపకాలు తెలుగు సాహిత్యంలో ఒక ప్రత్యేక ప్రక్రియగా విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్నాయి. అయితే సాంప్రదాయికమైన పురాణేతిహాస కథాంశాలే ప్రధానంగా ఆ గేయ నాటికలకు కవితా వస్తువులైనాయి. భారతీయ సాహిత్యంలో గురుదేవులు రవీంద్ర కవీంద్రులు గేయరూపక ప్రక్రియకు పునరుజ్జీవనం కల్పించిన పూజ్యపాదులు. ప్రతిభామయులైన కొందరు ఆధునిక తెలుగు కవులు ముఖ్యంగా కళాప్రపూర్ణులు డా. బోయి భీమన్న, డా. సి. నారాయణరెడ్డి సృజనాత్మక చారిత్రక జీవితేతివృత్తాలతో అనేక గేయ నాటికలు రచించి నృత్య గేయ నాటికా సాహిత్యంలో ఒక క్రొత్త మలుపు తీసు కొచ్చారు. నారాయణరెడ్డి గారి నవ్వనిపువ్వు, వెన్నెలవాడ, అజంతా సుందరి, వంటి సంగీత రుపకాలు, భీమన్నగారి పైరుపాట, మానవుని మరొక మజిలీ, చిత్రకళా ప్రదర్శన వంటి గేయ నాటికలు క్రొత్త పరిణామానికి మచ్చుతునకలు. విశ్వనాథ వారి 'కిన్నెరసాని' కూడా ఈ కాల్పనిక సంగీత రూపక సాహిత్య ప్రక్రియకు వన్నె పెట్టినది.

చారణ చక్రవర్తి వంటి గేయ రూపకాలు సంగీత సాహిత్యాల సమన్వయాన్ని సాధించి ఈ ప్రక్రియలో ప్రశంసనీయమైన క్రొత్త ఒరవడి దిద్దినది.

నేను తొలిసారి వ్రాసిన గేయ రూపకం 'రాకెట్టు రాయబారం'. అది 1960 ప్రాంతంలో ఆధునిక శాస్త్ర విజ్ఞాన విహాయన వీథుల్లో రెక్కలార్చిన ప్రగతి శీల భావంహగం. పూజ్యులు మల్లంపల్లి సోమశేఖర శర్మ వంటి విమర్శకుల మన్ననలందిన ఆ గేయనాటిక చరిత్రాత్మకమై సృజనాత్మకసాహిత్య కళాఖండంగా గుర్తింపబడి చరితార్థమైంది. ఆతర్వాత 1964 ప్రాంతంలో విశాఖపట్టణంలో మా మిత్రులు డా. డి. కృష్ణమూర్తి గారి ప్రోద్బలంతో "ఋతురాగం" అనే గేయ నాటిక వ్రాయడంతో గేయనాటికా రచనలో నాకూ ఒక స్థానం ఏర్పడింది. అప్పటి నుండ నేను అలవోకగా వ్రాసిన గేయ నాటికల్లో 'సాగర సౌధం', "భావి జీవులు", "చాచా నెహ్రు" "విజయ హేల" "ప్రజా విజయం" వంటివి కొన్ని బహుళ ప్రచారం చెందాయి. 1975లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల్లో 'సాగర సౌధం', ప్రదర్శించిన నాగార్జునసాగర్ లోని "గౌతమబాల విహార్" కళాకారులు ప్రశంసాపాత్రులైనారు. వారు ఆ నాటినుండి ఆ నాటికను భారతదేశమంతటా తెలుగువారి ఒక ఉత్తమ కళాఖండంగా ప్రదర్శిస్తూనే ఉన్నారు.

అట్లాగే "ఋతురాగం" డా. డి. కృష్ణమూర్తి (డిక్కి) గారి సంగీత నేతృత్వంలో తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర సాంస్కృతిక సంస్థ కేంద్రంగా దేశ విదేశ ప్రేక్షకుల సమక్షంలో ప్రదర్శింపబడి అంతర్జాతీయ కీర్తి నార్జించింది. ప్రఖ్యాత సంగీత సామ్రాజ్ఞి శోభారాణి ఆ నాటికలోని కొన్ని గీతాలు ఆలపించి దానికి ఒక క్రొత్త వెలుగు అందించారు. పాలగుమ్మి విశ్వనాథం, యం. చిత్తరంజన్, యం. నరసింహ మూర్తి వంటి విఖ్యాత సంగీత కళాకోవిదుల ప్రావీణ్య స్పర్శతో, ఆకాశవాణి, దూరదర్శిని వేదికలపై ఈ నాటికలు కొన్ని విప్లవాత్మక కళానుభూతి పండించాయి.

ఈ సంపుటిలో క్రొత్తగా చేర్చిన ఆరు గేయనాటికల్లో రెండు 'వచన గేయ నాటికలు' పిల్లలమ్రరితో ఇంటర్వ్యూ , చేతనాకేతనం - సంగీత ప్రధానమైనవి కాకపోయినా ప్రదర్శనాయోగ్యమైనవి. లయాత్మకమైన కళాత్మకమైన ఈ నాటికలు రూపక ప్రక్రియకు ఒక విశిష్టతను చేకూర్చగలవని ఆశిస్తున్నాను. ప్రయోగాత్మక ప్రయోజనాత్మకమైన ఈ నృత్య నాటిక లన్నీ డా. బోయి భీమన్న , డా. దాశరథి, డా. తంగిరాల వెంకటసుబ్బారావు,

డా. మంగళగిరి ప్రమీళాదేవి, డా. చేకూరి రామారావు, డా. తిరుమల శ్రీనివాసాచార్య వంటి సాహిత్య బంధువుల సాహిత్య విమర్శలకు తులనాత్మక, పరిశీలనాత్మక, పరిశోధనాత్మక సమీక్షలకు పాత్రమైనవి........

*( బాపురెడ్డి గేయ నాటికలు 1986 – మూడవ విస్తృత ముద్రణ)*

# 4

........... నేను ముప్ఫై ఏళ్లుగా వ్రాస్తున్న కవితల్లో మూడు ముఖ్యమైన భావధారలు గమనించాను. ఆలోచన శిఖరాలనుండి, అనుభూతులలోతుల్లో నుండి ప్రవహించే ఈ చైతన్య ధారలు నిజానికి ఏకైక సత్య సౌందర్య ప్రకటనాత్మకాలే. మనకు ఆగుపించే ప్రకృతినీ, పరిసరాలను, మనం అనుభవించే జీవితాన్ని మూడు రంగుల్లో చిత్రించుకుంటున్నట్లు, మూడు రంగాలుగా అన్వయించుకున్నట్లు నేను గ్రహించాను. అయితే మన భావనలన్నీ ప్రధానంగా ప్రణయోన్ముఖంగానో, ప్రగతి పరంగానో, ప్రణవాత్మకంగానో ప్రకటితమైతున్నవి. అయితే ఈ త్రివిధాలోచనలూ, త్రిముఖానుభూతులూ పరస్పర సామరస్య సమన్వయం కలిగిఉన్నప్పుడే సమగ్ర జీవితానందం సాధ్యమౌతుంది. ఆ సరస సమన్వయ సాధనమే సాహిత్యం, ముఖ్యంగా కవిత్వం అని నా విశ్వాసం.

ప్రణయ శీలత, ప్రగతిశీలత, ప్రణవశీలత దర్శించే సత్యం ఒకటే, ఆశించే ప్రయోజనం ఒకటే. స్త్రీ పురుషుల పరస్పర ప్రేమ, సమాజం లోని సాటి మనుషులపట్ల సానుభూతి, అందరినీ నడిపిస్తున్నదనుకుంటున్న దైవం పట్ల ఆరాధన, ఈ రాగత్రయాదర్శం జీవితానందమూ, ఇహపరసౌఖ్యమే కదా! అయితే ప్రణయరాగము, ప్రగతిరాగము కంటే మనిషిని ప్రభావితం చేసేది ప్రణవరాగం, కనిపించే మానవశక్తికీ కనుపించని దైవశక్తికీ మధ్య ఉండే సంబంధ బాంధవ్యాలను బట్టే మనిషి మనిషికీ మధ్య ఉండే భావబంధాలు సామాజిక సంబంధాలు రూపుదిద్దుకుంటాయి. మానవుడూ దైవం పరస్పర ప్రతిబింబాలే అన్న మహోన్నత భావచైత్యంలో నుంచి అద్వైత వాదం ఆవిర్భవించింది. అద్వైత భావావగాహన త్రికరణశుద్ధిగా జరిగితే మనిషికీ దేవునికీ మధ్యేకాక మనిషికీ మనిషికీ మధ్య ఉండే అడ్డు గోడలు కూడ తొలిగిపోతాయి. త్వమేవాహం, తత్వమసి, సోహం, అహం బ్రహ్మోస్మి వంటి వేదోపనిషత్ సూక్తులు సార్థకమౌతాయి. మనుషులందరూ సమానులే, ఒకరు మరొకరిని పీడించడ, దోచుకోవడం తనను తానే వంచించుకోవడమే అనే సత్యస్ఫూర్తి కలుగుతుంట అపుడు సమతా సమాజ స్ఫూర్తి, సకల జన కళ్యాణ దీప్తి సహజంగా కలుగుతుంది. అసమానత, అహంభావం, అశాంతి, హింస విధ్వంసలకు తావులేని ఐహిక

సుఖాన్వితమూ ఆత్మానందానుభూతి యుతమూ ఆయిన జీవితయాత్ర సాధ్యమవుతుంది................

*(1981 – శ్రీకార శిఖరం )*

## 5

...............శృంగారాన్ని బంగారంగా మూటగట్టుకుని కష్టాల గట్లను, కన్నీటి కాలువలను తరిస్తూ సౌందర్య సీమలవైపు సాగిపోయే బాటసారిని నేను. ఆధ్యాత్మిక స్పృహకు, సామాజిక స్పృహకు మధ్య ఆనంద క్రీడ శృంగారం. శృంగారకళ లేని జీవితం చుక్కలు లేని ఆకాశం. నా దేశ విదేశ పర్యటనలలో నేను చూచిన శృంగార సీమల ప్రసక్తి ఈ కావ్య శక్తి అయింది. వినోదాత్మక ప్రేమ సీమలలో విహరించే జీవాత్మల కళాత్మక చిత్రణమే ఈ " పంచబాణ సంచా".

సెక్సు నిత్యజీవిత సత్యం. దాన్ని పవిత్రమైన లింగ ప్రతీక శక్తిగా ఆరాధించే ఆదరించే సంప్రదాయం సంస్కారం భారతీయులది. స్త్రీ పురుషులలో కామ వాంఛ ప్రదీపకుడైన పంచబాణుని కామదేవతగా భావించిన జీవన తత్వం మనది. ఒక్క భారత దేశంలోనే కాదు,గ్రీకు రోమను వంటి ప్రాచీన నాగరికతా సంస్కృతులు కూడా మన్మధులు మానవ జీవితాలమీద కలిగించిన ప్రభావాన్ని పవిత్రమైన కళాతత్వ భావంతోనే గుర్తించి కీర్తించారు. జరా రుజా మరణాలను ప్రతిఘటించే ప్రాణశక్తిగానే విశ్వ సాహిత్యంలో శృంగార రస పోషణ జరిగింది. సౌందర్యాత్మకమూ, సృజనాత్మకమూ అయిన శృంగారానికి, సామాజిక పరమైన వ్యావహారిక పరమైన నీతికి అక్రమమైన ముడిపెట్టే ఆ రెంటినీ భంగపరచిన వింత తత్వం నుండి స్త్రీ పుంసయోగ శక్తిని రక్షించవలసిన అవసరం ఉంది. నీతి, ఉపకరణానికి సంబంధించింది కాదు, ఉపయోగపరమైంది. "కామ శక్తి" ఒక బలవత్తరమైన జీవానందోపకరణం. దాని అభివ్యక్తి మనం ఏర్పరుచుకున్న సామాజిక నైతిక విలువలను బట్టి ఉంటుంది. ఒక కామశక్తినే కాదు ఏ మానవ శక్తిని కూడా దురుపయోగం చేయటం అవినీతిగానే పరిగణించాలి. కత్తిని మనిషి కుత్తుక కోయడానికి ఉపయోగిస్తే, తప్పు కత్తిది కాదు శృంగారానికి, వ్యభిచారానికీ తేడా తెలియని సామాజిక నీతి ప్రమాదకరం. శృంగారం శృంగారంగానే ప్రణయ శక్తిగానే శోభిస్తే అది జీవిస్తుంది. వ్యభిచారం నశిస్తుంది. ...........

*(1989 – పంచబాణ సంచా )*

## 6

............... "పద్యం" అనగానే పాత చింతకాయి పచ్చడి అని ఈసడించేవారు 'గద్యకవితోద్యమ' మానస పుత్రులు. పద్యం పాదాలు విరగగొట్టటమే, గేయం గుండెను గాయపరచడమే, వచనకవితా వైశిష్ట్యమని ప్రకటించుకున్నారు కొందరు కవులు. పద్యాన్ని పరిహరించటమే పరిహసించటమే అభ్యుదయశీల మని అపోహపడ్డ అమాయకులెందరో! అయినా పద్యానికి వేయేళ్ల చరిత్ర ఉంది. భిన్న భిన్న భావాలను, చిత్ర చిత్ర శిల్పాలను, అనేకానేక ఛందాలను సంతరించుకున్న సజీవవేణి పద్యవాణి. పండిత పామరుల నాలుకలపై, పల్లెల పట్టణాల వేదికలపై అకాండలాస్యం చేస్తూనే ఉన్న అసమానశక్తి శైలూష పద్యం.

అందుకే గేయాన్ని శ్రవణపేయంగా, వచనకవితను నిసర్గలయాత్మకంగా పలికించిన నేను పద్యాన్ని కూడా హృద్యంగా పలికించాలనే ప్రయత్నిస్తూ వచ్చాను. ప్రణయ, ప్రగతి, ప్రణవోన్ముఖంగా సాగిపోయే నా భావధారలు - త్రయీనాదాలు నా పద్య గేయ గద్య కవితల్లో నిష్పక్షపాతంగా నినదిస్తూనే ఉన్నాయి. భావశక్తికి, రసాభివ్యక్తికి అడ్డు వచ్చేది ప్రతిభా పాండిత్యాల రాహిత్య మేకాని పద్యగేయాది ప్రక్రియలు కాదు. సృజనాత్మకత, కళాత్మకత అభ్యుదయ శీలత కవితకు గీటురాయి అవుతుంది. కాని ఛందోరూపము కాదు. పైగా, పద్యం తెలుగువారికి సంక్రమించిన ప్రత్యేకమయిన వారసత్వం. నిజానికి పద్యఛందస్సులో కొంత ప్రవేశం ఉన్నవారే గేయాన్ని, వచన కవితను శక్తిమంతంగా వ్యక్తీకరించగలరని నా విశ్వాసం. శ్రీ శ్రీ, బీమన్న, దాశరథి, శేషేంద్రశర్మ, కరుణశ్రీ, నారాయణరెడ్డి, వంటి ఆధునికులైన ప్రముఖ తెలుగు కవులందరు పద్య రచనా ప్రవీణులైనవారే. ...............

*(బాపు రెడ్డి పద్యకావ్యాలు 1986 – విస్తృత ముద్రణ)*

## 7

.............. కనిపించని దైవము ఉన్నాడని నమ్మినా నమ్మకపోయినా మానవులు పరస్పర ప్రేమభావంతో సుఖమయజీవితం గడపాలి, అనే మౌలికాదర్శాన్ని సిద్ధాంతాన్ని ఎవరూ కాదనలేరు. అలాగే స్త్రీ పురుష ప్రేమము మానవుని సామాజిక రాజకీయ ఆర్థిక జీవితానికి, ఆధ్యాత్మిక చింతనకు అవరోధాలు కావు – కాకూడదు. భౌతిక సంపదల పెంపుదలకు, సామాజికాభివృద్ధికి అవలంబించే ఏ మార్గమైనా ఏ సిద్ధాంతమైనా మనిషిలో ప్రకృతి సహజంగా ప్రజ్వలించే ప్రణయతత్వానికి, ప్రణవ చింతనకూ భంగం కలిగించకూడదు. సమతా సౌభాగ్య సమాజవేదిక మీద సరస సౌందర్య ప్రణయానుభూతి కోసం ఆరాటపడే

మానవజీవితం అనంతసృష్టి రహస్య దర్శనాకాంక్ష వీడనవసరం లేదు.

యోగ ప్రయోగాలు, అంతర్ బహిః ప్రకృతులు, ఆత్మగత ప్రజ్ఞాన పదార్థ గత విజ్ఞానాలు అన్వేషించే – దర్శించే – అనుభవించే మూలసత్యం ఒకటే. అందుకే మానవుని ఆర్థిక సామాజిక జీవితం, శృంగార జీవితం, ఆధ్యాత్మిక జీవితం ఎలా పరస్పర సమన్వయ సూత్రబద్ధాలో నిర్వచించి నిరూపించే సమతా సత్య ధర్మ ప్రతిపాదనయే సాహిత్య ప్రయోజనం అని అంగీకరించక తప్పదు. భావసత్యావిష్కరణమే భౌతికసత్యాధారమై మనిషి విశ్వాసాలనూ విలువలనూ మార్చివేస్తూ, మానవజీవితగతిని నిర్దేశిస్తున్నది. అనంతసత్యగర్భితమైన చరాచర, దృష్టాదృష్ట సృష్టిలో ఏసత్యాలు అవిష్కరిస్తే, ఏ భావాలు కల్పిస్తే సుఖానంద సుందర మానవజీవితానికి దోహదకారులౌతాయో అట్టి పరిణామ ప్రగతిశీల భావోద్దీపనం చేయాలి సాహిత్య దర్శకులు. ఏతత్ భావభౌతిక వాదమే నా సాహిత్య వాదమై ఈ కృతుల్లో శ్రుతిస్తున్నది. సమ్యక్ సమగ్ర సమైక్యానందాన్ని ప్రసాదించే ఈ నూతన సాహిత్యమార్గమే భావితరాలకు శ్రీరామరక్షగా, భౌతికాధ్యాత్మిక అద్వైతజ్ఞానభిక్షగా నేను భావిస్తున్నాను. ఈ "నాదేశం నవ్వుతూంది" సత్య సాహిత్యరసోద్దీపమైన సామాజిక ప్రగతి ప్రబోధాన్ని పాఠకలోకానికి అందించగలదు అని ఆశిస్తున్నాను. సంకుచిత, శృంఖలిత వినాదాత్మక వలయంలో చిక్కుకుంటున్న నేటి సాహిత్య విహంగానికి ఈ త్రిముఖాత్మకమైన అనంతస్వేచ్ఛ స్వేచ్ఛా నాదరోదసి ఆనందపక్షాలందించుగాక! శక్తి, రక్తి,భక్తి కాంతిధారలు చిమ్మే భావజ్యోతులకు ఏకైక సుందరశుభంకర సత్యసాగరమే అఖండ తైలధారయౌగాక!......

*(నాదేశం నవ్వుతూంది – 1986)*

## 8

............... ప్రణయమైనా, ప్రణవమైనా, ఆర్థిక ప్రగతియైనా ఆనందమయ మానవజీవిత సాధనమై తోడ్పడాలి. నవరసభరితమైన జీవితం నిర్వచించే నిర్దేశించే ఆదర్శం ఆశయం ఒకటే. అభ్యుదయ శీలక ఆనందోన్ముఖిత అన్ని భావధారల్లో ఆవిష్కృతమైనపుడే, పరస్పర సమన్వయీకృతమైనపుడే, సిసలైన సాహిత్య దర్శనం అవుతుంది.

అందుకే, అహం బ్రహ్మాస్మి, త్వమేవాహం అనే అద్వైతవాదానికీ, మనుషులంతా ఒక్కటే, మనిషి జీవితపు విలువలు, విజయాలు మనిషి చేతిలోనే ఉన్నవి అన్న మార్క్స్ వాదానికి అట్టే తేడా లేదు. మనిషీ మనిషీ సమానులు లేక మనిషీ దేవుడూ సమానులే అన్నా ప్రతిపాదితమయ్యే సమతావాదమొకటే

– సత్యానుభూతి ఒకటే. సమతా సత్య దర్శనం కలిగించే ఏ సాహిత్యమైనా అభ్యుదయగామియే, సమాదరణీయమే. ప్రణయం – ప్రణవం – ప్రగతి – ఈ మూడు పరిధుల్లో స్థాయిల్లో, సత్యానుభూతి కలుగుతూ ఉంటుంది. అనంతసత్య గర్భితమైన ప్రకృతిలోనుంచి, మానవ ప్రకృతిలోనుంచి ఈ త్రిముఖాత్మక త్రివిధానంద జీవితానుభూతులు అవిష్కృతమౌతున్నవి. అవి పరస్పర విలక్షణమైనవే కాని విరుద్ధాలు కావు.

కుక్క మొదలు కువలయం వరకు, గ్రామసీమలు మొదలు వ్యోమసీమలవరకు విస్తరించిన కవితావస్తు వైవిధ్యం ఇందులో చోటు చేసికొన్నది. కుటుంబ సంక్షేమమైనా, మానవకుటుంబ సంక్షేమమైనా అభ్యుదయశీలకవితాదర్శనంగా అభివ్యక్తమైంది. నవసమాజ నిర్మాణానికి, సమ సమాజ సాధనకు సర్వ మానవ సౌభాగ్యదీప్తికి దోహదం చేసే శక్తి "మన చేతుల్లోనే ఉంది" అన్న ఆత్మ విశ్వాసాన్ని ఈ కవితా సత్యాలు కలిగిస్తామని ఆశిస్తున్నాను. భావసత్యాల విశ్వసనీయ పరిణామమే భౌతిక జీవితానుభూతులౌతాయనే నా భావ భౌతిక దర్శన వాదానికి కూడా ఈ గ్రంథం లక్షణము లక్ష్యము కావాలని ఆకాంక్షిస్తున్నాను.

*(మన చేతుల్లోనే ఉంది – 1986)*

## 9

..........లోకాన్ని చీకటి ఎన్ని రుపాల్లో ఆవరిస్తున్నదో మనకు తెలియదు. ఒక రంగులో దాన్ని గుర్తించగానే అది మరో రంగులోకి మారిపోతుంది. చీకటిని చెడుకు సంకేతంగా వ్యంజిస్తున్నానని ఇక్కడ వేరుగా నేను చెప్పనక్కరలేదు. దుష్టశక్తులు దుష్టశక్తులుగా మనకు ఎదురైతే వాటిని మనం ఎదిరంచగలం. ఏదో విధంగా కొంతవరకు జయించగలం. కాని శిష్టత్వ రూపంలో తమ వ్యవహారాన్ని నడిపితే దుష్ట శిక్షణ కోసం, శిష్టరక్షణ కోసం " సంభవామి యుగే యుగే " అన్న పరమాత్మ కూడా ఇబ్బందిలో పడతాడు. శ్రీరామచంద్రునికి వాలి ఎవరో, సుగ్రీవుడెవరో తెలియనట్లే, భగవంతునికి కూడా మంచి ఏదో చెడు ఏదో తెలుసుకోలేనంత చీకటి రక్కసి మారువేషాలేస్తున్న రోజులివి. రూపం చూచి రుద్రుడే మోసపోతాడు. మరి రంగు చూసి మనిషి మోసపడటంలో ఆశ్చర్యం లేదు. కటిక చీకట్లు వేస్తున్న కాంతివేషాల గురించి మనిషిని హెచ్చరించడానికి నేను చేసిన ప్రయత్నమే ఈ "రంగు రంగుల చీకట్లు" కావ్యసంపుటి. తన రంగుల గుట్టు కనిపెడుతున్నామనే భయం కాస్త చీకటికి లిగించడానికి ఈ కవితా దర్పణం ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను.

ప్రణయ, ప్రణవ, సామాజిక ప్రగతి ధారలుగా సాగే నా కవితలన్నీ సమగ్ర జీవితానంద సత్యోన్ముఖాలే. ఈ భౌతిక ప్రపంచంలో సమతానంద సౌభాగ్య జీవితం గడపడానికి అందరికి హక్కుంది. - ఉండాలి. తదనుగుణమైన ప్రణయ ప్రణవ భావతత్వం కూడా మనిషికి ఆత్యావశ్యకం. ప్రణాయానికీ, ప్రణవానికీ సముచిత స్థానం కల్పించలేని సామాజిక భౌతిక ప్రగతి వాదాలు కేవలం నినాదాలుగా నిలిచిపోతాయి. ఈనాడు ప్రపంచంలో జరుగుతున్న విప్లవాత్మక సాంఘిక, రాజకీయ, ఆర్థికపరమైన మార్పులను, సుసంఘటిత సమగ్ర జీవితాదర్శ ప్రేరితాలే. స్వార్థం, మోసం, దోపిడి, సంకుచితత్వం, అజ్ఞానం వంటి దుష్ట శక్తులు సమతాసత్య సముద్దీపితమైన సంపూర్ణ జీవితానందానికి భంగం కలిగిస్తాయి. మనిషిలో దాగియున్న అలాంటి మాయాశక్తులను కనిపెట్టి జయించవలసింది కూడా మానవుడే. అందుకే ఈ "రంగు రంగుల చీకట్లు" జీవిత క్షేత్రంలో వెలుగుచే ఛేదింపబడుతున్న చీకటి వ్యూహాలకు కళాత్మక చిత్రణం. మనిషిలోని దానవత్వాన్ని మానవత్వముగా, మానవత్వాన్ని దైవత్వముగా మలచడానికి నా కవితాయజ్ఞం తోడ్పడుతుందని విశ్వసిస్తున్నాను............

*( రంగు రంగుల చీకట్లు - 1990 )*

# 10

............ ఈ ప్రణవ ప్రణయం ఒక ప్రయోగాత్మక రసానంద కావ్యం. ప్రేయసీ ప్రియులు, సతీపతులు ఇందులో పాత్రలు, ఒక కవిత "అతడు" వినిపిస్తే మరో కవిత "ఆమె" వినిపిస్తుంది. వారు భౌతికంగా సన్నిహితులైనా, ప్రేమయోగంలో తమను తాము అన్వేషించుకుంటున్న తాత్విక జీవులు. లౌకికంలో పారలౌకికాన్ని భౌతికంలో ఆధ్యాత్మికాన్ని దర్శించి పులకించే ధన్యజీవులు వీరు. ఇది కేవల శృంగార కావ్యం కాదు. రాగరసయోగ తత్వ కావ్యం. ప్రణవ ప్రణయ సత్యదర్శన కావ్యం. ప్రణవం - అనంత సత్య సంకేతం. ప్రణయం - సృజనానంద రసపాతం. ప్రణవతత్వాన్నీ ప్రణయ తత్వాన్నీ జీవిత సత్యాలుగా దర్శించడమే అనుభవించడమే ప్రగతి తత్త్వం. పరిపక్వ పరిపూర్ణ ప్రేమోన్ముఖి ప్రణయం. ప్రణవ ప్రణయ శక్తులు భౌతిక జీవితాన్ని పెనవేసుకున్న భావ సత్యాలు.

ప్రేమభావం చేతనే జీవాత్మ భౌతిక సంపదను తనదిగా చేసుకుంటుంది. మనం ప్రేమించగలిగేదంతా మనదే. తదితరం ఉన్నా లేకున్నా ఒకటే. స్త్రీ పురుషుల పరిపూర్ణ ప్రేమ బంధంలో, వారి దేహాత్మల పరస్పర సంయోగంలో

పరమానంద ప్రాప్తి కలుగుతుంది. మానవ శరీరం పట్టి మట్టి కాదు. జ్ఞాన కర్మేంద్రియాల ద్వారా స్వయం భూత పునర్భూత సృష్టిని అవగాహన చేసుకొని ఆనందానుభూతిని పొందడానికి సాధనం శరీరం. అది ఆత్మాధీన సాధనమే అనుకున్నా ఆత్మానందమే జీవిత లక్ష్య మవుతున్నది. "ఆనందో బ్రహ్మ" అన్న ఉపనిషత్ సూత్రం జీవిత తత్వాన్నీ, సత్యాన్నీ నిర్వచిస్తున్నది - నిరూపిస్తున్నది. భౌతిక సత్యాన్ని పరతత్వాన్ని జోడించే పరిమళ సోపానం ప్రణయం. అందుకే ఈ "ప్రణవ ప్రణయం" భౌతిక సత్యాత్మక భావానంద లహరి.

ప్రణయ శక్తి, ప్రణవ శక్తి, భౌతిక ప్రగతి శక్తి, - ఈ మూడు శక్తులు ఇంద్రియబద్ధమైన మానవుని దేహాత్మలనుండే ప్రబుద్ధమౌతున్నవి. ఇవి విలక్షణమైనవే కాని పరస్పర విరుద్ధమైనవికావు. పైగా పరస్పర దోహదకారులు. భౌతిక సంపద, బౌద్ధిక వికాసానికీ, ప్రబుద్ధ బుద్ధి శక్తి, పరిపూర్ణ ఆత్మజ్ఞాన దీప్తికి ఉపకరించాలి. అందుకే ప్రకృతి పురుష యోగతత్వం ప్రతిఫలించే ప్రణయతత్వం కూడా మానవ జీవితానంద సత్యం కావాలి.

ఈ పుస్తకానికి పీఠిక వ్రాయమని రసాద్వైత వాది సాహిత్య తత్త్వవేది అయిన కళాప్రపూర్ణ పద్మశ్రీ బోయి భీమన్న గారిని అడిగితే, ఒక రమ్యాక్షర మంత్రాక్షరితో నన్ను దీవిస్తూ, ఇలాంటి గ్రంథానికి వ్రాయవలసింది పీఠిక కాదు ఒక థీసిస్సు అన్నాడు. ఈ విషయం చెప్పితే సత్య సాహిత్య మర్మజ్ఞుడైన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు అవునన్నారు. ఆ పని ఎవరో చేసే దాక వేచివుందాం.............

(ప్రణవ ప్రణయం – 1989)



# భౌతికమే ఆధ్యాత్మికం

శరీరం, ఆత్మ కలిసి రూపొందిన ఒక అపురూప అస్తిత్వం మనిషి. అయితే భౌతిక శరీరం, దివ్యాత్మ మా నవజీవితం ద్వారా సాధించే కామితార్థాలు భిన్న భిన్నమైనట్లు మనకనిపిస్తుంది. ఆత్మ-శరీరం విభిన్నమైనవనీ, అవి పరస్పర విరుద్ధమైన గమ్యాలు, స్వభావాలు కలిగి ఉన్నాయనీ విశ్వసించడం జరుగుతున్నది. పరమాత్మ - జీవాత్మ తత్వాలను, శాశ్వత సత్యాలను గ్రహించడం కోసం, పరస్పర విరుద్ధ ప్రభావాలను, పరమావధులను సమన్వయీకరించడం కోసం యుగయుగాలుగా మన వేద ఋషులు, విజ్ఞాన సిద్ధులూ ప్రయోగాలు పరిశోధనలు చేస్తూనే ఉన్నారు. స్థూల రూప శరీరం, దాన్ని ఆవహించినట్లు భావిస్తున్న సూక్ష్మ జీవాత్మకు గల పరస్పర సంబంధాన్ని నిర్వచించడం, నిరూపించడం సాధ్యపడటం లేదు. కారణమేమిటంటే ఏ ప్రయోగం, విశ్లేషణం అయినా కనిపించే దేహం మీదనే కాని కనిపించని ఆత్మమీద చేయలేకపోవటం; శరీరం, దాన్ని అంటుకొని ఉన్న మనస్సు, బుద్ధికంటే భిన్నంగా వాటి కతీతంగా అప్రతిహతమైన ఆత్మ ప్రకాశిస్తూ ఉంటుందని అనుకోవటమే. అన్ని జ్ఞానాలను తనువుకూ, మనసుకూ, బుద్ధికీ అందిస్తున్న ఆత్మ "ఆత్మజ్ఞానాన్ని" మాత్రం వీటికి అందించడం లేదని నిందించవలసివస్తుంది. లేక, అన్ని జ్ఞానాలు ఆత్మరూపాలే అనుకుంటే ఆత్మ శరీర విభేదాలు, ఇహపరవాద వివాదాలు ఉండవు.

జన్మకు పూర్వం, మరణానంతరం మనిషి ఉనికి ఏమిటి అన్న మౌలిక ప్రశ్న నుండే మానవ జీవితసత్యం, తత్వం, లక్ష్యం గురించిన సిద్ధాంత రాద్ధాంతాలు వెలువడుతున్నాయి. మన శాస్త్రాలలో పురాణాలలో ప్రతిపాదించబడిన సూత్రాలను, సిద్ధాంతాలను విచారధారలను ఖండించడమో, సమర్థించడమో నా అభిమతం కాదు. అస్తికత్వ, నాస్తికత్వ దర్శనాల గురించి గాని మతపరమైన, కర్మకాండపరమైన ఆచార వ్యవహారాల గురించి గాని మిమ్ముల్ని ఏసిగించను. భౌతిక మానవజీవితంలో ఆధ్యాత్మికతకు ఉన్న స్థానం ఏమిటి అన్న అంశాన్ని గురించి నా సంతృప్తికోసం, మీ పరిశీలన కోసం కాస్త విశదీకరిస్తాను. నా ఆలోచన సనాతనంగా వస్తున్న ఆధ్యాత్మిక చింతనకు అనుగుణంగా లేకపోవచ్చు. అంతమాత్రం చేత నాది నేల విడిచిన సాము కాదు; పరంపరాగత ఆధ్యాత్మిక సాహిత్య సారాన్ని పారబోసే జారుపాటు కాదు. వేదాలలో, గీతోపనిషత్తుల్లో, బ్రహ్మ సూత్రాలలో ప్రతిపాదించిన జీవితసత్యాలను వాస్తవీకరించడమే నా

ప్రయత్నం. ప్రస్థానత్రయ ప్రస్థానాలకు ప్రయోజనాత్మక జీవనరూపమే నా ఈ స్వేచ్ఛాభావదీపం. పరమాత్మ పరమసత్యం వంటి వేలారహిత విచారణాం బుధిలో హేతుబద్ధమైన స్వతంత్ర బుద్ధితో మునకలిడుతూ ఉంటే నా అంతరాత్మలో వెలిగిపోయే సత్యాలముత్యాలను మీతో పంచుకోవడమే నా అభిమతం. ప్రాచీన ఋషులు మొదలు, అర్వాచీన మేధావులవరకు హిమాలయోన్నతంగా చేసిన జీవితాధ్యయానాన్ని నా స్వతంత్ర సత్య సాహిత్య దృష్టితో చూచి వేస్తున్న వెర్రి కేకలే కావచ్చు ఇవి.

ప్రపంచ ప్రజలు ముఖ్యంగా భారతదేశం వంటి ప్రాచ్య దేశాలలోని బుద్ధిజీవులు, భౌతికవాస్తవికాల వెనుక ఒదిగిఉన్న "ఆధ్యాత్మికత"ను గురించి, ఆపుకోలేని ఉత్సుకత చూపుతూనే ఉన్నారు. మనిషితన దైనిందిన వ్యవహారంలో , పరిసరాల ప్రభావంలో తనను తికమకపెట్టే పరస్పర విరుద్ధ ద్వంద్వ ప్రకృతుల మధ్య ఘర్షణ పడుతూనే ఉంటాడు. మంచి-చెడు, సుగుణం-దుర్గుణం, న్యాయం-అన్యాయం, ప్రాపంచికం-పారమార్థికం, శరీరం-ఆత్మ, భ్రమ-ప్రమ , వెలుగు-చీకటి వంటి పరస్పర విరుద్ధ ప్రకృతులు అనుదినం మనిషిని వేధిస్తుంటాయి గదా! స్థూలంగా మనిషి ఈ దిగువ ఉదాహరించిన ప్రత్యామ్నాయ జీవిత మార్గాలను లక్ష్యాలను అనుసరిస్తున్నాడు.

(1) శాంతి -ఆనందం సాధించడం కోసం భౌతిక అవసరాలకు, ఇంద్రియ స్పందనలకు అనుగుణంగా వ్యవహరించడం - జీవించడం - తన సంగతి తాను చూచుకోగల ఆత్మ యొక్క విమోచనం గురించి అంతగా పట్టించుకోకపోవటం.(శరీరం నుంచి శరీరానికి).

(2) మహోన్నతమైన ఆధ్యాత్మికానందం కోసం మామూలు భౌతిక సుఖాలను, సౌకర్యాలను త్యాగం చేయటం (శరీరంనుండి ఆత్మసన్నిధికి)

(3) భౌతిక, శారీరక వాంఛలను, సుఖ సంపదలను పరమాత్మ పరంచేసి, ఇహలోక జీవితాన్ని పరలోక పరమానందసాధనంగా మలచుకోవటం (ఆత్మనుంచి పరమాత్మలోకి)

ఈ మూడు ప్రత్యామ్నాయ జీవిత ప్రస్థానాలలోని ఉమ్మడి అంశం - ఆనందపిపాస అంటే, జీవ చైతన్యం సుఖానందోన్ముఖి. అయితే ఒక మార్గానికి మరొక మార్గానికి తేడా ఎక్కడ ఉంది? ఆనందనాన్ని మనం నిర్వచించే తీరులో ఉంది. ఆ ఆనందం అనుభవించడానికి నిర్దేశించే లోకంలో వుంది. ఇక్కడే భౌతిక వాదానికి, ఆధ్యాత్మిక వాదానికి పరస్పర ఘర్షణ ఏర్పడుతున్నది. అయితే

ఈ విరోధానికి హేతువు దేహమూ కాదు; ఆత్మా కాదు. సహజానుభవసత్యాన్ని, కృత్రిమ భ్రమా భ్రమర భ్రమణతత్వంలో ముంచిన పలాయన మనస్తత్వానిది.

అనుభవగ్రాహ్యముకాని అతీతక జ్ఞానాన్ని గురించిన సాహిత్యాన్ని ...వ్యాలను నేను చిత్తశుద్ధితో సమాలోచనం చేసిన తర్వాత నాకు కలిగిన అనుభూతి, ఆత్మానాత్మసంయోగ జీవనగీతి. అంటే ఆత్మవ్యక్తి అయితే, శరీరం దాని అభివ్యక్తి. శరీరం లేని ఆత్మకు అస్తిత్వం లేదు. అస్తిత్వం లేని ఆత్మకు ఆనందానుభూతి లేదు. సృష్టి స్థితి లయ స్పృహ లేదు. అందుకే ఆత్మ ఔన్నత్యాన్ని చాటడానికి భౌతిక శరీర పాత్రను కించపరచడం పరమానందయ్య శిష్య లక్షణం అవుతుంది. ముక్కు మీది ఈగను కొట్టబోయి ముక్కును బ్రద్దలు కొట్టినట్లవుతుంది. ఆత్మ శక్తి ప్రశంసకు శరీరరక్తి అభిశంస తోడ్పడదు. ఆత్మ శరీరం వేరు వేరనే మాయాకల్పితాన్ని మాయం చేయటానికి నా సత్యాన్వేషణ తోడ్పడుతున్నది.

సంప్రదాయఛాందస ఆత్మవాదం భూలోక జీవితం కేవలం భ్రాంతి మయమనీ అశాశ్వతమనీ ఆరోపిస్తుంది. ఈ ఆత్మ పక్షపాత సిద్ధాంతం, సశరీర ఆత్మ పొందే భూతల జీవితానుభూతులను అభిశంసిస్తూ ఆదివ్యాత్మ జీవన్ముక్తి పొందిన తర్వాత పరలోకంలో పొందే పరమానందాన్ని శ్లాఘిస్తుంది. ఈ దృష్టికి భిన్నమైన, ఇహమే సర్వస్వమనే చార్వాకాది వాదాలు కూడ ఉన్నాయి. పరమాత్మ, దేవలోకాలు కేవలం భావనాత్మక భ్రాంతి స్థితులు, మానవులూ వారి భూలోక జీవితమే యథార్థమూ సార్థకమూ అయిందని వారి విశ్వాసం.

ఆధునిక విజ్ఞాన శాస్త్రాన్ని, ఆధ్యాత్మిక భావసత్యాన్ని సమన్వయ పరచలేని ఏ సిద్ధాంతమైనా వట్టి రాద్ధాంతమే అవుతుంది. ఉన్న సత్యం ఒక్కటే అయినపుడు దాన్ని వెతుకుతున్న దారులు, తీరులు ఎన్ని అయినా అసలు సత్యం మారదు. అందుకే ఆంతర్ముఖియై, యోగమార్గంగా,అంతర్ ప్రకృతిని పరిశీలించి సాధించే ఆత్మజ్ఞానమైనా లేక బహిర్ముఖియై, ప్రయోగ మార్గంగా, బహిః ప్రకృతిని పరిశోధించి ఆర్జించే పదార్థజ్ఞానమైనా నిరూపించే నిర్దేశించే సత్య మొక్కటే. ప్రకృతి శాస్త్రజ్ఞానంలో భగవంతుడు చచ్చిపోతే, ప్రణవాత్మజ్ఞానంలో బ్రతికిపోడు. మనకు ప్రాపంచిక జ్ఞానాన్నీ పారమార్థిక జ్ఞానాన్ని ప్రసాదించే శక్తి సాధనం శరీరమా ఆత్మనా అనే వివాదం ఏ వేదం సృష్టించిందో తెలియదు. శరీరాన్ని సృష్టించే కర్మాగారం రాక్షసుల చేతుల్లో, ఆత్మను ప్రసాదించే పరిశ్రమ దేవతల చేతుల్లో ఉన్నట్లుగా మన శరీర-ఆత్మ తత్వాలను అన్వయించుకుంటున్నాం. భూలోకాన్ని అపవిత్రంగా ఒక బుద్ధిహీను డెవడో

సృష్టించినట్లు, పరలోకాలను మాత్రం పరమపూజ్యుడైన పరమాత్ముడు నిర్మించినట్లు ప్రతిపాదించే వాదించే వేదాంతాలను, మత సూత్రాలను నమ్మితే రెంటికి చెడ్డ రేవళ్లమే అవుతాం. ఈ సృష్టిలో మన భూలోక మొక్కటే లేదు; లెక్కకు మించిన లోకాలున్నాయన్న పరమసత్యమే కాదు పచ్చి నిజం కూడా. వాదిస్తూ వాదిస్తూ కూర్చునే వెర్రివాళ్లకంటే శోధిస్తూ, శోధిస్తూ పోయే కుర్రవాళ్లకే సత్యం అఖండంగా, అనంతంగా, అద్వైతంగా సాక్షాత్కరిస్తుంది. భౌతికభావలోకాలకు అంతరం లేదన్న ఆంతర్యం అవగతమౌతుంది. ఆత్మకు శరీరానికి ఆధారం ఒకటే అన్న సత్యం ఆవిష్కృతమౌతుంది. ఈ సత్య దృష్టిని సాధించడానికి దిగువ ఉదాహరించిన సరిక్రొత్త సూత్రనేత్రాలను తెరుద్దాం.

(1) ఈ నాటికీ ఏనాటికీ మనం తెలుసుకోజాలని 'అనంతత్వం' అనే దేదో ఉన్నది. ఊహించరాని దాని శక్తి దృశ్యాదృశ్య పదార్థాల సృష్టి ప్రతిసృష్టి చేస్తున్నది. ఆ మహాసృష్టిలో విడదీయరాని అంతర్భాగమే గాలిలో తేలియాడే ఈ మట్టి గోళం; దాని మీద ప్రాకులాడే జీవజాలం.

(2) స్వయంభూపరమాత్మనుంచి వెలువడే జీవాత్మలు శారీరక రూపాలు ధరించి భౌతిక జీవితాన్ని అనుభవించడానికి భూలోకం మీద అవతరిస్తున్నవి.

(3) దివ్యమూ కానిది, భవ్యమూ కానిది ఈ దేశ కాల లీలా సృష్టిలో లేదు. అందుకే సప్త సింధుబంధురమైన భూలోకం కూడా పాపాల పుట్టకాదు, పుణ్యాల తేనెపట్టే.

(4) జనన మరణాల మధ్య కాలం వ్రేలాడగట్టిన కాంతిరేఖలాగా వెలిగిపోయే జీవితాలకు ఈ భూమి మీద అందుబాటులో ఉన్న సుఖశాంతులను, మరణానంతరం ఏవో పరమసత్యలోకాలలో ప్రాప్తమౌతాయని భావించే ఆనందాల కోసం త్యజించవలసిన అవసరం లేదు.

(5) పంచేంద్రియానుభవం, పరమాత్మానుభూతి - ఈ రెంటినీ సమకూర్చుకొనేది సశరీతాత్మయే - కాగా ఆ రెండు పరస్పర దోహదాలే కాని విరుద్ధాలు కావు.

ఇలా అనుకున్నప్పుడు, యదార్థ ప్రపంచాన్ని, పరమార్థ సాధక విభిన్నంగా చూచే ఆస్తికదృష్టినీ, నాస్తిక దృష్టినీ సమన్వయపరచె త్రికరణ బుద్ధి లక్ష్యం సశరీరాత్ములైన జీవుల సమగ్రసంపూర్ణసౌభాగ్య సిద్ధియే అవుతుం.

మనిషి కేవలం ఒక మట్టి బొమ్మగా, అందులో చేతికి చిక్కకుండా విహరించే ఆత్మ ఎప్పుడో ఏ వేళనో తుర్రుమని ఎగిసిపోగానే కూలిపోయే

పేకమేడగా భావించారు. పంచభూతాలలో శరీరం కలిసిపోతే, పరమాత్మలో ఆత్మలీనమై పోతుందని కూడా భావించారు. అయితే పరమాత్మలేని చోట పంచభూతాలు ఉంటాయని ఎలా ఊహించారో! నిజానికి నేను దీనికి వ్యతిరిక్తంగా భావిస్తున్నాను. ఆత్మ ఈ భూలోకానికి పంచేంద్రియ సాధనాలతో భౌతికానుభూతిని పొందడానికి అవతరిస్తుంది. పంచేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు ఆత్మ పాలిటి శక్తిగా దాని కామితార్థాల అభివ్యక్తిగా పరిగణించాలి. కనిపించే శరీరం గానీ, కనిపించని ఆత్మ గానీ ఈ అనంతసృష్టిని దాటి పోలేవు . ఇది ఎంతటి భౌతిక సత్యమో అంతటి ఆధ్యాత్మిక భావ సత్యం. స్వేచ్ఛాశీలి, శక్తిశాలియైన ఆత్మ, భూగోళం మీద పాపపంకిలమూ బాధామయమూ అయిన వ్యర్థ జీవితాన్ని అనుభవించడానికి కావాలని మానవ శరీర బంధనంలో ఎందుకు చిక్కుకుంటుంది? పరమాత్మలోనో పరలోకాలలోనో లేని సుఖ మేదో సశరీర మానవ జీవితంలో ఉంటేనే కదా స్వరాట్ విరాట్ స్వరూపియైన ఆత్మ స్వచ్ఛందంగా ఈ మట్టి లోకంలో పుట్టి పెరుగుతుంది. ఎన్నెన్నో లోకాలలో భిన్న భిన్న ఆనందస్పందనాలు అనుభవించడానికే చిత్ర చిత్ర దేహధారణ చేస్తూ ఈ మహిమాన్వితాత్మ రోహావిహారాలు చేస్తుంటుంది. శరీరం ఆత్మ అవలంబించిన కామరూపంగా తప్ప మరో విధంగా ఊహించడం హాస్యాస్పదం. ఇంద్రియ వ్యాపారం, మనసు బుద్ధి వ్యవహారం కూడా ఆత్మస్పందనలే అని తెలిపికోలేకపోవటం ఆత్మవంచనయే అవుతుంది. తప్పైనా ఒప్పైనా చేసేది, చేయించేది ఆత్మే. స్వేచ్ఛాధికారియైన ఆత్మ ఆదేశాలకు వ్యతిరేకంగా తనువు , మనసు, బుద్ధి తిరుగుబాటు చేస్తాయనుకోవటం తనవ్రేలితో తన కన్నే పొడుచుకోవటం. ఆత్మ జ్ఞానం లేనప్పుడు తక్కినదంతా అజ్ఞానమే. ఆత్మ కనుమూస్తే అజ్ఞానం, తెరిస్తే ప్రజ్ఞానం. అజ్ఞాన ప్రజ్ఞానాల మధ్య జరిగే విజ్ఞాన విలాసహేల మానవజీవితలీల. సృష్టి చేసింది దేవుడు; దాన్ని వాడుకుంటున్నది జీవుడు అనుకుంటే ద్వైతం. దేవుడుగా సృష్టించి జీవుడుగా అనుభవిస్తున్నాడు అనుకోవడం అద్వైతం. ఈ ద్వైతా ద్వైత వలయంలో విహరించేది జీవితం. జీవితం ఆత్మదా శరీరందా అనే తర్కం, వేదాంతం. దానికి లేదు ఆది అంతం.

ఈ లోకం మాయ అయితే ఏ లోకమైనా మాయే. శరీరం బుద్బుదమైతే, ఆత్మకూడా క్షణ భంగురమే. దైవం ఇక్కడ లేకుంటే ఎక్కడా లేనట్లే. ఇహం పరానికి సోపానం అయితే పరం ఇహానికి నిచ్చెన అవుతుంది. ఈ ఆత్మానాత్మ సమతాతత్వమే త్వమేవాహ, తత్వమసి సత్యమవుతుంది. శరీరపరమైన భౌతిక వాదానికి, ఆత్మపరమైన అధ్యాత్మిక వాదానికి మధ్య, తల ఎత్తే మౌలిక

సంఘర్షణకు తావుండదు. మార్క్స్ అయ్య చెప్పిన సమతాసమాజ విధానానికి, మాధవయ్య చెప్పిన సమదర్శనాత్మ ప్రబోధానికి మధ్య అంతరం అంతరిస్తుంది. ఆనందమయజీవత లక్ష్యం శరీరాన్ని ఆత్మను విడదీసేది కాదు. ముడివేసేది. మనిషి మనిషిని దోచుకొనే, పీడించే సమాజవ్యవస్థలో ఆత్మ క్రీడిస్తుందనుకోవడం భ్రాంతి.

ఒక వేళ ఈ లోకం మిధ్య అయితే ఈ మానవజీవితం మాయే అయితే మరి ఆ భగవంతుడు మనిషినీ అతని మట్టిగోళాన్ని సంరక్షించడానికి అన్ని అవతారా లెందుకెత్తాడో, అందరు దేవదూతలను ఎందుకు పంపించాడో చెప్పడం అసాధ్యం. ఆత్మజ్ఞానం "అహంబ్రహ్మాస్మి" అనే అసలైన ఉపనిషత్ ధర్మాన్ని పెంపొందించాలి. ధనవంతులూ – దరిద్రులూ ఒకరితో ఒకరు ఆత్మీయంగా "త్వమేవాహం" అంటూ సంపూర్ణ సమతాభావంతో మెలిగేటట్లు చేయాలి. ఆత్మానందతత్వం యొక్క పరమావధి వ్యక్తినీ, సమాజాన్నీ ఏకకాలంలో సమగ్రాహసమాచరణ చూపేదిగా ఉండాలి.

శారీరక సౌఖ్యాలు, భౌతిక భాగ్యాలు మానవజీవితానికి అంత ప్రధానం కాదనే వేదాంత వైరాగ్య దృష్టికి కూడా దోషం లేదు – అది, మనిషిని ఆవహించే స్వార్థపూరిత దౌర్జన్యాలను, పేరాశాదురాశా పూరిత సముపార్జనలను విస్మరించాలనే సామాజిక లక్ష్యాలకు దోహదం చేస్తుంది. "సర్వేజనా స్సుఖినోభవంతు" అనే లోక కళ్యాణ బుక్కును ప్రతీ వ్యక్తి పాటించి తనకు ఉన్న అవకాశాలను, సంపదలను తోటి మానవులతో పంచుకోవడానికి ప్రోత్సహిస్తుంది. ఆధునిక సమతాభ్యుదయ సామ్యవాదాలన్నీ "సర్వేజనా స్సుఖినోభవంతు" సత్యసూత్ర సంతువులే. అందరికీ ఆనందం అనే మానవతా జీవనగీతిలో సర్వ సమతా సమాజరూపం, వ్యక్తి సౌభాగ్యదీపం ప్రజ్వలిస్తుంది. అందుచేత ఆధ్యాత్మిక జీవన పథం భౌతిక ప్రగతికి, వస్తు సంపద వికాసానికి కూడా తోడ్పడుతుంది. తద్వారా ప్రాపంచిక సౌఖ్యాలను, అనుభవాలను పంచుకోవడం కోసం మానవ రూపమెత్తి ఆత్మల కామితార్థం నెరవేరుతుంది. అప్పుడు కృతకమైన పరస్పర విరుద్ధాలలోని హానికర ప్రవృత్తులు క్రమంగా సహాయకర ప్రవృత్తులకు లొంగిపోయి జీవితాన్ని నిరంతరం సహజ సిద్ధమై సంపూర్ణ సమగ్ర గ్రాహకానందం వైపు నడిపిస్తుంది.

మనం అందుకోలేనిది అర్థం చేసుకోలేనిది "ఆధ్యాత్మికం" అని మనం విజ్ఞాన విశ్లేషణలలో తెలుసుకుంటాం. అనంతమైన దేశ కాలాలు వాటి అంతు చిక్కనీయవుకాబట్టి. అందుకే తరతరాలుగా, యుగయుగాలుగా మానవజాతి జీవాత్మ–పరమాత్మ తత్వాన్ని, శాశ్వత సత్యాన్ని అవగాహనచేసుకోవటం కోసం

అన్వేషణ కొనసాగిస్తూంది. అగమ్యగోచరమైన మానవానుభూతిని అర్థం చేసుకోవాలనే తపనే ఆధ్యాత్మిక చింతన. ఈ ఆధిభౌతిక , ఆధి దైవిక, ఆధ్యాత్మిక తాపత్రయమే భౌతిక శక్తుల శోధనంలో, లోకాతీత సత్యసాధనంలో ఉపకరిస్తుంది. చీకటి తెరమీద మనం నగ్న నయనాలతో దర్శించే కోటానుకోట్ల చుక్కలు కాంతి భ్రాంతి శకలాలు కావు. ఒక్కొక్క తార ఈ భూగోళం కంటే, సూర్య గోళం కంటే కూడా విశాలమైన కాంతిలోకం అని గ్రహించవలసి వుంది. ఈ జగత్తు నుంచి వాటి దూరం కాంతి సంవత్సరాలలో మాత్రమే నిర్ధారించడం సాధ్యమవుతుంది. స్థూలంగా చెప్పాలంటే సెకండుకు 1,86,000 మైళ్ల చొప్పున మనం ప్రయాణం చేయగలిగితే మనకు అతి సమీపంలో ఉన్న చుక్కను చేరుకోవటానికి కొన్ని సంవత్సరాలు పడితే, అతి దూరంలో ఉన్న తారను చేరడానికి వేల వేల సంవత్సరాలు కూడా పట్టవచ్చు. అంటే ఇప్పుడు అక్కడ జరుగుతున్న సంఘటనలు మనకు లక్షలాది సంవత్సరాల తర్వాతే కనిపిస్తాయి. ఇక మన కంటికి కనిపించని ఆత్మ పరమాత్మాది అతీత శక్తులు ఉన్నాయా! ఉంటే వాని ఉనికి ఎక్కడ అనే వాద వివాదాలు, మన కంటికి కనిపించే ఈ అభూత భౌతిక సృష్టి ముందు అర్థంలేని అవేశాలు కావా! కళ్ళకు కనపించే యధార్థ పదార్థాలను చేరుకోవడమే సుదూర భవిష్యత్ మానవజాతి చరిత్రకు గానీ, మరే జాతి చరిత్రకు కాని సాధ్యపడనప్పుడు, కలలో కూడా కనలేని ఈమహాభావసత్యాలను గూర్చి కొట్లాడుకొని చావడం పరమ మూర్ఖత్వం కాదా!

ఎంతటి విజ్ఞాన శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం సముపార్జించినా, జ్ఞాతానికీ – అజ్ఞాతానికీ మధ్య ఉండే అంతరం పెరుగుతుందే కాని తరగదు. భౌతికమే ఆధ్యాత్మికమనే సత్యస్ఫూర్తి కలిగితేనే తప్ప మానవజీవితానికి జ్ఞాన దీప్తి లేదు; ఆనంద ప్రాప్తి లేదు. తెలిసికున్నదానిని తెలిసికోలేనిదానికి సంధానం కల్పించగలగాలి. పరిమితానికి అనంతానికి అవినాభావ సంబంధం ఏర్పరచగలగాలి. ఇహపరాలను మేళవించే ఒక సమగ్ర, ప్రయోజనాత్మక ఆనందసూత్రంతో మానవజీవితం ముడిపడాలి. ఈ ఆత్మతత్వం సమతా సౌభాగ్యన్యాయాల పునాదిపై సామాజిక ఆర్థిక వ్యవస్థను ప్రతిష్ఠించడానికి తోడ్పడాలి. శరీరం ఆత్మానందాన్నీ , ఆత్మ ఇంద్రియానందాన్నీ అనుభవిస్తూ తరించాలి.



## బాపురెడ్డి గారి కొన్ని ముఖ్య రచనలు......

బాపురెడ్డి పద్యకావ్యాలు

బాపురెడ్డి గేయనాటికలు

అనంత సత్యాలు

శ్రీకార శిఖరం

నాదేశం నవ్వుతూంది

ప్రేమారామం

మనచేతుల్లోనే ఉంది

పంచబాణసంచా

ప్రణవ ప్రణయం

రంగురంగుల చీకట్లు

*In quest of Harmony*

*Longing For Life*

*Urn of Love*

అనువాదాలు :

వ్యవధిలేదు

పైకెత్తాలి.